శ్రీ:ఓం

# జైన ధర్మం
# అమూల్య తత్త్వజ్ఞానం


గుజరాతీ మూలం

శ్రీ ధనంజయ జె. జైన్. "ప్రేమకేతు"

సి.10, అరిహంత్ సొసైటీ, చౌథామాలా,

దామోదర్ వాడీకె సామ్‌నె, అశోక్ చక్రవర్తి రోడ్,

కాందివలీ (పూర్వ్), ముంబయి - 400 101



తెలుగు రచన

కళాగౌతమి, భాషాప్రవీణ, విశ్రాంతాచార్య

డా. బులుసు వేంకటసత్యనారాయణమూర్తి

6-13-15, టి.నగర్, రాజమండ్రి - 533 101

## పంచ పరమేష్ఠి స్తుతి

అర్హన్తో భగవన్త ఇంద్రమహితా: సిద్ధాశ్చ సిద్ధి స్థితా:
ఆచార్యా జినశాసనోన్నతికరా: పూజ్యా ఉపాధ్యాయకా:
శ్రీ సిద్ధాంత సుపాఠకా మునివరా: రత్నత్రయారాధకా:
పంచైతే పరమేష్ఠిన: ప్రతిదినం కుర్వన్తు వో మంగలమ్॥

## నవకార మంత్రం

నమో అరిహంతాణాం నమో సిద్ధాణాం
నమో ఆయరియాణాం నమో ఉవజ్ఝాయాణాం
నమో లోయే సవ్వ సాహూణాం
ఏసో పంచ నముక్కారో సవ్వ పావప్పణాశనో॥

# 1 భగవానుడు

భగవానుని పేరు 'అరిహంత భగవానుడు', ఆయనకి వేరే పేర్లుకూడా ఉన్నాయి – వీతరాగుడు, జినేశ్వరుడు, తీర్థంకరుడు. భగవానుడు ఎలాంటివాడో తెలుసా? ఇదుగో ఇలాంటివాడు! ఆయనయందు రాగ,ద్వేషములు లేవు. మోహము,అజ్ఞానము లేవు. ఆ కారణముచేతనే ఆయన 'వీతరాగుడు','సర్వజ్ఞుడు' అని పిలువబడుతున్నాడు. 'వీతరాగుడు' అంటే రాగము,ద్వేషము వంటి ఏ దోషములు లేనివాడు. 'సర్వజ్ఞుడు' అంటే ఈ విశ్వమంతటిలోని సమస్త విషయాలను తెలిసినవాడు.

రాగము(ఆసక్తి)యొక్క పాపముచేతనే మనము ఈ ప్రపంచంలో దారితప్పి తిరుగుతున్నాం. అంటే మళ్ళీ మళ్ళీ జన్మమెత్తుతున్నాం. మళ్ళీ మళ్ళీ మరణిస్తున్నాం. చూడండి – సంపదమీదుండే రాగము చేతనేకదా! సోదరులమధ్య కలహం కలగడం. రాగమే ఈ సమస్త విశ్వానికి చైతన్యరహితమైన మూలం. ఈ రాగాన్ని భగవానుడు చైతన్యరాహిత్యంచేతనే నాశనం చేసుకున్నాడు. రాగము నశిస్తే ద్వేషము నశిస్తుంది. ఎప్పుడైతే రాగ,ద్వేషాలు నశించాయో అప్పుడు సమస్త దోషాలు నశించిపోయాయి. దీనితో జన్మ,మృత్యు సంబంధమైన ఈ సంసారం నశించిపోయింది. అంతట భగవానుడు 'వీతరాగుడు' అయ్యాడు.

అప్పుడు భగవానుడు 'జైన శాసన' స్వరూపమైన తీర్థాన్ని స్థాపనచేశాడు. ఈ కారణంగ ఆయన 'తీర్థంకరుడు' అనబడ్డాడు. ఈ జైన శాసనంద్వారా భగవానుడు వేలు,లక్షలాది జీవులను ఉద్ధరించాడు. కోట్లాదిమందికి కల్యాణం కలిగించాడు.

భగవానుడు రాగ,ద్వేష రహితుడైన 'వీతరాగుడు'
ఆయన అనంత గుణములచే పరిమళించు ఉద్యానవనం
భగవానుడు చెబుతాడు – "సోదరా! ఇప్పుడే నువ్వు మేలుకో!
పాప దు:ఖాలతో నిండిన ఈ సంసారంనుండి దూరంగా పారిపో!
జీవితంలో నిరంతరం తపస్సుని, త్యాగాన్ని ఆచరణలోకి తెచ్చుకో!
అలా చేస్తే నువ్వుకూడా నాలాగా 'వీతరాగుడ'వు కాగలుగుతావు.'

# 2 గురువు

గురువుని 'నిర్గ్రంథ సాధు భగవానుడు' అంటారు. 'నిర్గ్రంథు'డంటే మోహరూపమైన బంధనములనుంచి విముక్తుడైనవాడు. ఆయనే యదార్థమైన గురువు. ఎందుచేతనంటే, ఆయన తన జీవితమంతా 'వీతరాగుడు''జినేశ్వరుడు'నైన భగవానుని ఆజ్ఞను అనుసరిస్తూంటారు. దానితోపాటు చక్కని సంయమనాన్ని పాటిస్తూంటారు.

గురువు ఎలాంటివాడంటే ఆయనకి ఏ గ్రామంలోను నివసించడానికి 'ఇల్లు' ఉండదు. ఏ బజారులోనూ ఆయనకు 'దుకాణం' ఉండదు. ఏ ప్రాంతంలోనూ ఆయనకు 'వ్యవసాయం' ఉండదు. అలా అని, ఆయన ఏమీలేదని ఎప్పుడూ దీనత్వానికి, పేదరికానికి లోనుకారు. ఆయన దగ్గర తిరగడానికి 'సవారీ' లేదు. ఖర్చుపెట్టడానికి ఆయన దగ్గర 'సంపత్తి' లేదు. ఆయన ఎప్పుడూ ఏ సంపదను తన చేతితో స్పృశింపరు. ఏ స్త్రీని తన చేతితో తాకరు. ఆయన ఎల్లప్పుడూ పంచ మహావ్రతాలను(26చూడండి) ఆచరిస్తూ, అనుసరిస్తూ తన మానవ జీవనాన్ని శోభాయమానం చేసుకుంటుంటారు.

ఆయన తనకోసం తన ఆహారం తయారుచేసుకోరు. ఎవరిచేతను వంట చేయించుకోరు. ఆయనకి ఎక్కడా మఠంకాని, ఆశ్రమంకాని ఉండవు. ఆయన కాళ్ళకి చెప్పులుకాని, బూట్లుకాని ధరించరు. ఆయన తన దగ్గర గొడుగైనా ఉంచుకోరు. ఆయన ఎప్పుడూ ఎక్కడా ఏ సవారీమీదా ప్రయాణం చెయ్యరు. ఆయన ఎల్లప్పుడూ ఉత్తి పాదాలతోనే, జుట్టుకూడా లేని తలతోనే ఒక గ్రామంనుంచి మరొక గ్రామానికి కాలినడకనే వెళుతూంటారు. అలా వెళ్ళి పల్లె పల్లెలోను ప్రజలకి ధర్మోపదేశం చేస్తూంటారు. వారందరికి మోక్షప్రాప్తికి మార్గదర్శనం చేస్తూంటారు. ఆయన స్వయంగ చాలా క్లిష్టమైన ధర్మశాస్త్రాలు చదువుతూంటారు. శిష్యులకు వినిపిస్తూంటారు. ఇంత చేస్తున్నా దీనికి ప్రతిఫలంగ ఆయన ఎవరినుండీ ఒక్కపైసాకూడా ఆశించరు.

**గురువు ఎలాంటివాడంటే?**

ఎవరైతే ఈ సంసారంలోని సమస్త ఏళాపాలనుండి త్యాగో!
ఎవరైతే జైన ధర్మమునందే అనురాగం కలిగి ఉంటారో!
ఎవరైతే సంసార సుఖాలయందు విరాగియయి ఉంటారో!
ఎవరికైతే మోక్షప్రాప్తియందే మనసు లగ్నమై ఉంటుందో!

**ఇదుగో ఇలాంటివాడు!**

# 3 ధర్మం

'ధర్మం' అంటే జైనధర్మం అని అర్థం. జైన ధర్మానికి మూలం – దయ, ప్రేమ, జాలి. ధర్మం మనకంటె బలహీనులైన ప్రాణులయందు దయ చూపడం నేర్పుతుంది. అంత:కరణలో నిరంతరం కారుణ్యభావాన్ని నింపుకోవడం నేర్పుతుంది.

జైన ధర్మాన్ని జినేశ్వరుడు, వీతరాగుడు భగవానుడు ఉపదేశించాడు. అందుచేత ఈ ధర్మం సర్వశ్రేష్ఠము. సుందరము, సంపూర్ణమునైన సత్యము. జైన ధర్మం సమస్త ప్రాణులకు చివరకు మోక్ష ప్రాప్తియే ధ్యేయం కావాలని బోధిస్తుంది.

మోక్ష ప్రాప్తికోసం మనం ఏం చేయాలి? మొదట పాపములను దూరం చేసుకోవాలి. సంసారమునందు మోహం విడిచిపెట్టాలి. స్వచ్ఛమైన సాధువుయొక్క లేదా శ్రేష్ఠమైన శ్రావకునియొక్క జీవితం జీవించాలి. ఇందుకోసం జైనధర్మం మనకు అలాంటి 'ఆరాధన' నేర్పుతుంది. ఆరాధన వలన పాపములు దూరం చేయబడతాయి. మోహం నశింపచేయ బడుతుంది. స్వచ్ఛమైన సాధువుయొక్క లేదా శ్రేష్ఠమైన శ్రావకునియొక్క జీవనం జీవించడానికి వీలవుతుంది. మంచి పుణ్యములయొక్క బంధం ఏర్పడుతుంది. మోక్ష ప్రాప్తి లభించేవరకు మన జీవనం సద్గతిని పొందుతుంది.

## జైన ధర్మం

జీవనానికి సద్గుణాలను, శాంతిని ప్రసాదిస్తుంది
మరణసమయంలో సమత్వాన్ని,సమాధి(చిత్త ప్రసన్నత)ని కలిగిస్తుంది
పరలోకంలో సుఖాన్ని, సద్గతిని ప్రసాదిస్తుంది
మరణానంతరం శాశ్వత ముక్తిని ప్రసాదిస్తుంది

# 4 శ్రావకులు

జైనులంటే జైన శ్రావకులు. అంటే జైనధర్మాన్ని అనుసరించేవారు. వీతరాగ, జినేశ్వర దేవునియొక్క నిజమైన సేవకులు శ్రావకులు.

**'శ్రావక'** పదంలో మూడు అక్షరాలున్నాయి. **శ్ర, వ, క**. ఈ మూడు ప్రధాన అక్షరాలకి విశేషమైన అర్థం ఉంది.

**'శ్ర'** అంటే జినేశ్వర భగవంతుని వచనములయందు దృఢమైన విశ్వాసం కలిగి ఉండేవాడు. 'నా ప్రభువు ఏది ఉపదేశించాడో అది సత్యము. ఏ మాత్రము శంకకు స్థానము లేనిది. ప్రభువు వాక్యమే నా విషయంలో కల్యాణకారి' అని శ్రావకుడు తలుస్తాడు.

**'వ'** అంటే వినయము, వివేకము. పూజనీయ అరిహంత భగవానుడు, సద్గురు భగవానుడు, తల్లిదండ్రులు, అధ్యాపకులు, పెద్దలందరియెడల వినయ, వివేక భావంతో ప్రవర్తించడం.

**'క'** అంటే అరిహంతదేవుని, గురుదేవుని దర్శనం, పూజనం, భక్తి, గౌరవించడం రూపమైన క్రియాకలాపం. వీనితోపాటు నౌకారశీ పచ్చక్కరవాణ, రాత్రి భోజనం విడిచిపెట్టడం, సామాయికత(21), ప్రతిక్రమణ(35) మొదలైన క్రియాకలాపాలు.

**శ్రావకులారా రండి -**

మనం అంత:కరణలో విశ్వాస ద్వారాన్ని తెరుద్దాం
దానికి వినయము, వివేకము అనే తోరణం కడదాం
క్రియారూపమైన పుష్పాలతో ఆత్మార్చన చేద్దాం - రండి.

# 5 శ్రావకుల దినచర్య

రాత్రి పెందలకడనే నిద్రించువారు – ఉదయం పెందలకడనే లేస్తారు
బలము,ధనము,బుద్ధి వృద్ధియయి – దేహము సుఖవంతమవుతుంది

1 శ్రావకుడు ప్రతిరోజు పెందలకడనే నిద్రించాలి. మరునాడు ఉదయం పెందలకడనే నిద్ర లేవాలి. లేస్తూనే 'నమో అరిహంతాణాం' పఠించాలి. పక్కమీంచి బయటకు వచ్చి పంచ పరమేష్ఠులకు(25) ప్రణామం చేయడంకోసం మనసులోనే 'నవకారమంత్రం' 12సార్లు పఠించాలి. తరువాత రెండు అరచేతులు తెరచి, జోడించి వాటిని చూడాలి. ఇందులో మధ్యలో 'సిద్ధశీల'(87) ఆకృతి ఉంటుంది. దానిమీద రెండుచేతులయొక్క వేళ్ళు జోడించడంతో ఏ 24 చేతివేళ్ళ కణుపులు ఉన్నాయో అవి 24గురు తీర్థంకరదేవులు 'సిద్ధశీల'మీద విరాజమానులవుతారు. దీనిని మనసులో భావించుకుని దర్శించాలి. 'సిద్ధశీల'(మోక్షం) దీనియొక్క అంతిమధ్యేయం అని జ్ఞాపకముంచుకోవాలి.

2 దాని తరువాత ఒక్కసారి ఆలోచించాలి "నేను ఎవరు? నేను ఎక్కడినుంచి వచ్చాను? ఇక్కడినుంచి ఎక్కడికి వెళతాను? ఇక్కడ నా కర్తవ్యమేమిటి?" వీనికి సమాధానాలు ఇలా ఉంటాయి – "నేను జైన శ్రావకుణ్ణి. సాటి మానవులకంటె నేను శ్రేష్ఠుడను,ఉన్నతుడను. అనాదికాలంగ అనేక జన్మలలో తిరుగుతూ తిరుగుతూ చాలా పుణ్యం సంపాదించుకున్న కారణంచేత నాకు ఈ మానవజన్మ, శ్రావక జీవనం లభించాయి. ఈ జన్మలో నా ఆత్మకు లక్ష్యమొక్కటే. అది 'మోక్షప్రాప్తి'. మోక్షప్రాప్తి లభించేవరకు 'సద్గతి ప్రాప్తి' పొందడం, దీనికోసం ఈ మనుష్యజన్మలో జినపూజ, సామాయికత, ప్రతిక్రమణ, దయ, దానం మొదలైనవాటిచే ఆత్కృష్టమైన 'ధర్మారాధన' చేయడం నా కర్తవ్యం.

3 ఆ తరువాత తల్లిదండ్రులకు అతి భక్తితో ఆదర ప్రణామం చేయాలి.

4 తరువాత రాత్రి పాపముల పరిశుద్ధికోసం 'బియాసన'(రెండుసార్లు భోజనం) చేయాలి. అది వీలుకానప్పుడు 'సామాయిక్' చేయాలి.

5 కనీసం 'నౌకారశీ పచ్చక్కరవాణ' మనసులోనే చేయాలి. పర్వతిధి అయితే ఉపవాసం, ఆయంబిల్, ఏకభుక్తం, ద్విభుక్తం ఏది చేయగలరో దానిని యథాశక్తి చేస్తానని నిశ్చయించుకోవాలి.

6 తరువాత జినమందిరంలో జినేశ్వరప్రభువు దర్శనం చేసుకోడానికి వెళ్ళాలి. మందిరానికి వెళ్ళి పరమాత్మునియొక్క గుణాన్ని, ఉపకారాన్ని స్మరించుకోవాలి.

7 తరువాత ఉపాశ్రయంలో పూజ్య గురుదేవులకు వందనం సమర్పించుకోడానికి వెళ్ళాలి. వందనం సమర్పించి పూజ్య గురుదేవుల కుశలం అడిగి తెలుసుకోవాలి. వారిని తన ఇంటికి అన్న,పానీయాలు స్వీకరించడానికి రమ్మని ప్రార్థించాలి. అక్కడే గురుదేవుల ముఖత: 'నౌకారశీ' మొదలైన పచ్చక్కరవాణ అనుజ్ఞ పొందాలి. (నౌకారశీ పచ్చక్కరవాణ అంటే సూర్యోదయానంతరం 48ని. పోయిన తరువాతే పళ్ళు తోముకుని, ముఖం కడుక్కుని అన్న,పానీయాదులు స్వీకరించాలనుకోవడం)

8 స్నానం చేసినవెంటనే పూజావస్త్రాలు ధరించి శ్రీ జినేశ్వరప్రభువుకి అష్టప్రకారీ పూజ(58) (ఎంతవరకు చేయగలరో తన ద్రవ్యంతోనే) చేయాలి.

9 పూజ్య గురుదేవుల శ్రీముఖంనుండి 'జినవాణి' వినడానికి వెళ్ళాలి. ఎందుకంటే జినవాణి వినడంవలన మనసులో మంచి ఆలోచనలు చేస్తారు. ఆత్మకు కల్యాణకారకములయిన అనేక మార్గముల జ్ఞానం ప్రాప్తిస్తుంది. అన్నివిధాలా జీవితంలో ఔన్నత్యం ప్రాప్తిస్తుంది.

10 సూర్యాస్తమయానికి ముందే సాయంకాల భోజనం చేయాలి. దానివలన రాత్రి భోజన పాపం కలుగదు. రాత్రి భోజనం చేసిన పాపం పొందిన జీవుడు నరకం పొందుతాడు.

11 సాయంకాలం తిరిగి పరమాత్మ దర్శనం, ధూపం, దీపం, హారతి, చైత్యవందనం మొదలైనవి చేయాలి.

12 తరువాత పగలంతా అనుకోకుండా లభించిన పాపముల పరిశుద్ధికోసం ప్రతిక్రమణ చేయాలి.

13 రాత్రి ధార్మిక పాఠశాలకు వెళ్ళాలి. పాఠశాలలో ప్రతిరోజు కనీసం ధార్మిక సూత్రాలకు సంబంధించిన ఒక క్రొత్తగాథను కంఠస్థం చేయాలి. అంతకు పూర్వం కంఠస్థం చేసిన సూత్రములను పునరావృత్తి చేసుకోవాలి.

14 ఎప్పుడూ అసత్యం పలుకకూడదు. దొంగతనం చేయకూడదు. ఏ ప్రాణికి కావాలని తెలిసుండి హింస చేయకూడదు. ఎవర్నీ నిందించకూడదు. బీడీ,సిగరెట్టు వంటి ధూమపానం చేయకూడదు. ఎవరితోనూ దెబ్బలాడకూడదు. జూదమాడకూడదు.జీవులయెడ దయాస్వభావంతో ఉండాలి. తోటి ప్రాణులకు సహకరిస్తూ ఉండాలి. దీనులు, దు:ఖభావులు విషయంలో దయ కలిగి ఉండాలి. వారి అవసరాలకి దానం చెయ్యాలి. ఈ విధంగ జీవితాన్ని సద్గుణముల నందనవనంతో సమానంగ తీర్చిదిద్దుకోవాలి.

15 రాత్రి తల్లిదండ్రులకు, ఇతర పెద్దలకు సేవ చేయాలి.

16 మరునాటి ఉదయం పెందలకడనే లేవాలని నిశ్చయించుకుని ఏడుసార్లు 'నవకారమంత్రం' జపించుకుని నిద్రించాలి.

# 6 ధర్మం - రెండు విధాలు

ఈ ప్రపంచంలోని జీవులపై అపార కరుణకల జినేశ్వర భగవానుడు జీవులను ఈ సంసారంనుండి విముక్తులవడానికి, మోక్షముయొక్క అనంత సుఖాలను నిరంతరం అనుభవించడానికి ఉద్దేశించి రెండువిధాలయిన ధర్మాలను ప్రవచించాడు.

1 సర్వవిరతి ధర్మము 2 దేశవిరతి ధర్మము

1 సర్వవిరతి ధర్మము – సర్వవిరతి ధర్మముయొక్క అర్థం సాధు ధర్మం. ఈ ధర్మంలో పరిపూర్ణంగ సంసారాన్ని త్యజించి పంచ మహావ్రతాలను పూర్తిగ దోషరహితంగ ఆచరించి ఆత్మ కల్యాణాన్ని సాధించుకోవలసి ఉంటుంది.

మోక్ష ప్రాప్తిపై దృష్టితో పాటు సమస్త పాప వ్యాపారములను త్యజించి జీవించడమే సాధు జీవనమనబడుతుంది. ఇది సర్వోత్తమమైన, ప్రధానమైన ధర్మము.

ఎవరైతే ఈ ధర్మాన్ని అనుసరించ దలచినా ఆచరించలేరో అటువంటి వారికోసం రెండవ ధర్మం 'దేశవిరతి' ధర్మం చెప్పబడింది.

2 దేశవిరతి ధర్మము – 'దేశ'మంటే ఏదైనా ఒక విశిష్ట అంశము లేదా భాగము. 'విరతి' అంటే త్యజించడం(పాపములయొక్క త్యాగం), సంపూర్ణంగ సమస్త పాపాల్ని త్యాగంచేసే రీతిలో సాగే సాధుధర్మాన్ని ఎవరు అనుసరించి ఆచరించలేరో కాని సాధుధర్మాన్ని స్వీకరించాలనే మిక్కుటమైన అభిలాష కలిగి ఉండడంతోపాటు ఏదైనా విశిష్ట అంశంలో పాపముల త్యాగం చేయగలిగితే దానిని దేశవిరతి ధర్మము లేదా శ్రావక ధర్మము అంటారు.

నౌకారశీ పచ్చక్కరవాణ, రాత్రిభోజనం మానేయడం, కందమూలాలను త్యజించడం, తినకూడనివాటిని త్యజించడం, సినిమా, టి.వి. లను త్యజించడం మొదలైనవి ఈ ధర్మంలోకొస్తాయి.

మరొక విధంగ చూసినా ధర్మం రెండువిధాలుగ ఉంటుంది. 1 చారిత్రధర్మము, 2 శ్రుతధర్మము. చారిత్రధర్మము అంటే సర్వవిరతి లేదా దేశవిరతి రూపమైన ధర్మము. శ్రుతధర్మమంటే మంచి శాస్త్రముల యొక్క జ్ఞానము.

దేశవిరతి(శ్రావక) ధర్మము, శ్రుతధర్మము ఈ రెండూ ఎప్పుడైతే సర్వవిరతి (సాధు) ధర్మాన్ని స్వీకరించాలనే తీవ్రమైన వాంఛతో కూడి ఉంటాయో అప్పుడు మాత్రమే అవవి ధర్మమని పిలువబడడానికి వీలవుతాయి, లేకపోతే కావు.

# 7 జీవులు - రెండు విధాలు

సమస్త ప్రపంచముయొక్క లేదా ఈ విశ్వంలోని రెండు విభాగాలలో వాటా పంపిణీ ఉంది.




జీవులంటే చేతనత్వం, జ్ఞానం కలవారు. ఎవరిలో సుఖము,దు:ఖము అనుభవించే శక్తి ఉంటుందో, ఎవరైతే ప్రాణం కలిగి ఉంటారో వారు జీవులు. మిగిలినవన్నీ అజీవులు.

అజీవులంటే బల్ల,కుర్చీ,ఇల్లు,ఆకాశం మొదలైన లక్షలాది, కోట్లాది వస్తువులు వస్తాయి.

ప్రాణం రెండువిధాలుగ ఉంటుంది. 1 ద్రవ్యప్రాణము, 2 భావప్రాణము

1 ద్రవ్యప్రాణములు - 1, పంచేంద్రియములు - స్పర్శేంద్రియం (చర్మం,తోలు), రసనేంద్రియం (నాలుక), ఘ్రాణేంద్రియం (ముక్కు), చక్షురింద్రియం (కన్ను), శ్రోత్రేంద్రియం (చెవి).

2 మూడు బలాలు - మనోబలం, వాగ్బలం, కార్యబలం.

3 ఉచ్ఛ్వాస,నిశ్వాసలు - గాలి పీల్చడం, వదలడం.

4 ఆయుష్షు - దేని ఆధారంగ మనం జీవిస్తున్నామో అది.

ఈ విధంగ పంచేంద్రియాలు (చర్మం,నాలుక,ముక్కు,కళ్ళు,చెవులు), మూడు బలాలు (మనోబలం,వాగ్బలం,కార్యబలం), ఉచ్ఛ్వాస,నిశ్వాసలు, ఆయుష్షు ఈ పది ద్రవ్యప్రాణులు.

2 భావప్రాణములు - దర్శనం,జ్ఞానం,చారిత్రం ఇవి భావప్రాణములు.

జీవులు ఒకరిపై ఒకరు ఆధారపడడం ద్వారా రెండుగ విభజింపబడ్డాయి.




1 సంసారజీవులు - కర్మబంధనముల కారణముగ నాలుగు విధాలయిన ఈ సంసారంలో చక్కర్లుకొడుతూ తిరుగుతూ ఉండే(జన్మ,మృత్యువుల మధ్య తిరుగుతూ ఉండే), అనంతమైన దు:ఖాలను అనుభవిస్తూ ఉండే జీవులు సంసారజీవులు.

2 సిద్ధజీవులు - కర్మబంధనములనుంచి ముక్తులైనవారు సిద్ధజీవులు. వీరు మోక్షం పొందడానికి అర్హులు. వారు తమ శుద్ధ ఆత్మస్వరూపాన్ని పొందగలుగుతారు. ఇలా అనంత సుఖాలతో కూడియున్నట్టి జీవులు సిద్ధజీవులు అనబడతారు.

# 8 మూడు రత్నాలు

మూడు రత్నాలు – ఏమిటవి? తళతళలాడే ప్రకాశించే కాంతివంతములయి నాలుగుమూలలా తమ కాంతిని ప్రసరింపజేసే వేనినైతే ప్రజలు తమ వేళ్ళకు ధరించడానికి ఉంగరములలో బిగించుకుంటారో అవేనా? అలాంటివేనా రత్నాలు? కాదు, కానేకాదు. అలాంటి రత్నాలు కావివి. మరి, అవేమిటంటే – సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రం.

సమ్యక్ దర్శనం అంటే సత్య దర్శనం. సర్వజ్ఞుడు, వీతరాగుడు, అరిహంత భగవానుడు ఏది ఉపదేశించాడో అదే సత్యదర్శనం. భగవానునిచే ప్రవచింపబడిన సమస్తవిషయాలపై పరిపూర్ణమైన, అమోఘమైన, శంకారహితమైన శ్రద్ధకలిగి ఉండడం.

సమ్యక్ జ్ఞానం అంటే సత్య జ్ఞానం. అరిహంతభగవానునిచే నిర్దేశింపబడిన జీవ,అజీవ మొదలైన తొమ్మిది తత్త్వముల విషయమై సారవంతమైన చక్కని జ్ఞానం. ఈ జ్ఞాన ప్రభావంచేత మనం మంచిని మంచిగానూ, చెడ్డను చెడ్డగానూ తెలుసుకో గలుగుతాం. మంచి చెడ్డల మధ్య వ్యత్యాసాన్ని మనం గుర్తించగలుగుతాం.

సమ్యక్ చారిత్రం అంటే సత్య(సుందర) జీవనం. భగవానుడు చూపిన మార్గంలో పయనించడమే సుందర జీవనం. భగవానుడు 'సంసారాన్ని విడిచిపెట్టి సంయమ – చారిత్ర దీక్ష స్వీకరించు' అని చెప్పాడు. దాని ప్రకారం సంసారాన్ని విడిచిపెట్టి సంయమం స్వీకరించడమే సుందర జీవనం. చారిత్రం లేదా దీక్ష స్వీకరించడం వీలుకానిచో భగవానుడు ఉపదేశించిన రీతిగ చక్కని శ్రావక జీవనం సాగించడంకూడా ఒక విధంగ సమ్యక్ చారిత్రంగానే చెప్పబడుతుంది.

ఈ మూడు రత్నాలు ఎలాంటివంటే వీనిని ఎవరూ దొంగిలించలేరు. మనం పారేసుకోలేం. చూడగా – వివాహితుడైన జంబుకుమారుని ఇంటికి ప్రభవుడనే దొంగ తన 499మంది అనుచరులతో దొంగతనానికి వెళ్ళాడు. సరిగ్గ అదే సమయానికి జంబుకుమారుడు తన క్రొత్తగ వచ్చిన ఎనిమిదిమంది భార్యలకు ధర్మోపదేశం చేస్తున్నాడు. ప్రభవుడు(దొంగ) ఈ ఉపదేశం విని జంబుకుమారుని నుండి సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రం అనే మూడు రత్నాలను దొంగిలించాడు. మరునాటి ఉదయం జంబుకుమారుడు, అతని ఎనిమిదిమంది భార్యలు, అతని తల్లిదండ్రులు, ప్రభవునితోసహా 500మంది దొంగలు మొత్తం 527మంది సంసారాన్ని విడిచిపెట్టి దీక్ష స్వీకరించారు. వింటే ఆశ్చర్యంగ లేదూ!

దొంగ అంటే ప్రభవుళ్ళా ఉండాలి. రావడమేమిటి, అతి విలువైన, దొంగిలించ వలసిన సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రం అనే మూడు రత్నాలని దొంగిలించాడు. వాడు దొంగిలించిన ఆ రత్నాలను అతనినుండి మళ్ళీ ఎవరూ దొంగిలించలేరు. ఒకవేళ దొంగిలించగలిగినా వారికీ కల్యాణకారకము లవుతాయి.

దాత అంటే జంబుకుమారునిలా ఉండాలి. మూడు రత్నాలను దొంగకు ప్రసాదించడంద్వారా దొంగ మోక్షద్వారాన్ని చేరుకుని 'ఖుల్‌జా సిమ్‌సిమ' అన్న అల్లావుద్దీన్‌లాగ అనగానే మోక్షద్వారం అనాయాసంగ తెరుచుకుంటుంది.

# 9 ధర్మము - మూడు విధాలు

ధర్మం మూడు విధాలుగ ఉంటుంది. ఈ మూడువిధాలైన ధర్మాన్ని ఎవరైతే తమ జీవితంలో చక్కగ అనుసరిస్తారో వారి మానవ జీవనం సఫలమవుతుంది.

1 అహింస – అహింస అంటే ఏ ప్రాణిని హింసించకూడదు. మనం ఎవరినైనా కొడితే వాళ్ళు మనల్ని మంచివాళ్ళు అనుకోరు. అసలు మనం మరొకర్ని ఎందుకు కొట్టాలి? మనకు మన ప్రాణం ఎంత తీపో, అలాగే ఎంత చిన్న ప్రాణికైనా దాని ప్రాణం దానికి తీపి. వేరొకరి ప్రాణాన్ని తీసుకోడానికి, హత్య చేయడానికి మనకేం అధికారం ఉంది? మనం ఇంకొకరి ప్రాణం తీస్తే, మన ప్రాణం ఇంకొకరు తీస్తారు. మనం ఏం చేస్తామో, దాన్ని మనం భరించాలి.

విశ్వవిజేత కావాలనే ఆకాంక్షతో బయలుదేరిన సికిందర్‌తో ఒక భారతీయ సన్యాసి 'నువ్వు మరొకరినుండి ఏ వస్తువు లాక్కున్నా మళ్ళీ అనుకుంటే తిరిగి ఇవ్వగలవు. కాని, మరొకరి ప్రాణం తీసుకుంటే నువ్వు మళ్ళీ తిరిగి ఇవ్వాలనుకున్నా ఇవ్వలేవు. కాబట్టి వేరొకరి ప్రాణాలు తీయకు. హింస చేయకు.' అని చెప్పగానే సికిందర్ ఒక్కసారిగ తన కత్తిని ఒరలో పెట్టి ఇక మళ్ళీ బయటకు తీయలేదు.

2 సంయమం – సంయమం అంటే భగవానుడు తెల్పిన రీతిగ చక్కని సదాచారపూర్ణమైన జీవనం సాగించడం. మనసు కోరిన రీతిగ స్వేచ్ఛగ వ్యవహరించడం, తన ఇష్టం వచ్చినట్టు జీవించడం, ఇష్టం వచ్చినట్టు తినడం, త్రాగడం, ఏ నియమాలూ లేవు, ఏ బంధనాలూ లేవు. ఇలాంటి నియమరహిత జీవనం కుక్కలు, పిల్లులు, కూడా జీవిస్తున్నాయి. దీనినే అసంయమం అంటారు. మానవ జీవనం సంయమం, నియమం, సదాచారంతో సరిపూర్ణం కావాలి.

3 తపము – తపము అంటే భోజన త్యాగము. పూర్తి ఉపవాసం,ఏకభుక్తం, ద్విభుక్తం మొదలైన తపస్సు. భోజనకాలంలో ఆకలికంటే నాలుగు ముద్దలు తక్కువే తినాలి. భోజన పదార్థాలుకూడా తక్కువగానే ఉండాలి. నెయ్యి,పాలు వంటి వికారవస్తువులు విడిచిపెట్టాలి. పెద్దలయందు. పూజనీయులయందు వినయం చూపాలి. తన తప్పులను అంగీకరించి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. వృద్ధులకు, రోగులకు సేవా,సుశ్రూషలు చేయాలి. ధర్మ సూక్ష్మాలను అధ్యయనం చేయాలి. దైవకార్యం చెయ్యడం, దైవ ధ్యానం చెయ్యడం తపముగ చెప్పబడుతుంది.

# 10 గుణాలు - మూడు (భక్తి, మైత్రి, శుద్ధి)

ఎవరైతే ఆత్మకల్యాణం కోరుకుంటారో, మంచి మనిషి కావాలనుకుంటారో, నిజమైన జైన్ కావాలనుకుంటారో, అంతకు మించి ఉత్తముడైన శ్రావకుడు కావాలనుకుంటారో వారు వారి జీవనాన్ని భక్తి, మైత్రి, శుద్ధి రూపమైన మూడు గుణాలచే పరిమళింప చేసుకోవాలి.

1 జినేశ్వర దేవునిపై భక్తి – తారకుడైన జినేశ్వర భగవంతునికి మనమీద అపారమైన కరుణ ఉంది. మన జీవనానికి సంబంధించిన సమస్త సుఖాలు శాంతి, సమాధి(చిత్త ప్రసన్నత), సద్గతి వీటన్నిటి మూలం జినేశ్వర భగవంతుడై ఉన్నాడు. ఆయన చేసిన జైన శాసనం ప్రభావం చేతనే మనం జన్మాదిగ మాంసాహారాన్ని విడిచి పెట్టాం. జీవులయందు దయ, ప్రేమ కలవారమయ్యాం. దేవ, గురు, ధర్మములకు సేవకులమయ్యాం. అలాంటి అనంత కరుణాళువైన జినేశ్వర భగవానునికి ప్రతినిత్యం అష్టవిధములైన పూజాదులచే భక్తి ప్రకటించవలసినదే. మన కృతజ్ఞతాభావాన్ని ప్రదర్శించ వలసినదే.

2 సమస్త జీవులయందు మైత్రి(మిత్రత్వం) – ఎవరైతే జినేశ్వర భగవంతుని నిజమైన భక్తుడో, అతడు సమస్త జీవులయందు మైత్రీభావం కలిగి ఉంటాడు. ఈ జగత్తులో దు:ఖాత్ములు, పాపులునైన వారిని చూసి ఎవరి హృదయంలో దయ, కరుణ కలుగదో అట్టివారు నిజమైన ధార్మికులు కారు. ఎవరైతే నిజమైన ధార్మికులో వారు దు:ఖాత్ముల దు:ఖాలను పోగొట్టడానికి నిరంతరం ప్రయత్నిస్తూనే ఉండాలి. పాపులను పాపకార్యములనుండి పరాఙ్ముఖులను చేయడానికి పరిశ్రమిస్తూ ఉండాలి. నిజమైన ధార్మికుని మనస్సులో ఎన్నడూ 'నేను నా స్వార్థం సాధించుకుంటాను. నాకు ఈ లోకంతో ఏం పని?' అని ఆలోచించడు. నిజమైన ధార్మికుడైన మానవుడు సమస్త జీవులయందు స్నేహ, ప్రేమ రూపమైన మధుర వ్యవహారం నడుపుతాడు.

3 జీవనంలో శుద్ధి – మనం జినేశ్వర దేవుని భక్తులమైతే, సమస్త జీవులకు మిత్రులమూ అవుతాము. అయితే మనం మన జీవనంలో పవిత్రులము (శుద్ధి) కానిదే ఇది జరిగేపని కాదు. మనం మన జీవనాన్ని పరిశుద్ధం చేసుకుంటే, స్వయంగ పవిత్రులమైతే, పాపాలకు ఎంత దూరంగ ఉండాలో అంత దూరంగ ఉండగలిగితే అపుడు మనం మన ఆత్మను అర్థవంతమైన, యదార్థమైన సుఖవంతంగ చేయగలుగుతాము. ఎప్పుడైతే మనం ఈ సంసారసుఖాల లాలసకు లోనుకాక దూరంగ ఉండగలమో అపుడు మన జీవితం పవిత్ర(శుద్ధి)మై సుగంధ భరితమై సరిమళిస్తుంది.

# 11 మూడు - అనాదులు

'ఆది' అంటే మొదలవడం,ప్రారంభం. 'అనాది' అంటే దేనికి ప్రారంభం లేదో అది. 'సాంతం' అంటే దేనికైతే అంతం,నాశనం ఉందో అది.

జైన ధర్మశాస్త్రంలో మూడు ముఖ్య వస్తువులు 'అనాది'గ చెప్పబడ్డాయి.

1 జీవుడు (ఆత్మ,జీవాత్మ) – జీవుడు,ఆత్మ,జీవాత్మ మూడూ ఒకే అర్థంలో వాడబడతాయి. ఆత్మకు పుట్టుక లేదు. అది నిత్యము. ఎల్లకాలమూ ఉండేది. నశించనిది. ఒక్కటి మాత్రం సత్యం – ఆత్మ తన కర్మానుసారంగ మనిషిగ,గుఱ్ఱంగ, ఏనుగుగ,ఎద్దుగ,దైవంగ,నరకవాసిగ వివిధరూపాల నెత్తి, పుడుతూ ఉంటుంది. అంతేకాని ఈ ఆత్మకు ఎన్నడూ అంతంకాని, నాశనంకాని ఉండవు. ఈ కారణంచేతనే ఆత్మ 'అనాది''అనంతం' అని చెప్పబడుతుంది. అంటే ఆత్మకు ప్రారంభం లేదు. ముగింపు లేదు. భవిష్యత్తులోకూడా ఏమీ జరిగేదీ లేదు.

2 జగత్తు (సంసారం) – ఈ జగత్తుకూడా అనాదికాలంనుంచి ఏర్పడి ఉంది. జీవుల ఆవాస నిలయమే జగత్తు. జీవులు శేషంలేకుండా నశించిపోయే పరిస్థితి ఉత్పన్నమైతే అపుడు జగత్తు మాయమవుతుంది. అనగా ఎప్పటినుండి జీవుడు ఉన్నాడో (అనాదికాలం నుంచి) అప్పటినుండీ ఈ జగత్తుకూడా ఉంది. ఈ విధంగ ఈ జగత్తు అనాది, అనంతము అయింది.

3 జీవ – కర్మ సంబంధం – జీవుడు(ఆత్మ) ఈ లోకంలో పుట్టడం, మరణించడం జరుగుతూనే ఉంటుంది. సుఖ,దు:ఖాల ననుభవించక తప్పదు. దీనికి కారణం జీవునికి, కర్మకుగల బంధం. ఇంతకూ జీవుడు అనాది అయితే, జీవునికి, జగత్తుకిగల సంబంధానికి మూలకారణమైన కర్మకూడా అనాదికాలంనుంచి ఉన్నదే అవుతుంది. అయితే ఒక్క విషయంమాత్రం గుర్తించాలి. జీవునికి, కర్మకుగల సంబంధం నిశ్చయంగ అంతం కావచ్చు. ఎప్పుడైతే జీవుడు మోక్షం పొందుతాడో, అప్పుడు జీవునికి కర్మతోగల సంబంధంకూడా శాశ్వతంగ విడిపోతుంది, నాశనమై పోతుంది. ఈ విధంగ కర్మతోగల సంబంధం నష్టమైపోగానే జీవుడు శివస్వరూపమై మిగులుతాడు. పరిశుద్ధాత్ముడై చరిస్తాడు.

ఈ విధంగ జీవుడు, కర్మ వీనికిగల సంబంధం అనాది. అంతమవడానికి సాధ్యమైనది. అంతం చేసుకోడానికి వీలైనది.

# 12 మూడు - జీవాత్మలు(భవ్యాదులు)

జైన ధర్మశాస్త్రంలో జీవాత్మను మూడు విధాలుగ ప్రస్తావించారు. 1 భవ్య, 2 అభవ్య, 3 జాతిభవ్య.

1 భవ్య జీవాత్మ – జీవాత్మ ఎప్పుడో ఒకప్పుడు మోక్షం పొంది తీరాలి. అంటే ఈ జీవాత్మకు మోక్షార్హత ఉంది. ఇదే 'భవ్య'మని చెప్పబడుతుంది.

ఇక్కడ ప్రసిద్ధంగ అంగీకరించబడే విషయం ఒకటుంది. ఒకసారి జీవాత్మ శత్రుంజయగిరిరాజువైపు భావపూర్వకంగ గాని, భావరహితంగ గాని పయనిస్తే ఆ జీవాత్మ నిశ్చయంగ 'భవ్య'మవుతుంది. ఇక్కడివరకు, ఈ గిరిరాజువైపు వచ్చే పవుపక్ష్యాదులు, కష్టించిపనిచేసే శ్రామికులు అందరూ అవశ్యం 'భవ్య'జీవాత్మలు అవుతారు.

2 అభవ్య జీవాత్మ – ఏ జీవాత్మకు మోక్షం పొందడానికి వీలుపడదో అంటే ఏ జీవాత్మకు మోక్షం పొందే యోగ్యతలేదో అవి 'అభవ్య జీవాత్మ'లనబడతాయి.

అభవ్య జీవాత్మ ఎన్నటికీ అంటే అనంత కాలం తరువాత కూడా మోక్షం పొందలేదు. లెక్కలేనన్ని పుట్టుకలు, అలాగే లెక్కలేనన్ని చావులు పొందినా ఈ జీవాత్మలు 'అభవ్యం'గానే ఉండిపోతాయి. ఈ జీవాత్మలు ఎన్నటికీ భవ్యాత్మలు కాలేవు. ఇలా ఎందుకవుతుంది? ఈ దీనులు ఎల్లప్పుడు అభవ్యులుగానే ఎందుకు ఉండిపోవాలి? ఈ ప్రశ్నకి బదులేమిటంటే ఈ జీవాత్మల స్వభావమే దీనికి కారణం. ఎలాగైతే నీటికి చల్లదనం, అగ్నికి వెచ్చదనం స్వభావమో అలాగే 'అభవ్యం'గ ఉండడమే ఈ జీవాత్మల స్వభావం.

3 జాతిభవ్య జీవాత్మ – ఏ జీవాత్మలకైతే మోక్షం పొందడానికి అవశ్యం అర్హత ఉంటుందో కాని మోక్షం పొందలేవో అటువంటి జీవాత్మలు 'జాతిభవ్యము'లుగ చెప్పబడతాయి. జీవన కొత్త అధ్యాయంలో ఈ జీవాత్మలు కేవలం 'జాతిభవ్యము'లుగానే ఉంటాయి. కాని వాటికి 'భవ్యము'లవలె మోక్షప్రాప్తికి అధికారముండదు. ఈ 'జాతిభవ్య' జీవాత్మలకు ఎప్పటికీ మోక్షార్హత ఉండదా? దీనికి బదులేమిటంటే 'ఈ జీవాత్మలు నిరంతరం అనంతకాయము లవుతూనే ఉంటాయి. 'అవ్యవహారరాశి'లోనే పుట్టుకను మరణాన్ని పొందుతూంటారు. అంతేకాని ఎప్పటికీ ప్రత్యేకమైన,విశిష్టమైన అనగ వృక్షాదులుగ(ఒకే శరీరంలో ఒకే ఆత్మ(జీవరూపంగ)) జన్మను పొందరు. అందువలన వారికి మోక్షం పొందడానికి ఆవశ్యకమైన ధర్మసామగ్రి మొదలైనవి ఎప్పటికీ సాధించలేరు.

# 13 మూడు - ఆత్మలు (ఉత్తమాదులు)

భిన్న భిన్న ఆధారములచే జీవాత్మ వర్గీకరణ అనేక విధాలుగ చేయబడింది. ఇక్కడ ఏ ఆధారంపై జీవాత్మయొక్క వర్గీకరణ చేయబడిందో దాని ప్రకారం మూడువిధాలుగ చెప్పబడింది. 1 ఉత్తమ ఆత్మ, 2 మధ్యమ ఆత్మ, 3 అధమ ఆత్మ.

1 ఉత్తమ ఆత్మ – ఎవరికైతే ఈ సంసారం పూర్తిగ చెడ్డదిగాను, మోక్షమే ఉత్తమమైనదిగాను భావింపబడుతుందో అదే 'ఉత్తమ ఆత్మ'. 'నాకు మోక్షం కావాలి' ఇదే ఈ ఆత్మయొక్క ప్రధానలక్ష్యం. మోక్షాన్ని ప్రాప్తింపజేసే ధర్మంవైపే అతని మనసులో ప్రేమభావం మొలకెత్తుతుంది. వీరికి సంసారంపై ఏమాత్రం ఆసక్తి ఉండదు. ఈ స్థితికి చేరిన ఆత్మలు దీక్షను స్వీకరించి సాధువులవుతారు. కాని పరిస్థితుల ప్రభావంచేత వీరికి సంసారంనుండి విముక్తి సాధ్యం కానప్పటికీ, వీరికి సంసారంమీద పూర్తి విరక్తి ఉంటుంది. సంసారం,సంసార సాధనాలైన - ధనము, భార్య, సంతానము, పరివారము మున్నగువాటియందు వీరికి అనురాగం(మోహం,ఆసక్తి) ఉండదు.

ఉత్తమ ఆత్మకు సంసారం కటువుగ ఉంటుంది, నచ్చదు. మోక్ష ప్రాప్తిపైనే కోరిక ఉంటుంది. ధర్మంపై ఆసక్తి ఉంటుంది.

2 మధ్యమ ఆత్మ – ఎవరికైతే పరలోక విషయమై అధిక ధ్యాస ఉంటుందో వారు మధ్యమ ఆత్మలు. వారికి ఇహలోకంపై, ఈ సంసార సుఖాలపై ఆసక్తి ఉండదు. 'నేను పుణ్యాన్ని సంపాదించుకోలేకపోతే పరలోకంలో నాగతి ఏమిటి?' అనే భావనతో పుణ్యసాధనమే లక్ష్యంగ ఈ ఆత్మలు ఉంటాయి. దీనికి కారణమేమిటంటే పుణ్యం సంపాదించుకోకపోతే పరలోకంలో సుఖాలనుభవించడానికి ఉండదు. ఈ కారణంచేత ఈ ఆత్మలకు పుణ్యసంపాదనయందు అధికప్రీతి ఉంటుంది. వీరు పాపము చేయుటయందు విరక్తి కలిగి ఉంటారు. పాపమంటే వీరు మనసులో చాలా భయపడతారు. ఇటువంటి ఆత్మలు పుణ్యంచేయడమే ఆవశ్యకంగ భావిస్తారు. ఏ కారణం చేతనైనా పాపం చేయవలసివస్తే చాలా దు:ఖిస్తారు.

3 అధమ(నీచ) ఆత్మ - ఇహలోక సుఖాలపై ఆసక్తిగల ఆత్మ అధమ ఆత్మ. ఈ ఆత్మలకు భౌతిక సుఖాలననుభవించడంపై చాలా ఆసక్తి ఉంటుంది. వీరికి మోక్షాసక్తి ఉండదు. సంసారంలో మళ్ళీ మళ్ళీ పడతామనే విచారమూ ఉండదు.

వీరికి వీరి ప్రతిష్ఠ ఎక్కడ దెబ్బతింటుందో, ఏ ఇతర అప్రతిష్ఠలు కలుగుతాయో అనే భయం ఉంటుంది. ఈ ఆత్మలుకూడా దుష్కర్మలు చేసేటప్పుడు భయపడుతూనే ఉంటాయి. ఎందుచేతనంటే వీరికి సమాజంపట్ల, ఈ లోకంపట్ల భయం ఉంటుంది. నేను పాపంచేసి పట్టుబడితే లోకులేమనుకుంటారు? నా ప్రతిష్ఠ ఏమవుతుంది? ఇటువంటి విచారములతో, ప్రతిష్ఠా భయంతో ఈ ఆత్మలు దొంగతనం,వ్యభిచారం వంటి పాపపు పనులు చేయరు.

సంగ్రహంగ - సంసారం చేస్తున్నప్పటికీ -

1 ఎవరైతే స్వభావంచేత పాపకర్మలయందు విరక్తులై ఉంటారో వారు 'ఉత్తమ ఆత్మలు'

2 ఎవరైతే పరలోకభయంచేత పాపకర్మలకు దూరంగ ఉంటారో వారు 'మధ్యమ ఆత్మలు'

3 ఎవరైతే తమ కీర్తిప్రతిష్ఠలకు భంగం కలుగుతుందనే భయంతో పాపకర్మలు చేయకుండా ఉంటారో వారు 'అధమ ఆత్మలు'.

అయితే, ఎవరైతే పాపాలు చేస్తూ ఉంటారో, పాపకర్మలు చేయడమందు చాలా ఆసక్తి కలిగి ఉంటారో అట్టివారు అధములలో అధములు, అనగా అధమాధములుగ చెప్పబడతారు.

ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. మనం అటువంటి 'అధమాధమ ఆత్మలం' ఎన్నటికీ కాకూడదు.

# 14 నాలుగు - అవస్థలు

అవస్థలు నాలుగు. 1 దైవం, 2 మానుషం, 3 తర్యక్కులు, 4 నారకులు.

అవస్థలంటే ఆత్మయొక్క విభిన్నమైన నాలుగు గతులు. ఈ నాలుగు అవస్థలలో ఏదో ఒక గతిలో జన్మనెత్తిన ఈ ఆత్మలచే జగత్తు ఏర్పడుతోంది.

1 **దేవగతి** – దేవతలు మన మనుష్యలోకానికి పైనగాని, క్రిందగాని ఉంటారు. వారి వైభవ,విలాసాలకు అంతముండదు. వారి సుకుమారమైన చెప్పులమీద అతికించబడిన రత్నముల విలువ ఎంతటిదంటే వాటితో ఈ ప్రపంచాన్నంతను లక్షసార్లు ఖరీదు చేయవచ్చును.

అయితే ఈ దేవగతిని పొందడంవలన ఏం లాభం? ఈ అవస్థలో ఏమాత్రం శాంతికి స్థానం లేదు. వీరి మనస్సు అత్యధికంగ లోభం,ఈర్ష్య,అసంతుష్టి వంటి భయంకర వాసనల కారణంగ నిరంతరం అశాంతితోనే నిండి ఉంటుంది. ఒక దేవుడు మరొక దేవుని అధిక సంపన్నతనుచూసి ఈర్ష్యతో మండిపోతూ ఉంటాడు. వీరికి నూరుకోట్ల రత్నాల సంపద లభించినా, వారి మనస్సుకి తృప్తి ఉండదు. అతృప్తులుగానే జీవిస్తూ ఉంటారు. అటువంటి దేవగతికి దూరంనుంచే నమస్కారం.

2 **మనుష్యగతి** – మనమందరం మానవులం. ఈ అవస్థలో రక్తం,మాంసం, మలమూత్రముల మాలిన్యంతో కూడిన దేహం కలిగి ఉన్నప్పటికీ అన్ని అవస్థలలోకి ఈ మానవావస్థ ఉత్తమమైనది. ఈ అవస్థలో దేవతలతో పోలిస్తే లక్షోవంతు వైభవ, విలాసాల సౌఖ్యం లేదు. అయితేనేం ధర్మోపాసనచేయడానికి అవసరమైన స్థితి మానవావస్థలోనే లభిస్తుంది. తపము,త్యాగము,వైరాగ్యము, జ్ఞానము, ధ్యానము,సంయమము వీటినన్నిటిని ఆరాధించి, అంత్యకాలంలో మంగళకరమైన మోక్షమార్గంలో ముందుకు అడుగెయ్యడానికి వీలైన మహత్సౌభాగ్యం మానవజన్మలోనే సాధ్యం.ఈ కారణంచేత మానవావస్థ అన్ని అవస్థలలోకి శ్రేష్ఠం.

3 **తిర్యక్‌గతి**–ఆవు,ఎద్దు,దున్నపోతు,కుక్క,పిల్లి,గుఱ్ఱం,ఏనుగు,సింహంవంటి అడవిజంతువులు, కాకి,పావురం, కోయిల, హంసవంటి పక్షులు, కణ్ణలు,ఆకులు,నీరు, నిప్పు,గాలి మొదలైనవన్నీ తిరక్‌గతిలో లెక్కింపబడతాయి.

ఈ అవస్థ పొందడానికి కాదు చూడ్డానికే అయిష్టంగ ఉంటుంది. పాపం కుక్క రొట్టిముక్కకోసం గుమ్మం గుమ్మం తిరుగుతుంది. చివరకు రొట్టిముక్క దొరుకుతుందో లేదో తెలీదు. కాని కఱ్ఱదెబ్బలుమాత్రం దండిగ లభిస్తాయి. ఎద్దు ఎంత భారాన్ని మోయవలసి వస్తుంది. అది చాలదని కొరడాదెబ్బలు తినాల్సివస్తుంది. గుఱ్ఱం వీపుమీద ఎన్ని కంచీ దెబ్బలు తింటుందో, ఏనుగు మావటివాడి ఎన్ని అంకుశం పోటులు ఎన్ని తింటుందో లెక్కలేదు. ఈ కారణంచేత తిర్యక్‌గతి బహు దు:ఖభారం. అందువలన ఎన్నడూ ఈగతి పొందాలనుకోకూడదు. జీవితంలో పాపం చేయాలనుకోకూడదు. కపటత్వం, వంచకత్వం, విశ్వాస ఘాతుకత్వం, దొంగతనం, హింసించడం వంటి దుష్కర్మలు చేయకూడదు.

4 **నరకగతి** – మానవలోకానికి కింద ఏడు నరకలోకాలున్నాయి. భవనపతి అనుపేరుగల దేవలోకంలో ఉండే 'పరమాధామీ' దేవత నరకంలో ప్రవేశించే నరక ఆత్మలకు భయంకరమైన బాధలను కలిగిస్తాడు. ఇలా బాధించడంలో పరమానందాన్ని పొందుతూంటాడు. ఎంత క్రూరత్వమనుకోవాలి? ఈ దేవత నరకజీవుల మొహాలపై వేడివేడి సీసపు రసాన్ని చిమ్ముతాడు. కత్తులు,బల్లేలతో వాళ్ళ శరీరాన్ని ముక్కలు ముక్కలుగ ఖండిస్తాడు. ఈ ముక్కలన్నిటినీ మళ్ళీ ఏకం చేస్తూంటాడు. ఈ జీవులను 'హంటర్'తో దేవత కొడుతూంటాడు. వేడివేడి,పెద్దపెద్ద లోహస్తంభాలను కౌగలింపచేస్తాడు.

అయ్యబాబోయ్...నరకంలో ఉండే ఇలాంటి దు:ఖాన్ని మనం ఎలా భరించగలం? నరకావస్థ అత్యంత దయనీయమైనది. ఈ అవస్థను పొందకుండా ఉండాలంటే మద్యం, మాంసాహారం,దురాచారాలకి దూరంగ ఉండాలి. సినిమా, టి.వి.లలో అసభ్య దృశ్యాలను చూడకుండా ఉండాలి. ఏ ప్రాణినీ హింసించకుండా ఉండాలి. శీతల పానీయాలు,ఐస్‌క్రీంవంటి తినకూడని పదార్థాలను ఎప్పుడూ తినకుండా ఉండాలి.

# 15 నాలుగు - కషాయాలు

వేనివలన జీవుని సంసారభ్రమణం అధికమవుతుందో, జనన,మరణజంఝాటం అధికమవుతుందో, నాలుగు అవస్థలలో అనేకమార్లు పరిభ్రమించాల్సివస్తుందో అవే కషాయాలు. ఈ కషాయాలు నాలుగు విధాలుగ ఉంటాయి.

1 క్రోధము, 2 మానము, 3 మాయ, 4 లోభము.

1 క్రోధము – క్రోధము అంటే కోపం. కోపం చాలా చెడ్డది. కోపంవల్ల మానవుడు విచక్షణాజ్ఞానం కోల్పోతాడు. వివేకం మరచిపోతాడు. ఎన్నడూ కోపపడకూడదు. క్రోధం మానవులమధ్య పరస్పర ప్రేమను నాశనం చేస్తుంది.

రాజమంద్రిలో ఒక సందులో నీళ్ళకోసం ఇద్దరి స్త్రీలమధ్య జగడం జరిగింది. ఆ ఇద్దరిలో ఒకావిడ ఇంటి యజమానురాలు, మరొకామె అద్దెకున్నామె. కుళాయికింద అద్దెకున్నామె బిందె పెట్టుకుంది. యజమానురాలు వచ్చి ఆ బిందె తీసేసి తన బిందె పెట్టుకుంది. ఈ విషయంలో వాళ్లిద్దరిమధ్య జరిగిన గొడవ ఇంతని చెప్పడానికి వీలుకాదు. అద్దెకున్నామె కోపంపట్టలేక లోపలికివెళ్ళి తనపై కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుంది. ఆ మంటతోనే బయటకువచ్చి కుళాయిదగ్గరేవున్న ఇంటి యజమానురాలిని గట్టిగ పట్టుకుని వదల్లేదు. దానితో ఇద్దరూ అన్యాయంగ మంటలో మాడి మసి అయిపోయారు. హాస్పటలుకి తీసుకుని వెళ్ళినా ప్రయోజనం లేకపోయింది.
కోపము చాలా చెడ్డది. అందువలను గుర్తుంచుకోవాలి. ఏం జరిగినా సరే, ఎవరిమీదా ఎప్పుడూ కోపపడకూడదు.

2 మానము(అభిమానము) – మానమంటే అభిమానమే. గర్వం,అహంకారం అనికూడా చెప్పచ్చు. మనుష్యుడు ఎప్పుడూ గర్వం,అహంకారం పొందకూడదు. గర్వం చేతనే రావణుడు రాజ్యం కోల్పోయాడు. అతని బంగారు లంక మంటల్లో భస్మమయి పోయింది. చివరకు మరణించి నరకగతిని పొందాడు.

ఇందుకోపమే మనం చెబుతూంటాం. –

అభిమానంతో రావణచక్రవర్తే నిలువలేక పోయాడు, ఇక మనమనగా ఎంత?

అభిమానం,గర్వం,అహంకారంవల్ల వినయం,వివేకంవంటి గొప్పగుణాలు నశించి పోతాయి. విద్య వినయంచేతనే వస్తుంది. వినయంవల్ల మనుష్యుడు అందరికీ ఆప్తుడవుతాడు. అభిమాని,అహంకారి అయినవానికి విద్య వంటపట్టదు. అభిమానవంతుణ్ణి ఎవరూ ఇష్టపడరు. అందువల్ల అభిమానం,అహంకారం ఈరెండూ మనదగ్గరికి రానివ్వకూడదు.

3 మాయ – మాయ అంటే అసూయ,కపటం. అసూయ,కపటం ఈ రెంటిని మన దగ్గరకుకూడా రానియ్యకూడదు. ఇవి రెండూ చాలా చెడ్డవి. వీనివలన సాధుజనులే నష్టపోయారంటే సామాన్యజనుల విషయం ఇక చెప్పేదేముంది?

తీర్థంకరుడు మల్లినాథభగవానుని జీవాత్మ వారి పూర్వజన్మలో ఒకసారి ధర్మంకోసం కపటం(మోసం) చేయడం జరిగింది. మల్లినాథుల జీవాత్మ ఆ జన్మలో వారి మిత్రులతో అందరూ ఒకేసారి సమానంగ తపము చేయాలి అని నిబంధన విధించుకున్నారు. కాని మల్లినాధుల జీవాత్మ మోసంచేసి వారి మిత్రులకంటె ఎక్కువ తపము చేయడం జరిగింది. ఈ కపటం కారణంగ మల్లినాథుల జీవాత్మ వారి తీర్థంకరుల జన్మకుముందు స్త్రీగ జన్మించవలసి వచ్చింది. మల్లినాథులవంటి తీర్థంకరభగవానులే ధర్మంకోసం మోసం చేసినా 'కర్మ' విడిచిపెట్టలేదు. అలాంటప్పుడు ధనసంపదలకోసం, సంసార సుఖాలకోసం కపటంచేసే మనలను కర్మ విడిచిపెడుతుందా?

మాయ(కపటం) మిత్రులమధ్య మిత్రత్వాన్ని చెడగొడుతుంది. అందువలన మానవులకు మాయ(అసూయ,కపటం) ఎన్నడూ దరికి చేరకూడదు.

4 లోభం – ఇంకా ఇంకా ఎక్కువ సంపాదించాలనే లాలస,ఆసక్తి లోభము అనబడుతుంది. ఈ లోభగుణం మంచిదికాదు. లోభం పాపాలకు మూలం. లోభం వల్లే మానవుడు అన్నిపాపాలు చేస్తూంటాడు. లోభం ఎంత చెడ్డదంటే మానవునిలోని అన్ని సద్గుణాలను అది నశింపచేయగలుగుతుంది.

మన్మధసేఠ్ దగ్గర కావలసినంత పైకముంది. అతివిలువైన వజ్రాలు,మాణిక్యాలు, ముత్యాలు,మరకతాలు,ఇంద్రనీలాలు వంటి ఎన్నో రత్నాలున్నాయి. అతడు బంగారంతో రెండు ఎద్దుల్ని చేయించుకున్నాడు. ఆ బంగారు ఎద్దులమీద వజ్రాలు,మాణిక్యాలువంటి రత్నాల నతికించుకున్నాడు. అంతా పూర్తి అయిందికాని ఆ రెండు ఎద్దులలో ఒక ఎద్దు కొమ్ముమీద రత్నాలు అతికించడం మిగిలిపోయింది. దానికి కావలసిన ధన సంపాదనకోసం అతడు అర్ధరాత్రి మంచుగడ్డలాంటి నీళ్ళున్న నదిని ఈదుకుంటూ వెళ్ళి మంచిగంధపు కట్టెలు తెచ్చి అమ్ముతూ ఉండేవాడు. ఇంత కష్టపడినా కొమ్ములో సగం మాత్రమే రత్నాలు తాపడం పని పూర్తయింది.

అచ్చంగ ఆ దేశాన్నేలే శ్రేణిక మహారాజు కూడా ఇటువంటి రత్నఘటిత బంగారు వృసభం చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు. తన భాండాగారంలో ఇటువంటి రత్న,మాణిక్యాలు లేవే అనుకున్నాడు. చివరికి ఏమైంది? ఆ లోభ మన్మధసేఠ్ మరణించి ఏడో నరకాన్ని చేరుకున్నాడు. అతని వందలకోట్ల విలువచేసే వజ్రాలు,మాణిక్యాలు అతన్ని నరకానికి పోకుండా కాపాడలేకపోయాయి. అందుచేత ఎన్నడూ లోభాన్ని దగ్గరికి రానివ్వకూడదు.

# 16 నాలుగు - పురుషార్థాలు

మానవుడు తన జీవితంలో సాధించుకోవలసిన యోగ్యకర్మలేవైతే కలవో వాటిని పురుషార్థములు అంటారు. ఈ పురుషార్థములు నాలుగు విధాలు -

1 ధర్మ, 2 అర్థ, 3 కామ, 4 మోక్షములు.

1 ధర్మ పురుషార్థం - సమ్యక్ జ్ఞానాన్ని అధ్యయనం చేయడం, తపస్సు చేయడం, సామాయిక్, ప్రతిక్రమణ చేయడం, భగవానుని పూజించడం ఇవన్నీ ధార్మిక కార్యక్రమాలు. వీనిని మనం మోక్షప్రాప్తికోసం కోరి చేస్తున్నట్లయితే అది ధర్మ పురుషార్థమని చెప్పబడుతుంది.

2 అర్థ పురుషార్థం - సంసార జీవనం గడుపుతున్న శ్రావకునికి డబ్బు అవసరం ఉండనే ఉంటుంది. ఎందుకంటే డబ్బులేకుంటే నిత్యజీవనం నడవదు కనుక. డబ్బు సంపాదించడంలో నీతి,నమ్మకం ఉంచాలి. ఎన్నడూ అసత్యమాడకూడదు. దొంగతనం, నమ్మకద్రోహం చేయకూడదు. ఇలాంటివే అర్థ పురుషార్థంగ చెప్పబడతాయి.

3 కామ పురుషార్థం - సంసారియైన శ్రావకునికి పంచేంద్రియాల విషయ ఉపభోగం ఉండనే ఉంటుంది. ఈ విషయానుభవంలో నియమం,నియంత్రణ ఉండాలి. రాగ(ఆసక్తి) భావం అసలు ఉండకూడదు. మిక్కిలి సదాచారవంతమైన సుందర జీవనం గడపాలి. దీన్నే కామ పురుషార్థము అంటారు.

4 మోక్ష పురుషార్థం - రాగ,ద్వేషాలు, కర్మల విషవలయం, జనన,మరణాల జంఝాటం, దేహము, దేహసంబంధమైన వాసనలు మొదలైన వాటినుండి జీవుడు విముక్తుడు కావాలి. ఒక్కసారిగ పైవాని నన్నిటినుంచి బయటపడడం, ఆత్మయొక్క నిజ స్వరూపం తెలుసుకోగలగడం లేదా అందుకోగలగడం మోక్షమని చెబుతారు. ఈ క్రియాకలాపాన్నే మోక్ష పురుషార్థమనీ చెబుతారు.

మోక్షన్ని సాధించడం, మోక్షమార్గంలో పరిక్రమించడం ప్రతియొక్క మానవుని ప్రప్రథమ కర్తవ్యం. ఈ మోక్షాన్ని పొందడానికి అన్నిటికంటే ఎక్కువగ ధర్మ పురుషార్థం వినియోగపడుతుంది. అందుచేత మానవుడు ఈ ధర్మ పురుషార్థ సాధనలో ప్రయత్నశీలుడు కావాలి.

# 17 నాలుగు - భావనలు

మనస్సు నిర్మలంగ ఉంచుకోడానికి, జీవితాన్ని ప్రకాశవంతం చేసుకోడానికి భగవానుడు నాలుగు భావనలు ప్రకటించాడు.

అవి 1 మిత్రత, 2 ప్రమోదం, 3 కరుణ, 4 ఉపేక్ష.

1 మిత్రత(మైత్రి) – ఈ లోకంలోని అన్ని జీవులతోటి మిత్రత్వాన్ని పాటించాలి. ఏ జీవునిపైనా మనసులో ఏమాత్రం చెడుభావన ఉండకూడదు. అసలు ఆ ఆలోచనే రాకూడదు. అన్ని జీవులను ప్రేమభావనతో చూడడమే మిత్రత్వమనిపించుకుంటుంది.

2 ప్రమోదం – తనకంటె అధిక గుణవంతుడైన మనుజునిపై ఆనందం, హర్షం పొందడం ప్రమోదమనబడుతుంది. ఒక బాలునికంటె రెండవ బాలుడు బాగా చదువుతూంటాడు. ఎక్కువ మార్కులు సంపాదిస్తూంటాడు. వాడు వీనికంటె హుషారుగ, నేర్పరిగ ఉంటే వాణ్ణి చూసి ఆనందించాలి, హర్షం ప్రకటించాలి. అయితే ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. బయటకు హర్షం ప్రకటించి లోపల ద్వేషం ఉంచుకునేవాడు బద్మాష్ అనబడతాడు.

3 కరుణ – దు:ఖితుడైన మనుష్యుని చూసి వానిపై కరుణ చూపాలి. వానికి తన దగ్గరున్న ధనమో, వస్త్రమో వాని కేది అవసరమో అది ఇవ్వాలి. అది పొందిన ఆ దీనుడు సంతోషించి మనలను ఆశీర్వదిస్తాడు. మనకు పుణ్యం వస్తుంది. అంతేకాదు దీనజనుడికి మనమిచ్చే స్వల్పంవల్ల కలిగే ఆనందం అమేయంగ ఉంటుంది.

4 ఉపేక్ష(మాధ్యస్థం) – పాపాత్ముడుంటాడు. చెడుమార్గంలో నడుస్తూంటాడు. అనకూడని మాటలతో తూలనాడుతూంటాడు. అటువంటి వానిపట్లకూడా మనసులో ఏమాత్రం దుష్టభావన రానివ్వకూడదు. పైపెచ్చు వాడిని సముదాయించి, సరిదిద్దడానికి ప్రయత్నించాలి.

ఒకవేళ మనం సముదాయించడాన్ని వాడు అంగీకరించకపోయినా మనంమాత్రం మన సమత్వాన్ని, శాంతి స్వభావాన్ని విడిచిపెట్టకూడదు. 'అన్ని జీవాత్మలు పనికిమాలిన కర్మల వశమవుతూనే ఉంటాయి' అని భావించి తన మనస్సు ఎన్నడూ వికలం కాకుండా చూసుకోవాలి. దీనినే ఉపేక్ష లేక మాధ్యస్థం అంటారు.

# 18 నాలుగు - ధర్మాలు

శ్రీ జినేశ్వర భగవానుడు ధర్మం నాలుగు విధాలుగ తెల్పాడు. అవి -

1 దానము, 2 శీలము, 3 తపము, 4 భావము.

1 దానము – దీనులు, దు:ఖితులు వీరికి ధనము, వస్త్రములు, నివాస స్థలము మొదలైనవి ఇచ్చి ఆదుకోడం 'అనుకంపా దానం' అంటారు. పూజ్యగురు మహరాజ్ వారికి వస్త్రము, ఆహార,పానీయములు మొదలైనవి ఇవ్వడం 'సుపాత్ర దానం' అనబడుతుంది. ఏ వస్తువైనా దానమివ్వడం ద్వారా ఆ వస్తువుపై మనకుగల మమకారం తగ్గిపోతుంది. పుణ్యం లభిస్తుంది. ఏజీవినైనా రక్షించడం 'అభయ దానం' అనబడుతుంది. ఎవరినైనా జ్ఞానవంతుణ్ణి చేస్తే అది 'జ్ఞాన దానం' అనబడుతుంది.

2 శీలము – తినండం,తాగడం మీద కోరిక, మంచి వస్త్రాలు ధరించాలనే కోరిక, కొత్త కొత్త విషయాలు చూడాలనే కోరిక వాటి ననుభవించాలనే వాసనలను నశింప చేసుకుని ఒక ఆదర్శవంతమైన జీవితం గడపడమే శీలమనబడుతుంది.

3 తపము – త్యాగం చేయడం, ఆయంబిల్, ఒకటి, రెండు, మూడు ఉపవాసములు మొదలైన తపస్సు చేయడం తపము అనబడుతుంది. ఈ విధంగ ఆహార సంజ్ఞ(భోజన ఆసక్తి)ను విడిచిపెట్టడం, సమాప్తం చేసుకోడం 'బాహ్య తపము' అనబడుతుంది. సంసార సంబంధమైన రంగురంగుల సుఖాలను త్యాగం చేయాలని కోరుకోడం 'ఆభ్యంతర తపము' అని చెప్పబడుతుంది. ఈ విధంగ తపం రెండు రకాలు.

4 భావము – ఆర్త ధ్యానం(సుఖాన్ని పొందడం, దు:ఖాన్ని దూరం చేసుకోడం కోసం ఆలోచన), రౌద్ర ధ్యానం(స్వార్థంకోసం వేరొకర్ని చంపేవరకు ఆలోచించడం), ఇవి రెండూ మంచివికావు. కాబట్టి రెండూ చేయకూడదు. ధర్మ చింతన చేయాలి. అందరూ సుఖంగ ఉండే ఆలోచన చేయాలి. ఈ విధంగ అత్యంత సుందరమైన ఆలోచనలతో మనస్సును పవిత్రంగ ఉంచుకోడం 'భావము' అనబడుతుంది.

ఈ నాలుగు విధాలైన ధర్మమును మనం మన జీవితమంతా అనుసరించాలి.

# 19 నాలుగు - సంఘములు

శ్రీ జైన శాసనంలో నాలుగు విధాలయిన సంఘములు పరిమితమై ఉంటాయి.

అవి - 1 సాధు, 2 సాధ్వి, 3 శ్రావక, 4 శ్రావిక.

1 సాధు, 2 సాధ్వి - జినేశ్వర భగవానుని ఆజ్ఞానుసారం వీరు తమ జీవితమంతా గడుపుతూంటారు. పంచ మహావ్రతాలను అఖండిత రూపంలో అనుసరిస్తూంటారు, సరస, సుందరమయిన రీతిలో సంయమనం పాటిస్తూంటారు.

వారు ఎప్పుడూ ఏజీవికి అహితం చెయ్యరు. సమస్త జీవులయందు అపారమైన కరుణ కలిగి ఉంటారు. వారికి అభయదాన మిస్తారు. ధనం,సంపద,ఆస్తివంటి వానిని సంపాదించి ఉంచుకోరు. దీక్ష(సంయమనం) తీసుకుని సాధు జీవనం స్వీకరించిన తరువాత ఇక వివాహ ప్రసక్తి చేయరు. పరిపూర్ణ సదాచారాన్ని పాటిస్తారు. తమ దగ్గరకు వచ్చే వేలాది జీవులకు శుభాన్ని ప్రసాదిస్తారు. అందరికీ ధర్మమార్గాన్ని తెలియజేస్తారు. ఇలాంటి జీవనం గడిపే పురుషుణ్ణి 'సాధు' అంటారు, స్త్రీని 'సాధ్వి' అంటారు.

3 శ్రావక, 4 శ్రావిక - ఈ స్త్రీ, పురుషులు జినేశ్వర భగవానుని ఆజ్ఞ కోసం అంత:కరణలో అంతులేని గౌరవభావం కలిగి ఉంటారు. వారికి ఎంత శ్రద్ధ ఉంటుందంటే 'భగవానుడు ఏది చెప్పాడో అదే వారికి సత్యం, మరేవిధమైన శంకాలేదు.' జిన భగవానుని ఆజ్ఞానుసారం జీవనం గడుపుతున్న అందరు సాధు, సాధ్వీలను వారు సేవాభక్తితో చూస్తారు. వారిని వినయపూర్వకంగ సేవిస్తారు.

తమతో సమానమైన ఇతర సహ ధార్మికులపై వారికి మనసులో అపారమైన ప్రేమభావముంటుంది. వారు దీనులకు, దు:ఖితులకు యథాశక్తి సహాయపడుతూ ఉంటారు. వారు సామాయిక్, ప్రతిక్రమణ, జినపూజ, నౌకారశీ పచ్చక్కాణ, రాత్రిభోజన త్యాగం, సినిమా, టి.వి.లను చూడకుండటం, కందమూలముల భక్షణ చేయకపోడం వంటివానిద్వారా యథాశక్తి ధర్మారాధన చేస్తూంటారు. ఇలాంటి జీవనం గడిపే పురుషులందర్నీ 'శ్రావకులు' అంటారు, స్త్రీలను 'శ్రావికలు' అంటారు.

## 20 నాలుగు - శుభాలు

మంగళం భగవాన్ వీరో - మంగళం గౌతమ ప్రభు:

మంగళం స్థూల భద్రాద్యా: - జైన ధర్మోస్తు మంగళం॥

ఈ దోహాను తప్పక కంఠస్థం చేయాలి.

ఈ లోకవ్యవహారంలో ఎప్పుడైనా, ఏ మానవుడైనా, ఏదైనా మంచిపనికోసం బయలుదేరేటప్పుడు మంచిశకునం చూసుకుని బయలుదేరుతాడు. ఏ కన్యయో, సుమంగిళియో ఎదురొస్తే మంచి శకునంగ భావిస్తారు. వివాహ నిశ్చితార్థసమయంలో వచ్చిన అతిథులకు ధనియాలు,బెల్లం ఇవ్వడం శుభంగ భావిస్తారు.

వీటన్నిటినీ మించి శుభాలు నాలుగు ఉన్నాయి -

1 భగవాన్ మహావీర్ దేవుని నామం - ఇది మొదటి గొప్ప మంగళం.

2 భగవాన్ మహావీర్ దేవుని ప్రథమ గణధరుడైన శ్రీ గౌతమ్ స్వామీజీయొక్క నామం - ఇది రెండవ గొప్ప మంగళం.

3 ఆచార్య శ్రీ స్థూలభద్ర స్వామీజీ మొదలైన పేర్లు మూడవ మంగళం. ఎందుచేతనంటే ఈ ప్రపంచంలో అందరికంటె శ్రేష్ఠులైన సదాచార మూర్తిస్వరూపులు వారు.

4 జైన ధర్మం నాలుగవ గొప్ప మంగళం. దీనికి కారణం ఏమిటంటే జైన ధర్మం జగత్తులోని సమస్త జీవుల పట్ల ప్రేమ,కరుణ భావాన్ని పెంపొందించే మంగళ పాఠాన్ని బోధిస్తుంది. అహింస,సంయమనం,తపస్సుల సందేశమిస్తుంది. అంత్యకాలంలో మోక్షం పొందేలా చేస్తుంది.

ఏ శుభకార్యాన్ని మొదలెట్టేటప్పుడయినా ఈ గొప్ప మంగళములను ఎవరు స్తరిస్తారో వారికి విఘ్నములన్నీ దూరమవుతాయి. తప్పక కార్యసిద్ధి లభిస్తుంది.

# 21 నాలుగు - సామాయిక్

భగవాన్ శ్రీ జినేశ్వర దేవుడు సంసారసాగరాన్ని దాటడానికి 'సామాయిక్' పేరుతో సాధన తెల్పాడు. ఈ సామాయిక్ నాలుగు విధాలు.

1 శ్రుత సామాయిక్, 2 సమ్యక్త్వ సామాయిక్, 3 దేశవిరతి సామాయిక్, 4 సర్వవిరతి సామాయిక్.

1 శ్రుత సామాయిక్ - శ్రీజినేశ్వర దేవుని ద్వారా బోధించబడిన మాటలను పూజ్య గురుమహరాజ్ శ్రీముఖంద్వారా వినడం, జినవాణి శ్రవణం చేయడం జైన గ్రంథాలను అధ్యయనం చేయడం దీనిని 'శ్రుత సామాయిక్' అంటారు.

2 సమ్యక్త్వ సామాయిక్ – శ్రీ జినేశ్వర దేవుడు దేనిని ఉపదేశించాడో అదే సత్యము, శంకా రహితము. ఇటువంటి దృఢమైన విశ్వాసం కలిగి ఉండడం, సత్యాన్ని సత్యంగ, అసత్యాన్ని అసత్యంగ గ్రహించే పరిక్రియనే 'సమ్యక్త్వ సామాయిక్' అంటారు.

3 దేశవిరతి సామాయిక్ – శ్రీజినేశ్వర దేవునియొక్క సమస్త ఆదేశాలను తమ మనసులో అత్యంత గౌరవంగ స్వీకరించడం, ఈ ఆజ్ఞలను ఎంతవరకు పాటించగలమో అంతవరకు శక్తివంచన లేకుండా పాటించడం. దీనిని 'దేశవిరతి సామాయిక్' అంటారు.

పాటించడానికి వీలైన కొన్ని ఆదేశాలను పరిశీలించండి – నౌకారశీ పచ్చుక్కాణ, కందమూల భక్షణ త్యాగం, రాత్రి భోజన విసర్జనం మొదలైనవి ఈ ఆదేశాలు. ఈ భగవానుని ఆదేశాలను స్వీకరించి అమలుచేయడానికి ప్రయత్నించాలి.

4 సర్వవిరతి సామాయిక్ - శ్రీజినేశ్వర దేవుని ఆజ్ఞానుసారం సంపూర్ణ సాధు జీవనం అనుసరించడం, సంసారాన్ని పూర్తిగ త్యజించడం, పంచ మహావ్రతాలను పరిపూర్ణంగ, ఆనందంగ అనుసరించడం, జినాజ్ఞ, గురు అజ్ఞల ననుసరించి జీవితం చివరివరకు సంయమనం పాటించడం దీనిని 'సర్వవిరతి సామాయిక్' అంటారు.

# 22 నాలుగు - నిక్షేపాలు(విభాగాలు)

నిక్షేపానికి సీదాసాదా అర్థం చెప్పాలంటే ఒక విధమైన విభాగం. శ్రీజినశాసనంలో నిక్షేపం(విభాగం) నాలుగు విధాలుగ చెప్పబడింది.

1 నామ నిక్షేపం, 2 స్థాపనా నిక్షేపం, 3 ద్రవ్య నిక్షేపం, 4 భావ నిక్షేపం.

ప్రతి వస్తువుకి ఈ నాలుగు విధములైన నిక్షేపములు(విభాగములు) ఉంటాయి.

1 నామ నిక్షేపముచే రాజు – ఒకనికి రాజ్యపాలన లేదు. కాని వానిపేరుమాత్రం రాజు. నామ నిక్షేపముచేత అతడు 'రాజు' అని పిలువబడుతూ ఉంటాడు.

2 స్థాపనా నిక్షేపముచే రాజు – రాజుగారియొక్క చిత్రపటాన్ని లేదా విగ్రహాన్ని రాజుగానే భావిస్తాం. ఇక్కడ ఆ చిత్రం లేదా విగ్రహం స్థాపనా నిక్షేపముచేత 'రాజు'.

3 ద్రవ్య నిక్షేపముచే రాజు – భవిష్యత్ కాలంలో ఒకడు రాజు అవుతాడు. ఆ యువరాజును కూడా ప్రజలు రాజుగానే పిలుస్తూంటారు. ఆ యువరాజు కాబోయే రాజు. ప్రస్తుతం మాత్రం కాదు. అయినా రాజుగానే పిలువబడుతున్నాడు. ఇక్కడ యువరాజు ద్రవ్య నిక్షేపముచేత 'రాజు'.

4 భావ నిక్షేపముచే రాజు – ఒకరు నిజంగా రాజ్యపాలన చేస్తున్నాడు. అతన్ని ప్రజలు రాజు అని పిలుస్తారు. ఇక్కడ అతడు భావ నిక్షేపముచేత 'రాజు'.

ఈ విధంగ ప్రతివస్తువు నాలుగు విధాలుగ విభాగింపబడుతూ ఉంటుంది. వీనినే నాలుగు 'నిక్షేపాలు' అంటారు. రాజు విషయంలో ఎలా తెలుసుకున్నామో అలాగే జినేశ్వరుని విషయంలోకూడా తెలుసుకుందాం –

1 నామనిక్షేపముచే జినేశ్వరుడు – తీర్థంకర ప్రభువుకి జినేశ్వరుడని పేరు ఏదైతే కలదో అది నామ నిక్షేపంచేతనే ఏర్పడింది. అలాగే 'మహావీర్‌స్వామి' అనే పేరుకూడా నామ నిక్షేపమే.

2 స్థాపనానిక్షేపముచే జినేశ్వరుడు – జినేశ్వరుని చిత్రంగాని, విగ్రహంగాని ఉంటే అది స్థాపనా నిక్షేపముచేత జినేశ్వరుడు.

3 ద్రవ్యనిక్షేపముచే జినేశ్వరుడు – మహావీర్ ప్రభువు తీర్థంకరుడు కానిక్రితం వర్ధమానుడు రూపంలోనే ఉన్నప్పుడు అప్పుడుకూడా భవిష్యత్తులో జినేశ్వర ప్రభువు అవుతాడు కనుక ఈ దృష్టితో జినేశ్వరుడుగ పిలువబడతాడు. ఇది ద్రవ్యనిక్షేపముచేత పిలువబడడం. లేదా జినేశ్వరుడుగ ఆయన జీవించి లేడు. ఆయన నిర్వాణంపొందిన పార్థివ శరీరంమాత్రం ఉంది. అప్పుడుకూడా ద్రవ్య నిక్షేపముచేత జినేశ్వరుడుగ పిలువబడుతున్నాడు.

4 భావనిక్షేపముచే జినేశ్వరుడు – ఎప్పుడు జినేశ్వరుడు నిజంగ జీవించి ఉన్నాడో, సమవసరణంలో విరాజమానుడయి 'దేశ్‌నా'(ధర్మోపదేశం) మొదలైనవి ఇస్తూ ఉంటే అపుడు భావ నిక్షేపముచేత జినేశ్వరుడు అనబడతాడు.

# 23 నాలుగు - శరణ్యాలు(శరణ్య స్థలాలు)

ఈ ప్రపంచంలో నిజానికి మనదంటూ ఏదీలేదు. తల్లి,తండ్రి,కొడుకు,భార్య, సంపద,ఉద్యోగం,కీర్తిప్రతిష్ఠలు ఏవీ మనకూడా వచ్చేవి కావు. నిజం చెప్పాలంటే మనం నిరాధారులం. నిరాధారులకు ఆధార రూపము, నిరాశ్రితులకు ఆశ్రయము శరణము రూపంలో నాలుగు తత్త్వాలు ఈ లోకంలో ఉన్నాయి. స్వచ్ఛమైన అంత:కరణతో ఎవరైనా ఈ శరణ్యాలను శరణు కోరుకుంటే వారికి ఏ భయమూ ఉండదు. అప్పుడు మనుష్యుడు నిర్భయుడు, నిశ్చింతుడు అవుతాడు.

1 ప్రథమ శరణ్యం - అరిహంత - అరిహంత భగవానుడు మొదటి శరణ్యం (శరణ స్థలం) అరిహంత అపార కరుణానిలయుడు. అరిహంత భగవానుని శరణు ఎవరైతే నిజాయితీగ స్వచ్ఛమైన మనస్సుతో కోరుకుంటారో వారిని అరిహంత భగవానుడు జీవననౌకయై సంసారసాగరాన్ని దాటిస్తాడు. మోక్షము దరికి చేరుస్తాడు.

2 రెండవ శరణ్యం - సిద్ధ - సిద్ధ భగవానుడు రెండవ శరణ్యం. సిద్ధ భగవానుడు సమస్త కర్మలను క్షయం(నాశనం) చేసి మోక్షమార్గం చూపుతాడు. ఈ కారణంచేత మనం సిద్ధులం కావాలని కృషి చేస్తాం. సిద్ధ పదంయొక్క శాశ్వత సుఖాన్ని పొందడానికి మనం సిద్ధ భగవానుని శరణులోకి వెళ్ళాలి.

3 మూడవ శరణ్యం - సాధు - సాధు భగవానుడు మన మూడవ శరణ్యం. సాధు(ముని) భగవానుని ఆజ్ఞానుసారం జీవితం గడుపుతూ, ఈ లోకాన్ని జీవించడానికి మాత్రం కల్యాణకారకం చేసుకుంటారు. సాధు సంసారతాపంచే దహించుకుపోతున్న జీవునికి విశాల వటవృక్షంయొక్క చల్లని నీడతో సమానమైనవాడు. నిజమైన సాధువుయొక్క శరణస్థలం చేరుకున్నవాడు తన శరీర తాపాన్ని, మనస్సులోని సంతాపాన్ని రెండింటినీ శాంతింప చేసుకుంటాడు.

4 నాలుగవ శరణ్యం - జినధర్మం - కేవల జ్ఞానియైన జినేశ్వర భగవానునిచే ఉపదేశింపబడిన జినధర్మం నాలుగవ శరణ్యం. జినధర్మం మనుష్యుణ్ణి ఈ లోకంలోని సమస్త దు:ఖాలనుండి ఒక్కసారిగ విముక్తుణ్ణి చేస్తుంది. జినధర్మం జనన,మరణ రూపమైన భయంకర పీడనుంచి శాశ్వతంగ బయటపడేసి అంత్యకాలంలో మోక్షాన్ని, అక్షయ సుఖాన్ని ప్రసాదిస్తుంది.

ఏ మానవుడైనా ఈ నాలుగు శరణ్యాల శరణులో స్వచ్ఛమైన హృదయంతో ప్రవర్తిస్తే ఎన్నటికీ దు:ఖితుడు కాడు.

# 24 నాలుగు - ధ్యానములు

జినశాసనంలో ధ్యానం నాలుగు రకాలుగ చెప్పబడింది. ధ్యానమంటే ధ్యాసలో ఏకాగ్రత. ఈ నాలుగు ధ్యానములలో మొదటి రెండు అశుభకారకము లగుటచే విడిచి పెట్టాలి. చివరి రెండు శుభకారకము లగుటచే అనుసరించాలి. అవశ్యం స్వీకరించాలి.

అవి 1 ఆర్త ధ్యానం, 2 రౌద్ర ధ్యానం, 3 ధర్మ ధ్యానం, 4 శుక్ల ధ్యానం.

1 ఆర్త ధ్యానం - సంసారంలో సుఖం పొందడం, పొందిన సుఖాన్ని నిలుపు కోవడం, కష్టాలు లేనట్టి లేదా వచ్చిన కష్టాలను దూరంచేసుకునేటటువంటి కోరిక, రోగ వినాశనానికి ఆలోచన వంటి వాటిపై ఏకాగ్రతను 'ఆర్త ధ్యానము' అంటారు. అంటే ఎల్లప్పుడు అదే ధ్యాసగ ఆలోచిస్తూ ఉండడం.

2 రౌద్ర ధ్యానం - హింస,అసత్యం,దొంగతనం చేయడానికి అలాగే సంపద, కీర్తి మొదలైనవి రక్షించుకోవడంకోసం భయంకరమైన, క్రూరమైన ఆలోచనతో కూడిన ఏకాగ్రతను 'రౌద్ర ధ్యానము' అంటారు.

3 ధర్మ ధ్యానం - "ఆత్మ కల్యాణకారకమైన జినధర్మం ఎంత శ్రేష్టమైనది ! జినేశ్వరునియొక్క ఆజ్ఞలు ఎంత ఉత్తమమైనవి ! రాగము, ద్వేషము, అజ్ఞానము మొదలైనవి ఎంత భయంకరమైనవి !" అన్న ఆలోచనతో కూడిన ఏకాగ్రతను 'ధర్మ ధ్యానము' అంటారు.

4 శుక్ల ధ్యానం - శ్రేష్టులైన మునుల జీవాత్మ కేవల జ్ఞానాన్ని పొందడానికి ముందు పొందబడే కేవల భగవానుని యోగం, నిరోధావస్థకు చెందిన ఏ క్రియా కలాపమైతే ఉందో దానిని 'శుక్ల ధ్యానము' అనే పేరుతో వ్యవహరిస్తారు.

ఆర్త ధ్యానంచేత తిర్యక్ జన్మ లభిస్తుంది.
రౌద్ర ధ్యానంచేత నరక గతి లభిస్తుంది.
ధర్మ ధ్యానంచేత దేవ లేదా మనుష్య జన్మ లభిస్తుంది.
శుక్ల ధ్యానంచేత మోక్ష గతి లభిస్తుంది

అందువల్ల -

ఆర్త ధ్యానం, రౌద్ర ధ్యానం వదలిపెట్టాలి. ధర్మ ధ్యానంలో మన మనస్సును లగ్నం చేయాలి. అలా పయనించగ చివరకు శుక్ల ధ్యాన ప్రాప్తి లభిస్తుంది.

# 25 పంచ - పరమేష్ఠిలు

శ్రీ జైనశాసనంలో పంచ పరమేష్ఠిలకు ఎక్కువ మహిమ చెప్పబడుతోంది. ఈ లోకంలో సర్వ శ్రేష్ఠమైన, మహోన్నతమైన స్థానాన్ని పొందించగలిగినవారు ఈ పంచ పరమేష్ఠిలు. అందుకే వీరిని శ్రీ నవకార మంత్రంలో సవినయంగ నమస్కరిస్తూంటాం.

పంచ పరమేష్ఠిలు 1 అరిహంత,2 సిద్ధ, 3 ఆచార్య, 4 ఉపాధ్యాయ, 5 సాధు.

1 అరిహంత - రాగ,ద్వేషాలనుండి పూర్తిగ విముక్తులైనవారు 'అరిహంత' అనబడతారు. వారు అనంత గుణములచే పరిపూర్ణులు. అన్ని విధాల దోషరహితులు, సర్వజ్ఞులు. జైన ధర్మరూపమైన తీర్థాన్ని స్థాపించి లోకంలోని లక్షలాది, కోట్లాది జీవులకు మోక్షప్రాప్తిని కలిగించే వారవుతున్నారు. వారికి ముఖ్యంగ 12 గుణాలు(64) ఉంటాయి.

2 సిద్ధ - వీరు అష్టవిధాలైన కర్మలకు(52) దూరంగ ఉంటారు. రాగ,ద్వేషాలు లేనివారవుతారు. అనంత గుణ సంపన్నులు, సర్వజ్ఞులు, నిరంతరం సూక్ష్మపథంలోనే విహరిస్తు ఉంటారు. పరిశుద్ధమైన ఆత్మ ప్రభావం పొందిన వారవుతారు. సిద్ధులు, బుద్ధులు, ముక్తులు అవుతారు.

3 ఆచార్య - అరిహంత ప్రభువు ఉపస్థితులు కానప్పుడు వీరే జైన శాసన పరిరక్షకులు. 36 గుణాలకు(94) స్వాములు. పంచ మహానియమాలను పాటించేవారు. గచ్ఛకు నాయకులుగ ఉంటారు. జైనసంఘానికి సిరతాజు అవుతారు.

4 ఉపాధ్యాయ - వీరు పంచ మహావ్రతాలని నియమంగ పాటిస్తూ ఉంటారు.వీరు స్వయంగ శాస్త్ర పఠనం చేస్తూంటారు. ఇతర సాధువులకు శాస్త్రబోధ చేస్తూంటారు. వీరు 25 గుణాలకు స్వాములు.

5 సాధు - వీరు పంచ మహావ్రతాలను పాటిస్తూ ఉంటారు. జీవితాంతం గుర్వాజ్ఞ ననుసరించి ప్రవర్తిస్తూ ఉంటారు. ఈ లోకంలోని సమస్త పాప కర్మలను పరిత్యజించి జీవిస్తూ ఉంటారు. దు:ఖాలను సమభావంతో సహిస్తారు. ఇతర సాధువులకు సంయమ పాలనలో సహాయపడుతూ ఉంటారు. సిద్ధ స్వరూపాన్ని పొందడానికి శుద్ధ సంయమనాన్ని పాటిస్తూ ఉంటారు. వీరు 27 గుణాలకు స్వాములు.

# 26 పంచ - మహావ్రతాలు

ఏకాగ్రతతో పూర్ణ ఆత్మ స్వభావాన్ని అంటే మోక్ష వ్యాప్తినే లక్ష్యంగ చేసుకుని శ్రీజినేశ్వర భగవానునియొక్క ఆజ్ఞానుసారం తమ జీవితమంతా గడిపే సాధు భగవానులు, సాధ్వీజీ భగవతులు జైనుల పంచ మహావ్రతాలను పాటిస్తూంటారు.

అవేమిటంటే -

1 ఎప్పుడూ ఏ ప్రాణికి ఆపద కలిగించక పోవడం(అహింస పాలన) - ఏ జీవ జంతువుని ఎపుడూ తాను కొట్టకూడదు. తాను ఇతరులచేత కొట్టించకూడదు. ఎవరేనా కొడతూంటే బాగుందని సంతోషించకూడదు. ఇలా చేసే గొప్ప ప్రతిజ్ఞకు 'ఎప్పుడూ ఏ ప్రాణికి ఆపద కలిగించక పోవడమ'నే మహావ్రతమని పేరు.

2 ఎప్పుడూ అబద్ధమాడక పోవడం(సత్య పాలన) - ఎప్పుడూ ఏ సమయంలోనూ తాను అబద్ధం, అసత్యం పలుకకూడదు. ఇతరులు అబద్ధమాడేలా ప్రేరేపించకూడదు. ఎవరైనా అబద్ధమాడితే దానిని సమర్థించకూడదు. ఇలాంటి గొప్ప ప్రతిజ్ఞను 'ఎప్పుడూ అబద్ధమాడక పోవడమ'నే మహావ్రతమంటారు.

3 ఎప్పుడూ ఇతరుల వస్తువులను వారివ్వకుండగ తీసుకొనక పోవడం (దొంగతనం చేయకుండుట) - ఏ వస్తువైనా ఆ వస్తువు ఎవరిదో వారి అనుమతి లేకుండ ఎప్పుడూ, ఎన్నడూ తీసుకొనరాదు. అది ఎటువంటి వస్తువైనా ఇతరులను తీసుకోమని ప్రోత్సహించరాదు. అలా ఎవరేనా తీసుకుంటుంటే సమర్థించకూడదు. ఇలాంటి గొప్ప ప్రతిజ్ఞను 'ఎప్పుడూ ఇతరుల వస్తువులను అడుగకుండా తీసుకొనక పోవడమ'నే మహావ్రతమంటారు.

4 ఎల్లప్పుడూ సంభోగాన్ని విరమించడం(బ్రహ్మచర్య పాలన) ఇతరులతో ఎపుడూ ఏవిధంగానూ సదాచారము కాని రీతిగ ప్రవర్తించకూడదు. సదాచారము పాటించవద్దని ఎవరినీ ప్రోత్సహించకూడదు. ఎవరైనా సదాచారము తప్పి ప్రవర్తిస్తూంటే సమర్థించ కూడదు. ఇలాంటి గొప్ప ప్రతిజ్ఞను 'ఎల్లప్పుడూ సంభోగాన్ని విరమించడమ'నే మహావ్రతమంటారు.

5 ఎప్పుడూ కూడబెట్టుకోక పోవడం(అసంగ్రహం) - ధనం,సంపద,ఇల్లు, కుటుంబం,సేవకులు మొదలైనవి ఎన్నడూ ఏవిధంగానూ సంపాదించి కూడబెట్టుకో కూడదు. ఇతరులెవరైనా పాత్రలు, బట్టలు వంటివి వదిలిపెట్టలేక తమ దగ్గరుంచుకుంటే వారిపై మమత చూపకూడదు. ఇతరుల వస్తువులను ఎన్నడూ తనవిగ భావించకూడదు. ఎవరైనా అలా భావిస్తూంటే వారిని సమర్థించకూడదు. ఇలాంటి గొప్ప ప్రతిజ్ఞను 'ఎప్పుడూ కూడబెట్టుకోక పోవడమ'నే మహావ్రతమంటారు.

# 27 పంచ - శుభకారకాలు

పంచపరమేష్ఠిలకు శిఖరాయమానంగ అరిహంత భగవానుడు ఉంటాడు. అరిహంత భగవానుని తీర్థంకరుడని, జినేశ్వర భగవానుడని కూడా పేర్కొంటారు. ఇటువంటి అనంతుడైన అరిహంత భగవానుడు నేటివరకూ ఉన్నాడు, భవిష్యత్తులోనూ ఉంటాడు. ఇలాంటి విశిష్ట తీర్థంకరదేవుని జీవితానికి చెందిన 5 విశిష్ట ప్రసంగాలున్నాయి. ఈ 5 విశిష్ట ప్రసంగాలలోను లోకానికి అంటే ముల్లోకాలకి చెందిన సమస్త జీవులు క్షనమాత్రం అద్భుత సుఖాన్ని అనుభవించ గలుగుతారు. ఏ సుఖాన్ని అనుభవిస్తారో దాన్ని 'శుభకారకము' అంటారు. అందువల్ల ధర్మశాస్త్ర పరిభాషలో ఈ 5 ప్రసాంగాలకు 'అయిదు శుభకారకములు' అని పేరు.

1 విముక్త శుభకారకం - ప్రతి తీర్థంకరుడు తమ పూర్వజన్మలో దేవ లోకంలో లేదా నరక లోకంలో ఉంటారు. అక్కడినుంచి వారి ఆత్మ విముక్తమవుతుంది. దీనినే 'విముక్త శుభకారకం' అంటారు.

2 జన్మ శుభకారకం - దేవ లోకంలో లేదా నరక లోకంలో నుంచి విముక్తమై తల్లి గర్భంలో ప్రవేశించిన తరువాత నవమాసాలు పూర్తవగానే తీర్థంకరుల జనన మవుతుంది. దీనిని 'జన్మ శుభకారకం' అంటారు. ఈ సమయంలో దేవి, దేవతలు మహా విజృంభణతో తీర్థంకరుల జననమహోత్సవాన్ని గొప్ప ఆడంబరంగ జరుపు కుంటారు.

3 దీక్ష శుభకారకం - సుఖమయమైన సంసారాన్ని, రాజ వైభవ సంబంధమైన గొప్ప సుఖాలను త్యజించి తీర్థంకర భగవానుడు ఎప్పుడు దీక్ష(సంయమం)ను స్వీకరించారో దాన్ని 'దీక్షా శుభకారకం' అంటారు.

4 కేవలజ్ఞాన శుభకారకం - దీక్షా స్వీకరణానంతరం కొద్దికాలం కఠోర తపశ్చర్య పాటిస్తూ కఠోరమైన, తీవ్రమైన ఉపసర్గం, అపూర్వ సమతాభావనతో కూడిన సహనత్వంతో తీర్థంకర భగవానునికి ఒక పవిత్ర సమయంలో నిర్మల కేవలజ్ఞానం లభిస్తుంది. కేవలజ్ఞానంలో ప్రభువుకి సమస్త విశ్వంలోని సమస్త పదార్థాల సహజత్వంతో కూడిన జ్ఞానం కలుగుతుంది. ఇటువంటి కేవలజ్ఞానం ప్రభువుకి కలుగగానే దీనిని 'కేవలజ్ఞాన శుభకారకం' అన్నారు. ఈ సమయంలో దేవతలు సమవసరణ(74) రచన చేశారు. అందులో దేవతలచే రచింపబడిన సింహాసనంపై విరాజమానులై ప్రభువు దేశ్నా (ధర్మోపదేశం) చేశారు.

5 నిర్వాణ శుభకారకం - తారకుడైన తీర్థంకరుడు ఈ లోకంలోని లక్షలాది జీవులకు మోక్షమార్గ మధుర ధర్మోపదేశం చేసి, తమ జీవితాన్ని సార్థకం చేసుకుని పరిపూర్ణం చేసుకుంటారు. అపుడు వారు ఈ లోకాన్ని, తమ శరీరాన్ని త్యజించి మోక్షం అనుభవిస్తారు. దీన్ని 'మోక్ష శుభకారకం' అంటారు.

# 28 పంచ - ఇంద్రియాలు

ఇంద్ర అంటే జీవుడు. జీవుడు జ్ఞాన ప్రాప్తి పొందడానికి సాధనమే 'ఇంద్రియం'.

ఈ ఇంద్రియాలు అయిదు -

1 స్పర్శేంద్రియం - సాధారణంగ దీనినే చర్మం, తోలు అంటారు.

2 రసనేంద్రియం - వ్యావహారికంలో నాలుక అంటారు.

3 ఘ్రాణేంద్రియం - వాడుకభాషలో దీనిని ముక్కు అంటారు.

4 చక్షురింద్రియం - తెలుగులో మనం కళ్ళు అంటాం.

5 శ్రోత్రేంద్రియం - సామాన్యభాషలో చెవి అంటారు.

ఇంద్రియాల దురుపయోగం - ఈ పంచేంద్రియాలలో చర్మంతో మనం మంచి మృదువైన వస్తువులను తాకడం, నాలుకతో రుచికరమైన మసాలా వస్తువులు తినడం, ముక్కుతో పూవుల, అత్తరుల వాసనలు చూడడం, కళ్ళతో ఏదైనా రూపసౌందర్యాన్ని చూడడం, చెవులతో సినిమాలలోని చౌకబారు సంగీతం వినడం - ఇటువంటి వాటిపై ఎక్కువ వ్యామోహం కలిగి ఉంటే అది పంచేంద్రియాలను దురుపయోగం చేసుకోడమవుతుంది. దీనివల్ల పాపం పెరుగుతుంది. దుర్గతికి చెందిన భయంకరంగ దహించే కష్టం కలుగుతుంది. ఈ లోకంలో మళ్ళీ మళ్ళీ పుడుతూ, ఛస్తూ చక్రభ్రమణం చేస్తూంటారు.

ఇంద్రియాల సదుపయోగం - ఈ అయిదు ఇంద్రియాలలో చర్మంతో భగవానుని పూజించడానికి చందనాన్ని స్పృశించాలి. భగవానుని దేహాన్ని శుభ్రం చేయాలి. నాలుకతో జిన శ్రేష్ఠుని గుణాలు గానం చేయాలి. ముక్కుతో గురు మహరాజుల ఆహారంలో ఇరుగుపొరుగువారు పదార్థముల వాసననుబట్టి మంచి,చెడులను నిర్ణయిస్తారు. కళ్ళతో భగవానుని విగ్రహాన్ని లేదా సద్గురు దర్శనాన్ని చేయాలి. చెవులతో భగవానుని గీతాలను, గుణవంతుల ప్రశంసను వినాలి. అలాచేస్తే పంచేంద్రియాలు సదుపయోగం చేసుకున్న వారమవుతాం. దీనివల్ల పుణ్యం పెరుగుతుంది. సద్గతిలో అగణ్యమైన సుఖం లభిస్తుంది. అంత్యకాలంలో శివపదం, మోక్షం శాశ్వత నివాస మవుతుంది.

# 29 పంచ - జీవులు

జీవులు వాటి ఇంద్రియాల సంఖ్యనుబట్టి అయిదు విధాలుగ చెప్పబడ్డాయి.

1 ఏక ఇంద్రియజీవులు - వీనికి కేవలం స్పర్శజ్ఞానం మాత్రం ఉంటుంది. అంటే చర్మంమాత్రం ఉంటుంది. అవి మట్టి,నీళ్ళు,అగ్ని,గాలి,చెట్లు మొదలైనవి.

2 ద్వి ఇంద్రియజీవులు - వీనికి కేవలం చర్మము,నాలుక ఈ రెండు ఇంద్రియాలు మాత్రమే ఉంటాయి. వీనివల్ల కేవలం స్పర్శ,రుచిమాత్రం తెలుస్తాయి. ఇలాంటివి కీటకాలు,గువ్వలు,ముత్యపుచిప్పలు, వానపాములు మొదలైనవి.

3 త్రి ఇంద్రియజీవులు - వీనికి కేవలం చర్మం,నాలుక,ముక్కు మూడు ఇంద్రియాలు మాత్రమే ఉంటాయి. వీనివల్ల స్పర్శ,రుచి,వాసన జ్ఞానముంటుంది. ఇలాంటివి చలిచీమలు.నల్లి,చిన్న పురుగులు,పేలు మొదలైనవి.

4 చతురింద్రియజీవులు - వీనికి చర్మము,నాలుక,ముక్కు,కళ్ళు నాలుగు ఇంద్రియములుంటాయి. వీనివల్ల స్పర్శ,రుచి,వాసన,రూపం(చూడడం) ఈ నాలుగు పనులు చేయగలుగుతాయి. ఇలాంటివి తేనెటీగలు, ఈగలు,దోమలు,తేళ్ళు మొదలైనవి.

5 పంచేంద్రియజీవులు - వీనికి చర్మం,ముక్కు,నాలుక,కళ్ళు,చెవులుఈ అయిదు ఇంద్రియములు ఉంటాయి. వీనివల్ల స్పర్శ,రుచి,వాసన,చూపు,వినికిడి జ్ఞానం ఉంటుంది. ఇటువంటి జీవులు దేవ,మనుష్య, తిర్యక్,నారకులు మొదలైనవారు.

మానవునికి ఏ జీవినీ హత్యచేసే అధికారం లేదు. ఏ జీవినీ హింసించడానికి వీలులేదు. ఏ జీవికీ తను దు:ఖపడడం ఇష్టముండదు. మనం ఇతర జీవులకు దు:ఖంకలిగిస్తే మనమూ దు:ఖపడాల్సి వస్తుంది. మనం ఇతరులకు సుఖం కలుగజేస్తే మనకీ సుఖం కలుగుతుంది. ఈ ఉదాహరణ చూడండి -

ఏం విత్తనం నాటితే ఆ ఫలితం పొందుతావుకదా !

అలాగే, ఏది నీవు చేస్తే దాన్ని నీవు అనుభవిస్తావు.

మనం మానవలోకంలో ఉంటున్నాం. అందుచేత ఏక ఇంద్రియజీవుల హింస లేకుండ మన జీవనం సాగదు. అందుచేత మనం చేయాల్సిందేమిటంటే తక్కువలో తక్కువ హింస చేయాలి. ఎంతవరకు సాధ్యమో, అలా జీవితాన్ని గడుపుతూ సమస్త జీవులపై దయ చూపుతూ ఉండాలి.

మనకు శక్తి ఉంటే జైన సాధువులం కావాలి. అలా వీలుకాకపోతే ఉన్నత వార్గానికి చెందిన శ్రావక జీవనం గడపాలి. ఇందుకోసం సమస్త జీవులపై అపార కరుణను చూపాలి.

# 30 పంచ - దానములు

ఆచార్యులు దానాన్ని 5 విధాలుగ చెప్పారు. అవి -

1 అభయదానము, 2 సుపాత్రదానము, 3 అనుకంపాదానము, 4 కీర్తిదానము, 5 ఉచితదానము.

1 అభయదానము - ఏ జీవినైనా చావునుంచి తప్పిస్తే అది 'అభయదానం'.

2 సుపాత్రదానము - పూజనీయులైన సాధులు, సాధ్వీజీమహరాజ్‌లు, శ్రావకులు, శ్రావికలు వీరికి ఆహారం(అన్నపానీయాలు) మొదలైనవి ఇవ్వడం. 'సుపాత్రదానం'.

3 అనుకంపాదానము - బీదలు, వికలాంగులు మొదలగువారికి డబ్బు,వస్త్రాలు ఉదారంగ ఇవ్వడం 'అనుకంపాదానం'.

4 కీర్తిదానము - కీర్తి, ప్రతిష్ఠలు కోరిచేసే దానం 'కీర్తిదానం'.

5 ఉచితదానము - వ్యవహారం పరిరక్షించుకోవడంకోసం చేసే దానం 'ఉచితదానం'

ఈ 5 దానాల్లో అయిదవ దానికంటె మొదటి నాలుగు, నాలుగింటిలో మొదటి మూడు, మూడింటిలో మొదటి రెండు, రెండింటిలో మొదటిది ఒకదానికంటె ఒకటి శ్రేష్ఠమైనవి.

దానం విషయంలో ఈ 5 విలువైన భూషణముల వంటివి -

1 దానం చేసేటప్పుడు కళ్ళనుంచి ఆనందబాష్పాలు రాలాలి.

2 దానం చేసేటప్పుడు శరీరం రోమాంచమై పులకరించాలి.

3 దానం చేసేటప్పుడు మనస్సులో బహుమతి ఇస్తున్న భావం కలగాలి.

4 దానం చేసేటప్పుడు వినయంగ, మధురంగ మాట్లాడాలి.

5 దానం చేసేక సంతోషించాలి. దానికోసం విచారించకూడదు.

దానానికి సంబంధించిన ఈ 5 విలువైన భూషణములను తమ జీవితంలో ఆచరణలోకి తెచ్చుకోడానికి ప్రయత్నించాలి.

దానం విషయంలో ఈ 5 దూషణ స్వరూపాలు -

1 దానం అనాదరభావంతో చేయడం.

2 దానం చేసేటప్పుడు ఎక్కువకాలం నిలబెట్టడం.

3 దానం చేసేటప్పుడు ముఖం మాడ్చుకోడం.

4 దానం చేసేటప్పుడు కఠినంగ మాట్లాడడం.

5 దానం చేసేక ఎందుకు చేశానా అని పశ్చాత్తాప పడడం.

ఈ 5 దూషణాలను జీవితంలో దూరం చేసుకోడానికి ఎల్లప్పుడూ ప్రయత్నిస్తూ ఉండాలి.

# 31 పంచ - ఆచారాలు

ఆచారమంటే క్రియ, ప్రవృత్తి. ఇక్కడ జిన భగవానుడు అయిదు విధాలయిన ఆచారాలను చెప్పడం జరిగింది. ఇవి మంగళకరమైన మంచి ఆచారములు.

అవి -

1 జ్ఞానాచారము, 2 దశనాచారము, 3 చారిత్రాచారము, 4 తపాచారము, 5 వీర్యాచారము.

1 జ్ఞానాచారము - నిజమైన, స్వచ్ఛమైన జ్ఞానాన్ని అధ్యయనం, అధ్యాపనం చేయడం - జ్ఞానము - జ్ఞానముకల వ్యక్తి - జ్ఞానసాధకములైన ఉపకరణములు - సాపడా, పుస్తకం, చిన్నపుస్తకం(పోథీ) వీనిని గౌరవించడం జ్ఞానాచారమనబడుతుంది.

2 దశనాచారము - శ్రీ జినేశ్వర భగవానుని సమస్త ప్రవచనములపై అంత:కరణ శుద్ధిగ శ్రద్ధ కలిగి ఉండాలి. ఏ విధమైన ఆశంక ఉండకూడదు. ధార్మిక ప్రవృత్తికి ప్రజలను ప్రోత్సహించాలి. వారితో సాధర్మిక వాత్సల్యం(తినడం,తాగడం, పొగడడం) ప్రకటించాలి. జైన శాసనాన్ని ప్రభావితం(ప్రసారము,ఉన్నతి) చేయాలి. ఇది దశనాచారం.

3 చారిత్రాచారము - అయిదు సమితులు, మూడు గుప్తుల(56) రూపంలో సంయమ ధర్మపాలన చేయడం చారిత్రాచారం.

4 తపాచారము - ఆరు విధాలైన బాహ్యతపం, ఆరు విధాలైన అభ్యంతర (ఆంతరిక) తపం(16) యొక్క ఆరాధన చేయడాన్ని తపాచారం అంటారు.

5 వీర్యాచారము - ధర్మానికి సంబంధించిన ఆచారాలు - జ్ఞానాచారం, ధశనాచారం, చారిత్రాచారం, తపాచారం మొదలైన ఆరాధనలో, వాటిని అనుసరించడంలో వీర్యం(ఉల్లాసం,ఉత్సాహం,పరాక్రమం) చూపించడం, వానిని పెంచుకోడం, తమ శక్తి దాచుకోకపోవడం వీర్యాచారం.

ఈ అయిదు ఆచారాలను యథా యోగ్యంగ అనుసరిస్తే తమ జీవితాన్ని నందనవనంతో సమానంగ చేసుకోవచ్చును.

# 32 సమ్యక్త్వం - పంచ లక్షణాలు

శ్రీజినేశ్వర భగవానుడు ఏది ప్రవచించాడో అది పూర్తిగ సత్యము. ఎందుచేతనంటే అసత్యం, అబద్ధం పలకడంవలన కోపము,అహంకారము,మాయ,లోభము, రాగము, ద్వేషము,అజ్ఞానము మొదలైనవి కారణమవుతాయి. ఆయన వాటిని పరిపూర్ణంగ నాశనం చేసేశాడు కదా! అందుచేత జినేశ్వరుడు ఏం చెప్పాడో అది సత్యము, శంకారహితము అని మనఃపూర్వకంగ విశ్వసించడమే సమ్యక్త్వం. ఇటువంటి సమ్యక్త్వం ఏ జీవుని ఆత్మలో నిర్మాణమై ఉంటుందో అటువంటి వారి జీవనానికి అయిదు లక్షణాలు చెప్పబడ్డాయి.

1 శమము(సమత,శాంతి) – సమస్త జీవులయందు సమభావన కలిగి ఉండడం. శత్రువు,అపరాధి పట్లకూడా వాడి చెడునుగూర్చి ఆలోచించకపోవడం. విశ్వంలోని సమస్త జీవులకు కల్యాణమవ్వాలనే పవిత్రభావన కలిగి ఉండడాన్ని శమము అంటారు.

2 సంవేగం(మోక్షకామన) – దేవతలు,మానవులు భోగ,సుఖాలను కోరి ఎంతో ఆనందంగ,సౌఖ్యంగ ఉండాలి. కాని వారు దుఃఖభాగులవుతున్నారు ఎందుకు? అందువలన ఈ భోగసుఖాలన్నిటిపైన మనస్సులో ఉపేక్షవహించి ఏకమనస్కతతో మోక్షాన్ని లేదా పరిశుద్ధాత్మను పరిపూర్ణంగ పొందే కోరికను సంవేగమంటారు.

3 నిర్వేదం(వైరాగ్యం) – ఈ విశ్వమంతా పుట్టడం,పెరగడం,చావడం అనే దుఃఖలతో నిండి ఉంది. ఈ లోకం ఆధి,వ్యాధి,ఉపాధి అనే భయంకర దుఃఖాల నిలయం. ఇందులో ఆసక్తి కనబరచవలసిన విషయం ఒక్కటీలేదు.ఇటువంటి సంసారంపై పూర్తిగ వైరాగ్యభావం కలిగి ఉండడం, ఎంత త్వరగ వీలైతే అంత త్వరగ విముక్తుడవడానికి కోరుకోవడం నిర్వేదం అనబడుతుంది.

4 అనుకంప(కరుణ) – ఈ లోకంలో కష్టాలపాలవుతున్న ప్రాణుల కష్టాలను చూసి వారి దుఃఖాలను దూరం చేయాలనే నిశ్చలమైన భావన మనసులో కలగడం అనుకంప. దుఃఖితుల దుఃఖం,శోకం,బిచ్చమెత్తుకోడం మొదలైన దుఃఖాలను దూరంచేయాలనే భావన 'ద్రవ్య అనుకంప'. ధర్మాన్ని అనుసరించని వారిని, ధర్మాన్ని తిరస్కరించే వారిని ధర్మమార్గంవైపు మళ్ళించే ప్రయత్నం 'భావ అనుకంప'.

5 ఆస్తికత(శ్రద్ధ) – శ్రీజినేశ్వర భగవానుడు ఏది బోధించాడో ఆ తత్వజ్ఞానం పూర్ణసత్యము అనే భావన కలగడం. మంచిదైవం,మంచిగురువు,మంచిధర్మం వైపు నిశ్చలమైన శ్రద్ధ ఉంచడం ఆస్తికత అనబడుతుంది. సమ్యక్త్వానికి ఈ పైన చెప్పబడిన అయిదు లక్షణాలు ఆధారంగ చేసుకుని మనం మనలను పరీక్షించుకుని చూసుకోవాలి. అపుడు తెలుస్తుంది మనలో సమ్యక్త్వం ఉందో లేదో.

ప్రయత్నిద్దాం, అటువంటి సమ్యక్ దర్శనం పొంది మనం మన జీవితాన్ని అంటే మళ్ళీ మళ్ళీ పుట్టడం, చావడం తగ్గించుకుందాం.

# 33 పంచ - స్వాధ్యాయం

స్వాధ్యాయమంటే మంచి శాస్త్రాలను చదవడం, చదివించడం. శాస్త్రాధ్యయనం వలన నిజమైన జ్ఞానం కలుగుతుంది. నిజమైన జ్ఞానం అంటే నిజమైన తెలివి కలగడం. నిజమైన తెలివి కలగడం వలన మనుష్యుని మనసులో వివేకం అభివృద్ధి పొందుతుంది. యదార్థాన్ని దర్శించగలిగే శక్తి కలుగుతుంది. ఆత్మ కల్యాణం లభిస్తుంది. ఆత్మ కల్యాణంకోసం అత్యంత ఆవశ్యకమైన అయిదు స్వాధ్యాయ విషయాలున్నాయి.

1 వాచక స్వాధ్యాయం – ధర్మసూత్రములను వాటి అర్థములను చదవడం, చదివించడం 'వాచక' స్వాధ్యాయమనబడుతుంది.

2 పృచ్ఛక స్వాధ్యాయం – ధర్మసూత్రాలు వాని అర్థం అవగతం కానప్పుడు సమర్థుడైన గురువుదగ్గరకు వెళ్ళి వాని విషయమై అడిగి తెలుసుకోవడం 'పృచ్ఛక'స్వాధాయమనబడుతుంది.

3 ఆవృత్తి స్వాధ్యాయం – ఆవృత్తి పరమార్థమేమిటంటే చదివిన సూత్రాలను, వాటి అర్థాలను మాటిమాటికి ఆవృత్తి చేసుకోవడం. ఈ మాట చాలా మహత్త్వపూర్ణ మైనది. చదివింది కొన్నిరోజులకు మరిచిపోతాం. కాని పునరావృత్తి చేసుకుంటుండడం వలన మరిచిపోకుండా ఉంటాం.

4 చింతన స్వాధ్యాయం – మనం సంపాదించిన జ్ఞానానికి ఆనుషంగికమైన విషయాలను గురించి ఆలోచించడం 'చింతన' స్వాధ్యాయం.

5 చర్చ స్వాధ్యాయం – తత్త్వజ్ఞానం విషయంలో ధర్మభావనను పుష్టిపరచడానికి సంబంధించిన విషయాలనుగూర్చి వివరంగ సమర్థులతో చర్చించడమే 'చర్చ' స్వాధ్యాయం.

## 34 పంచ – పర్యుషణపర్వ కర్తవ్యాలు

ప్రతి సంవత్సరం శ్రావణమాసం కృష్ణపక్ష ద్వాదశి మొదలుకొని భాద్రపదమాసం శుక్లపక్షం చతుర్థివరకుగల రోజులలో జైన ధర్మానికిచెందిన ఒక మహాపర్వం వస్తుంది. ఈ పర్వాన్ని 'పర్యుషణ' అంటారు.

ఈ పర్వంయొక్క మహిమ వర్ణించ శక్యంకానిది. ఈ పర్వంలో మొదటి మూడు రోజులలో సద్గురువులు వారి వ్యాఖ్యానంతో శ్రోతలకు నిర్వర్తించవలసిన అయిదు కర్తవ్యాలను గురించి తెలియజేస్తారు. ఈ అయిదు కర్తవ్యాలను మనం మిక్కిలి సుందరమైన రీతిలో నిర్వర్తించుకోవాలి. ఆరాధన చేసుకోవాలి.

1 అమారి(అహింస)ప్రవర్తన – అమారి అంటే అహింస. మనం ఏ జీవినీకూడా హింసించకుండా ఉండడం అలవరచుకోవాలి. లోకంలోని సమస్త జీవులయందు మనం మన మనస్సులో కరుణాపరులమై ఉండాలి. జీవులకు స్వయంగ అభయదానం చేయాలి. ఇతరులుకూడా ఇచ్చేలా చూడాలి. ధర్మంయొక్క మూలంలో దయ, కరుణ ఉంటాయి. మన జీవితంలో దయ, కరుణ రూపంలో ఉండే మూలాలు లేకపోతే లేదా అవి నశించిపోతే ఇక ధర్మం బ్రతికేది ఎలాగ?

2 సాధర్మిక వాత్సల్యం – దీని అర్థం సహధార్మికులకు అంటే జినశాసన ఉపాసన నాచరించే శ్రావక, శ్రావికలకు అంతఃకరణ పూర్వక భక్తి కలవారిగ చేయడం. వారిపై తమ వాత్సల్యం ప్రకటించడం. ధనం,సంపద,వస్త్రం,అన్నం,నివాసస్థలం,గృహం మొదలైనవి వారికి ఇచ్చి వారి జీవనం స్థిరపడేలా చూడడం. జినశాసనం చెబుతుంది – "త్రాసు యొక్క ఒక పళ్ళెంలో జీవితంలో చేసిన సమస్త ధర్మకార్యాలను ఉంచి, రెండవ పళ్ళెంలో సాధర్మిక భక్తి ఉంచితే రెండూ సమానంగ తూగుతాయి.

3 క్షమాపనా(క్షమాయాచన) – లోకంలోని సమస్త జీవుల నుంచి 'క్షమాయాచన' కోరుకోవాలి. ఏ జీవితోటి శత్రుత్వం వహించకూడదు. ఒకవేళ మన మనస్సులో ఎరిపైనైనా శత్రుత్వభావన ఉంటే మనం నిజమైన ధర్మారాధన చేయటంలేదన్నమాట. అందువలన మనసులో నిజమైన మిత్రత్వభావనను వహించి సరైన పద్ధతిలో ధర్మారాధన నిర్వర్తించాలి.

4 అట్ఠమతపం – అట్ఠమతపం అంటే మూడురోజుల ఉపవాసం. ఈ మూడు రోజుల ఉపవాస దీక్ష పర్యుషణ పర్వంలో తప్పక చేయాలి. జీవితంలో మనం చేసే పాపాలను పారద్రోలడానికి తపస్సు చేయాలి. విషయవాంఛలు, కషాయాలు (కామ, క్రోధాదులు) ఇవి ఆత్మను మైలపరుస్తాయి. ఈ మైలను కడిగేసుకోడానికి తపస్సు చక్కని సబ్బులా ఉపయోగపడుతుంది. ఈ అట్ఠమతపస్సు గురించి నాగకేతుముని దృష్టాంతం అవశ్యం మనకు తెలుపుతుంది.

5 చైత్య పరిపాటీ(జినదర్శనం) – చైత్యం అంటే జిన ప్రతిమ లేదా జినమందిరం. జినమందిరంలో జినేశ్వర భగవానుని దర్శించుకోవడంకోసం వెళ్ళే పనిని చైత్య పరిపాటీ అంటారు. పరమాత్మకు మనపై అపార కరుణ ఉంటుంది. పరమాత్మునియొక్క కరుణను అలాగే ఆయన గుణాలను నిరంతరం జ్ఞాపకముంచుకోవడానికి పూర్తి నియమంతో జినమందిరానికి వెళ్ళి దర్శనం, వందనం సమర్పించడం శ్రావకుల అవశ్య కర్తవ్యం. సంఘపరంగ దర్శనానికి వెళితే అందరి మనసుల్లోను చాలా ఉత్సాహం, ఉల్లాసం ఉబికివస్తుంది.

# 35 పంచ - ప్రతిక్రమణ

సంసారజీవితంలో ఉన్న అనగా సిద్ధపదం పొందని జీవులు పాపంచేత ఆక్రమింపబడుతూనే ఉంటారు. పాపకర్మల ఆక్రమణను దూరం చేసుకోడానికి 'ప్రతిక్రమణ'క్రియ చేసుకోవాలి. అందువలన జైన సమాజంలో పంచప్రతిక్రమణ అనే మాట చాలా విఖ్యాతమైనది.

ప్రతిక్రమణ అంటే పాపాలను దూరం చేసుకునే క్రియ. ప్రతిక్రమణ అయిదు విధాలుగ చెప్పబడింది. అవి -

1 రాత్రి ప్రతిక్రమణ, 2 దేవసి ప్రతిక్రమణ, 3 పాక్షిక ప్రతిక్రమణ, 4 చౌమాసీ ప్రతిక్రమణ, 5 సంవత్సరీ ప్రతిక్రమణ.

1 రాత్రి ప్రతిక్రమణ - ప్రతిరోజూ ఉదయం లేచి రాత్రి సమయంలో చేసిన పాపాలను దూరంచేసుకోడానికి చేసే ప్రతిక్రమణ 'రాత్రి ప్రతిక్రమణ'.

2 దేవసి ప్రతిక్రమణ - ప్రతిరోజు సాయంత్రం పగలంతా చేసిన పాపాలను నశింపచేసుకోవడంకోసం చేసే ప్రతిక్రమణ 'దేవసి ప్రతిక్రమణ'.

3 పాక్షిక ప్రతిక్రమణ - పక్షంలో(15 రోజులలో) చేసిన పాపాలను దూరం చేసుకోడానికి 15 రోజుల తరువాత చతుర్దశిరోజు సాయంత్రంచేసే ప్రతిక్రమణ 'పాక్షిక ప్రతిక్రమణ'.

4 చౌమాసీ ప్రతిక్రమణ - నాలుగు నెలల అవధిలో చేసిన పాపాలను దూరం చేసుకోవడానికి ప్రతి సంవత్సరం ఆషాఢం,కార్తీకం,ఫాల్గుణం మాసాలలో శుక్లపక్ష చదుర్దశి రోజున సాయంత్రం చేసే ప్రతిక్రమణ 'చౌమాసీ ప్రతిక్రమణ'.

5 సంవత్సరీ ప్రతిక్రమణ - సంవత్సరమంతా చేసిన పాపాలను దూరం చేసుకోవడానికి ప్రతి సంవత్సరం ఉగాది(సంవత్సరీ) రోజున సాయంత్రం చేసే ప్రతిక్రమణ 'సంవత్సరీ ప్రతిక్రమణ'.

ప్రతిక్రమణ అవశ్యం ఆచరించవలసిన కార్యం. అందువలన శ్రావకులు రాత్రి ప్రతిక్రమణ, దేవసి ప్రతిక్రమణ, మిగిలిన మూడు ప్రతిక్రమణలు నియమంతో పాటించాలి.

# 36 పంచ - కర్మబంధ కారణాలు

మిథ్యాత్వం మొదలైన అయిదు కారణాలచే జీవుడు తనతో కర్మబంధాన్ని తెంచుకుంటున్నాడు. అంటే జీవుడు స్వయంగ తనతోపాటు కర్మలతో ఏకాత్మమై (పాలు నీళ్ళు కలిసిన రీతిగ) బంధింపబడుతున్నాడు. కర్మబంధానికి అయిదు కారణాలున్నాయి. అవి -

1 మిథ్యాత్వం, 2 అవిరతి, 3 కషాయం, 4 ప్రమాదం, 5 యోగం.

1 మిథ్యాత్వం - శ్రీజినేశ్వర భగవానుడు చేసిన ఉపదేశానికి విరుద్ధంగ ఇతర తత్త్వాలకు చెందిన ధర్మాలపై శ్రద్ధ చూపడం, అంటే సత్యాన్ని అసత్యంగ అసత్యాన్ని సత్యంగ సంభావించడం 'మిథ్యాత్వ' దోషం.

2 అవిరతి - వ్రతాలు, నియమాలు లేదా పచ్చక్కాణ, సర్వవిరతి, దేశవిరతి ధర్మం మొదలైన ఆరాధనలు చేయకపోడం, పాపములనుంచి విముక్తుడు, దూరస్థుడు కాకపోవడం 'అవిరతి' దోషం,

3 కషాయం - కోపం, అహంకారం, మాయ, లోభం, మోహం అలాగే తొమ్మిది కషాయాలు మొదలైన దుర్గుణాలను 'కషాయ' దోషం అంటారు.

4 ప్రమాదం - మద్యం మొదలైన దుర్వ్యసనాలు, విషయములకు, కషాయములకు లొంగిపోవడం, నిద్రపోతూ ఉండడం, అశ్రద్ధ చేస్తూండడం, వినకూడని కథలు, విషయాలు వింటూ ఉండడం 'ప్రమాద' దోషం.

5 యోగం - మనసులో శుభంకాని, అశుభంకాని ఆలోచించడం, నోటితో శుభంకాని, అశుభంకాని పలకడం, దేహముతో శుభంకాని, అశుభంకాని ఆచరించడం ఇవన్నిటినీ 'యోగ' దోషం అంటారు.

ఈ అయిదింటిని 'ఆశ్రవ్' అని కూడా అంటారు. ఈ ఆశ్రవముల కారణంగ కర్మ జీవుణ్ణి బంధిస్తూ ఉంటుంది. మనకి ఈ బంధనములనుండి విముక్తులమవ్వాలనే కోరిక ఉంటే శక్తివంచన లేకుండా ఈ అయిదు కర్మబంధాలను తెంచుకోవాలి.

# 37 పంచవిధ దేహాలు

ఈ ప్రపంచంలోని ప్రతిజీవి శరీరం కలిగి ఉంటుంది. దేహరహితుడు ఒక్క సిద్ధభగవానుడే. శరీర దృష్టితో చూచినపుడు ఈ లోకంలోని సమస్తజీవులు అయిదు విధాలుగ ఉంటాయి.

1 ఔదారిక దేహాలు – ఔదారిక వర్గానికి చెందిన పుద్గలములచే నిర్మింపబడిన దేహాలను 'ఔదారికు'లంటారు. ఇటువంటి దేహం మనుష్యులకు, పశువులకు, పక్షులకు, వృక్షములకు మొదలగు వాటికి ఉంటుంది.

2 వైక్రియ దేహాలు – వైక్రియ వర్గానికి చెందిన పుద్గలములచే నిర్మింపబడిన దేహాలను 'వైక్రియు'లంటారు. దేవతలకు, నరకవాసులకు వారి జన్మలననుసరించి ఇటువంటి దేహం లభిస్తుంది. సిద్ధి పొందిన మనుష్యులకు, విశిష్ట పంచేంద్రియ తిర్యక్కులకు కూడా వైక్రియదేహం లభిస్తుంది.

3 ఆహారక దేహాలు – ఆహారక వర్గానికి చెందిన పుద్గలములచే నిర్మింపబడిన దేహాలు 'ఆహారకు'లనబడతారు. అటువంటి దేహం కేవలం 14 పూర్వధారి మునులకు మాత్రం లభిస్తుంది. తత్త్వముల విషయమై విచారణ జరుపుతున్న సమయంలో ఏదైన ఒక అంశం నిర్మాణమైతే అప్పుడు లేదా తీర్థంకరప్రభువు యొక్క సమవసరణ(ధర్మోపదేశ సభ) యొక్క ఋద్ధిని దర్శించడానికి ఇటువంటి దేహాన్ని ధరించి ఈ మునీశ్వరులు విహరించడానికి తీర్థంకర ప్రభువు దగ్గరకు మహావిదేహక్షేత్రంలో ఉంటున్న సీమంధర స్వామిలాగ పంపబడతారు.

4 తైజస దేహాలు – తేజ సంబంధమైన పుద్గలములచే నిర్మింపబడిన దేహాలను 'తైజసులు' అంటారు. ఇటువంటి దేహం అనాదికాలంనుంచి సమస్తజీవులకు లభిస్తోంది. ఇటువంటి దేహంచేతనే జీవులకు శరీరంలో ఉష్ణం తయారవుతోంది. జీవులు ఏ ఆహారాన్నయితే తీసుకుంటున్నారో దాన్ని పచనం చేస్తోంది.

5 కర్మణ దేహాలు – జీవునిపై అనాదికాలంనుంచీ బంధింపబడుతున్న కర్మలయొక్క సమూహం ఉంటుంది. దాన్నే 'కర్మణదేహం' అంటారు. ఈ విశ్వంలోని సమస్తజీవులకు ఈ దేహం ఉంటుంది.

ఎప్పుడైతే జీవునికి ఒక జన్మలో ఆయువు తీరుతుందో మరణించి మరొకజన్మ తీసుకుంటాడో అపుడు తనకూడా తైజస, కర్మణ దేహాలను తీసుకుని వెళతాడు.

# 38 పంచ మహాపురుషులు

1 శ్రీభద్రబాహు స్వామీజీ – శ్రీభద్రబాహు స్వామీజీ 14 పూర్వాలు(విఖ్యాత జైన శాస్త్రాలు) తెలిసినవారు. అందువలన ఆయన 'శ్రుతకేవలి' అని పిలువబడతాడు. ఆయన కల్పసూత్రమనే గొప్ప గ్రంథాన్ని రచించాడు. ఈ కల్పసూత్రాన్ని నేటికికూడా పర్యుషణపర్వ దినాలలో వ్యాఖ్యానములతో మునిజనులు పఠిస్తూంటారు.

భద్రబాహుస్వామి జైనమతానికి చాలా గొప్పసేవ చేశాడు. ఒకసారి అవ్యవహితంగ 12 సంవత్సరాలు క్షామం ఏర్పడింది. సాధువులకుకూడా భోజనం లభించడం కష్టమై పోయింది. ఆహారంలేక సాధువులు శాస్త్రాధ్యయనం మరిచిపోయారు. అపుడు భద్రబాహుస్వామి స్థూలభద్ర మొదలైన సాధువులకు శాస్త్రపాఠాలనిచ్చి శాస్త్రములను రక్షించారు. ఆ సమయంలో భద్రబాహుస్వామి ప్రతిరోజు ఏడు పాఠాలనిచ్చేవారు. స్థూలభద్ర ఈ ఏడు పాఠాలను కంఠస్థం చేస్తూండేవారు. ఈ విధంగ ఈ శాస్త్రజ్ఞానం మనకి ఈనాటివరకు నిలచి ఉండడానికి భద్రబాహుస్వామియొక్క గొప్ప బాధ్యత ఉంది. ఒకసారి జైనసంఘంలో రోజురోజుకీ పెరుగుతున్న మహమ్మారి ఉపద్రవం దూరం చేయడానికి ఆయన 'ఉపద్రవ హరం' స్తోత్రాన్ని రచించారు. భద్రబాహుస్వామిని నేటకీ ఆదరభావంతో స్మరిస్తున్నాం.

2 శ్రీహరిభద్రసూరీశ్వరజీ – పూజ్య ఆచార్య శ్రీహరిభద్రసూరీశ్వరజీ వారి సాంసారిక జీవనంలో హరిభద్రులనే బ్రాహ్మణులు. వారికి ఒక నియమం ఉంది. 'నాకు రాని విషయం, తెలియని విషయం నేర్పేవారికి మాత్రమే నేను శిష్యుడనవుతాను.' వారికి వారి జ్ఞానంపై అంత ఆత్మవిశ్వాసం.

ఒకసారి ఒక జైన సాధ్వి శాస్త్ర స్వాధ్యాయం చేసింది. అందులో 'చక్కీదుగ్గం' మొదలైన పదాల్లో 'చక్కీ' శబ్దం పదేపదే రావడం హరిభద్రకు వినబడింది. ఈ చక్కీ శబ్దంయొక్క అర్థం ఆయనకు తెలియలేదు. ఇందుకోసం అడగడానికి హరిభద్ర ఆ సాధ్వి దగ్గరకు వెళ్ళాడు. సాధ్వి ఆయనను తన గురువు జైనాచార్యుని దగ్గరకు పంపింది. గురువు అర్థచెప్పడానికి ముందు దీక్ష స్వీకరించాలనే షరతు విధించారు. జైనదర్మాన్ని కఠోరంగ విరోధించే జ్ఞానరసికుడైన హరిభద్ర జైనదీక్ష స్వీకరించారు. దీక్ష స్వీకారానంతరం ఆయనకు ఎంత జ్ఞానం కలిగిందంటే ఆయన సంస్కృత, ప్రాకృత భాషల్లో 1444 క్రొత్త గ్రంథాలను రచన చేశారు. ఈ గ్రంథాలలో నేటికీ లభ్యమవుతున్న బహుకొద్ది గ్రంథాలను చదువుతున్నప్పుడు పెద్దపెద్ద విద్వాంసులు నిర్ఘాంతపోతున్నారు.

3 శ్రీహేమచంద్రసూరీశ్వరజీ – పూజ్య ఆచార్యులు శ్రీహేమచంద్రసూరీశ్వరజీ మహరాజ్ చాలా చిన్నవయసులోనే జైన సాధు దీక్ష స్వీకరించారు. బాల్యంనుంచీ ఆయన కుశాగ్రబుద్ధిశాలి. దాని

కారణంగానే సిద్ధరాజ జయసింహుని రాజసభలో దిగంబరవాది శ్రీకుముదచంద్రునితో జరిగిన శాస్త్రార్థంలోను, శ్వేతాంబరవాది వాదిదేవసూరికి చాలా సులభంగ విజయం లభించింది. స్వయంగ కూడా ఒకసారి కుముదచంద్రునికి వాగ్బంధం చేశారు.

ఆయన తన జీవితకాలంలో సంస్కృ త,ప్రాకృత భాషలలో పలు శాస్త్ర గ్రంథాలను రచించారు. అన్నీకలిపి మూడున్నరకోట్ల శ్లోకాలను రచించి జైనశాసన శాస్త్ర భాండారాన్ని విస్తృత పరిచారు. ఆయన ఎంత వేగంగ రచన సాగించేవారంటే ఆయన దగ్గర ప్రతిరోజూ అనేకమంది లేఖకులు ఉండేవారట. ఆయన కొత్తకొత్త శ్లోకాలు చెబుతూ ఉంటే వాళ్ళు వ్రాస్తూ ఉండేవారట. ఈ విధంగ వారు తమ స్వల్పకాల జీవితంలో గావించిన శాస్త్రరచన విశ్వంలోని విద్వాంసులను ఆశ్చర్యంలో ముంచేసింది.

సిద్ధరాజు జయసింహుడు ఆయన తరువాత రాజా కుమారపాలుడు ఇద్దరూ ఆయన విశిష్ట భక్తులు. కుమారపాలరాజు శ్రీహేమచంద్రసూరి ఉపదేశములతో గుజరాతు భారతదేశంలోనే అగ్రస్థానంలో ఉండేది. దీనికి కారకులు శ్రీహేమచంద్రసూరీశ్వరజీ, రాజా కుమారపాలుడు.

4 శ్రీహీరసూరీశ్వరజీ – పూజ్య ఆచార్యులు శ్రీహీరసూరీశ్వరజీ మహరాజ్ జైనలోకంలో 'జగద్గురువులు'గ విఖ్యాతులు. ఆయన వారి జీవితంలో ఉత్కృష్టమైన సంయమపాలన చేయడమే కాక జైన శాసనాన్ని చాలా ఉన్నతస్థితికి తెచ్చారు. ఇద్దరిద్దరు సహస్ర శిష్యులతో కూడినవారైనప్పటికీ నిరంతరం నిరభిమానులైన వీరిని ఢిల్లీ అక్బరు పాదుషా ఆరు ఆరు నెలలు అహింస ప్రచారానికి వారి సామ్రాజ్యంలో పర్యటింప చేశారు.

అక్బరు హీరసూరీశ్వరజీ భక్తులయ్యారు. అక్బరుకు మాంసాహారమంటే చాలా ఇష్టం. ఆయన ప్రతిరోజు అనేక పక్షుల, జంతువుల మాంసం తింటూ ఉండేవాడు. అందుకోసం ప్రతిరోజూ లెక్కలేనన్ని జీవులు వధింపబడుతూ ఉండేవి. ఆయనకు వేట అన్నా చాలా ఇష్టం. హీరసూరీశ్వరజీ అక్బరుచేసే ఈ సమస్త పాపాలను అరికట్టారు. అంతేకాదు,అక్బరు ఆయన రాజ్యంలో ఆరునెలలవరకు (పర్యుషణ పర్వానికి ముందురోజు – పర్యుషణపర్వం 8 రోజులు – పర్యుషణపర్వం తరువాతి రోజు – రంజాన్ నెల రోజులు – అన్ని శుక్రవారాలు – ఇంకా ఇతరమైన పలు రోజులు) ఏ విధమైన హింస చేయరాదని ప్రకటించాడు.

పర్యుషణపర్వం ముందురోజు అందరు మహాత్ములు, సాధువులు చేరిన శ్రోతలకు వారి వ్యాఖ్యానంలో 'అహింసావ్రతం' కర్తవ్యంగ ప్రకటించే సమయంలో పూజ్య ఆచార్యులు శ్రీహరీశ్వరజీ మహరాజ్ అక్బరు జీవితానికి సంబంధించిన ఈ కథను చెబుతూండేవారు.

5 ఉపాధ్యాయ శ్రీయశోవిజయజీ – ఉపాధ్యాయ శ్రీయశోవిజయజీ మహరాజ్ నేటికి

సుమారు 300 సంవత్సరాలకు పూర్వం జైన శాస్త్రాలలో ఒక సమర్థుడైన మహాపురుషుడు. ఆయన జైన శాసనానికి, జైన శాస్త్రానికి రాశీభూతమైన నూతన భాండారాన్ని కానుకగ ఇచ్చారు. ఆయన సంస్కృత, ప్రాకృత భాషలలో అలాగే వ్యాకరణం, న్యాయం మొదలైన శాస్త్రాలలోను పాండిత్యం చూసి కాశీలోని పెద్దపెద్ద పండితులు అచ్చెరువందారు. ఒకనాటి కాశీ పండితులను శాస్త్రార్థంలో ఓడించడానికి పరదేశంనుంచి ఒక పండితుడు వచ్చాడు. అపుడు యశోవిజయులు వానిని సమర్థంగ ఎదిరించి కాశీ ప్రతిష్ఠను కాపాడారు. దీనికి సంతోషించిన బ్రాహ్మణ పండితులు ఆయనను 'న్యాయ విశారద' 'న్యాయాచార్య' అనే బిరుదులనిచ్చి గౌరవించారు.

శాస్త్ర సిద్ధాంతాన్ని పరిష్కరించేవారి గ్రంథాలను పఠించే సందర్భంలో నేటికీ కాశీ పండితులు శిరఃకంపనం చేస్తూంటారు. వారు రచించిన గ్రంథాలు చదవడానికికూడా సామాన్యబుద్ధి చాలదు. కుశాగ్రబుద్ధి కావాలి. ఏదో అపరిచితుని వవమయ్యేది కాదు. రెండో ప్రక్క శాస్త్ర సిద్ధాంతాన్ని చాలా సరళంగ చెబుతూనే, ప్రభుభక్తి ప్రకటించడానికి ఆయన 'జగజీవన జగవాలహో' మొదలైన అనేక గుజరాతీ స్తోత్రాలు రచించారు. వీని అర్థం 70 సంవత్సరాల ముసలికూడా సులభంగ అర్థంచేసుకో గలుగుతారు. అటువంటి మహాపండితులు యశోవిజయులు చరిత్ర విషయంలోకూడా అంతే ప్రేమ కలవారు. వారి కాలంలో ఆచార హీనులైన యతులకు విరుద్ధంగ ధర్మయుద్ధం చేస్తూండేవారు.

**జినశాసనానికి అమూల్యములైన ఈ అయిదుగురు మహాపురుషులకు**
**కోటి కోటి వందనాలు.**

# 39 పంచ ప్రఖ్యాత తీర్థక్షేత్రాలు

1 **శ్రీశత్రుంజయ తీర్థక్షేత్రం** – ఈ తీర్థక్షేత్రం ప్రస్తుతం సౌరాష్ట్రలో పాలీతాణా అనే గ్రామంలో ఉంది. నాలుగు కిలోమీటర్ల దూరంలో మనోహరమైన, రమణీయమైన పర్వతముమీద దేవవిమానంలా అనేక దేదీప్యమానములైన జినమందిరములున్నాయి. వీనిలో ప్రముఖమైనది ఆదీశ్వర ప్రభువుయొక్క(శిఖరం) మందిరం. ఇక్కడ ప్రథమ తీర్థంకరులు ఆదీశ్వర(ఋషభదేవ) భగవాన్ మూలనాయక్ రూపంలో విరాజమానులై ఉన్నారు. ఈ శ్వేత సంగమరమర ప్రశాంతమైన, పరమ పవిత్రమైన ప్రతిమ లక్షల,కోట్ల భవ్యజీవులకు శ్రద్ధాజ్యోతి సమానము.

పాలీతాణా గ్రామానికి నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఈ తీర్థక్షేత్రం శాశ్వతమైనది. ఈ తీర్థక్షేత్ర కంకరరాళ్ళలో అనంత అనేక జీవాత్మలు సిద్ధపదాన్ని పొందాయి. ప్రథమ తీర్థంకరులు ఆదీశ్వర ప్రభువు ముక్తిపొందడానికి పూర్వం 99 సార్లు ఇక్కడికి వచ్చియున్నారు. ఈ ఘటనకు స్మృతిగ నేటికీ వేలాది తీర్థయాత్రికులు ఈ తీర్థక్షేత్రానికి 99 సార్లు యాత్ర చేస్తూంటారు. నేమినాధ భగవాన్‌ను విడచి మిగిలిన ఇరవైముగ్గురు తీర్థంకర ప్రభువులు అందరూ ఈ తీర్థక్షేత్రాన్ని తమ పాదస్పర్శతో పావనం చేశారు.

ఫాల్గుణ శుక్ల త్రయోదశి రోజున శాంబ, ప్రద్యుమ్న అనేకమంది మునులతో ఈ పర్వతంమీదనే మోక్షం పొందారు. అందువలన ఈ రోజు ఆరుక్రోసుల యాత్ర చేయడానికి వేలాది శ్రద్ధాళువులైన భక్తజనులు శత్రుంజయ పర్వతాన్ని ఎక్కుతారు. పంచపాండవులకు మోక్షప్రాప్తి ఇక్కడే కలిగింది.

కార్తీకమాస పౌర్ణమి, ఫాల్గుణ శుక్ల త్రయోదశి, చైత్ర పౌర్ణమి రోజులలో వేలాది శ్రద్ధాళువులైన యాత్రికులు ఈ పర్వతరాజ యాత్ర చేయడానికి వస్తూంటారు. అక్షయ తృతీయ రోజున జరిగే వర్షీతప సమాప్తి (పారణ) సమయంలో కూడా వేలాది యాత్రికులు ఇక్కడికి ప్రతిసంవత్సరం వస్తూంటారు.

ఆదీశ్వర ప్రభువు యొక్క ప్రఖ్యాత మందిరానికి తోడు ఇతర ఇంకా తొమ్మిది మందిరాలు ఇక్కడ ఉన్నాయి. ఏ జీవుడు కోరికతో, ఏ కోరిక లేకపోయినా ఈ తీర్థక్షేత్ర యాత్ర, దర్శనం చేస్తూంటారో వారు అవశ్యం భవ్యజీవులు(మోక్షార్హులు) అవుతారు.

వందలాది దేవమందిరాలతో సుశోభితమైన ఈ దివ్య దేవనగరిలో జినభక్తిలో తాదాత్మ్యం చెందిన శ్రద్ధాళువులైన భక్తులు ఆకలి, దాహము మాట మరచిపోతారు. సంసారంలోని సమస్త చింతలనుంచి విముక్తులవుతారు. ఆత్మలో అఖండానందం తరంగాల్లా ఉబికి వస్తుంది.

2 **శ్రీగిరనార్ తీర్థక్షేత్రం** – ఈ తీర్థక్షేత్రం సౌరాష్ట్రలో జునాగడ్ అనే గ్రామంలో ఉంది. జునాగడ్ దగ్గర సముద్రతటానికి సుమారు 145 మీటర్ల ఎత్తులో గిరనార్ పర్వతం ఉంది. అక్కడ తీర్థాధిరాజు 22వ తీర్థంకరులు భగవాన్ శ్రీనేమినాధుల కృష్ణవర్ణాత్మకమైన మనోహరమూర్తి ఉంది. ఈ తీర్థక్షేత్ర దర్శనానికి అనేకమంది చక్రవర్తులు,రాజులు,సంపన్నులు,మహాజన సంఘములు వస్తూంటారు.

'సిద్ధాణం బుద్ధాణం' సూత్రంలో 'ఉజ్జింత సెలసిహరే' పాఠంద్వారా ఈ తీర్థక్షేత్రంయొక్క మహిమ గాయీ వెళ్ళింది. భగవాన్ నేమినాధుడు ఈ నేలమీదే దీక్ష స్వీకరించాడు, కేవలజ్ఞానం పొందాడు. చివరకు మోక్షాన్ని ఇక్కడే స్వీకరించాడు.

అనేకమంది తీర్థంకరులు, చక్రవర్తులు, మునిశ్రేష్ఠులు మోక్షంపొందిన ఈ తీర్థక్షేత్రంలో భవిష్యత్తులో 24 తీర్థంకరులుకూడా మోక్షప్రాప్తి పొందుతారు. భగవాన్ నేమినాధులవలన ఎవరి వివాహం జరిగిందో వారి సమ్మతితోనే వారికి నేమినాధులు ఇక్కడ దీక్షనిచ్చారు. వారుకూడా ఇక్కడే మోక్షం పొందారు.

ఈ పర్వతం ఎక్కడం చాలా కష్టం. సుమారు మూడు కిలోమీటర్ల మార్గమున్న ఈ పర్వతాన్ని ఎక్కడంలో 4200 మెట్లున్నాయి. ఈ అత్యంత రమణీయ, భవ్య, మనోహర తీర్థక్షేత్ర పావన దర్శనంలో తాదాత్మ్యం చెందిన జీవులు ఇక్కడ గంటలకొలది జినభక్తితో ఆనందాన్ని చూరగొంటారు.

3 **శ్రీసమేతశిఖరతీర్థక్షేత్రం** – మధువనందగ్గర సముద్రతటానికి 4471 అడుగుల ఎత్తులో సమేత శిఖర పర్వతం ఉంది. ఇక్కడ తీర్థాధిరాజు శామలియా పార్శ్వనాథ భగవానునియొక్క శ్యామవర్ణ మూర్తి ఉంది.

గడచిన 24 తీర్థంకరులలో ఎందరో ఇక్కడ మోక్షం పొందారు. వర్తమాన 24 తీర్థకరులు, వేలాది మునిశ్రేష్ఠులతో సహా ఇక్కడ మోక్షం పొందారు.

ఈ పర్వతానికి 6 మైళ్ళ పొడవైన చాలా కష్టంగ ఎక్కవలసిన మార్గముంది. పరిక్రమమార్గం 6 మైళ్ళు ఉంది. తిరిగి 6 మైళ్ళు ఏటవాలుగ దిగాలి. ఈ విధంగ మొత్తం 18 మైళ్ళ పొడవైన మార్గముంది. ఈ పర్వతంమీద వేరువేరు తీర్థంకరులు మొదలైనవారి 31 మందిరాలున్నాయి. ఇక్కడ ప్రతి సంవత్సరం మార్గశిరమాస కృష్ణపక్ష దశమి, ఫాల్గుణ పౌర్ణమి రోజున ఉత్సవం మంచి శోభాయమానంగ జరుగుతుంది. ఈ కొండమట్టి కణంకణం మాహాత్మ్యమున్నది. పవిత్రమైనది. పూజనీయమైనది. ఈ తీర్థక్షేత్రంయొక్క స్పర్శమాత్రంచేతనే ఆత్మ ప్రఫుల్లమై, ప్రసన్నమై శాంతిస్తుంది.

4 **శ్రీపావాపురీతీర్థక్షేత్రం** – ప్రాచీనకాల మగధదేశానికి చెందిన ఆ పాపాపురియే నేడు పావాపురి. భగవాన్ శ్రీమహావీర్ ఇక్కడ ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి రోజున వారి 48 గంటల సుదీర్ఘ అంతిమ ధర్మోపదేశం ఇచ్చారు. ఆశ్వయుజమాసం అమావాస్య అర్ధరాత్రి ఆకాశంలో స్వాతి నక్షత్రం

రాగానే ప్రభువుయొక్క నిర్వాణం జరిగింది. వారు మోక్షం పొందారు. ఈ విధంగ ఈ నేల మహావీరప్రభువుల నిర్వాణ స్థలమైన కారణంగ అత్యంత పవిత్ర స్థలం అయింది.

మహావీర ప్రభువువంటి మహనీయుని భావదీపం ఆరిపోయిన సంఘటనకు స్మృతిగ ప్రజలు వేలాది దీపాలు వెలిగించారు. ఈనాటినుంచే దీపావళి పర్వదినం ప్రారంభం అయింది. నేటికీ ఆశ్వయుజ అమావస్య నాటిరాత్రి గ్రామాలన్నీ వేలాది దీపాల కాంతులతో వెలిగిపోతాయి.

ఇక్కడ మంగళసరోవరం మధ్యలో మహావీర భగవానుని చరణ పాదుకలతో కూడిన, దేవలోకాన్నికూడా నిస్తేజపరిచే దివ్య జలమందిరం ఉంది. వేలాది కమలములతో నిండిన శోభాయమాన సరోవరం మధ్యలో ఉన్న ఈ మందిరం చాలా రమణీయమైనది. మనోహరమైనది. జలమందిరం కాకుండా గ్రామంలోని మందిరాలు, ప్రాచీన సమవసరణ, నవీన సమవసరణ కూడా చాలా సరసంగ, సుందరంగ ఆకర్షణీయమై ఉంటాయి.

5 **శ్రీశంఖేశ్వరతీర్థక్షేత్రం** – ప్రాచీన శంఖుపుర గ్రామంలో ఉన్న శ్రీశంఖేశ్వర పార్శ్వనాధుని ఈ భవ్య తీర్థక్షేత్రం గుజరాత్‌కే సాటిలేని శోభనిచ్చింది. ఇక్కడి మందిరంలో ప్రతిష్టితులైన శ్వేతవర్ణ, పద్మాసనాసీన శంఖేశ్వర పార్శ్వనాధుల మూర్తి భవ్యము, మనోహరము, చమత్కారమునై ఉంది. ఈ మూర్తియొక్క చమత్కారానికి, వందలాది విశేష కథలు కారణంగ నేటికీ సమస్త భారతంలో 'శంఖపురి' స్థానంలో 'శంఖేశ్వర' పేరు ప్రసిద్ధమయింది. గడచిన 1924లో ఆషాఢీ శ్రావక్ దామోదర భగవానుని ఉపదేశంతో శంఖేశ్వర పార్శ్వనాధుని ఈ ప్రతిమ ప్రతిష్ఠింపబడింది. ఈక్కడ చైత్ర పౌర్ణమి, కార్తీక పౌర్ణమి, మార్గశిర కృష్ణ దశమి రోజులలో వేలాదిమంది భక్తులు ఉత్సవం జరుపుతారు.

పరమాత్మయొక్క అత్యంత సుందర, ప్రభావయుక్తమైన మూర్తితో సుశోభితమైన 52 జినాలయాలు, ప్రహరీ గోడలపై చెక్కబడిన నగిషీపనితో కూడిన దేవమందిరం ఎంతో కనులపండువుగ ఉంటుంది. హారీజ్‌నుండి 8 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఈ తీర్థక్షేత్రంలోని పార్శ్వనాధుడు అత్యంత ప్రభావకారి, మహిమోపేతుడు, మనోవాంఛితములను ఈడేర్చేవాడు.

# 40 షడ్విధ జీవులు

ఈ విశ్వంలో జీవులు ఆరు విధాలుగ ఉంటాయి. వీనిని జైన శాస్త్రాలు ఆరు 'జీవనికాయముల'రూపంలో గుర్తింపజేశాయి. వీనినిబట్టి జీవులకు ఆరు భేదాలున్నాయి.

అవి –

1 పృధ్వీకాయం, 2 అపూకాయం, 3 తేజఃకాయం, 4 వాయుకాయం,
5 వనస్పతికాయం, 6 త్రసకాయం.

1 పృధ్వీకాయం – అన్ని విధాలైన పృధ్వీకాయరూపంలో ఉన్న జీవాన్ని పృధ్వీకాయం అంటారు. మట్టి, ఉప్పు, మణి, రత్నం, పగడం, ఏడువిధాలైన ధాతువులు (బంగారం,వెండి,వజ్రం మొదలైనవి), అభ్రకం, కాటుక మొదలైనవి.

2 అపూకాయం – ప్రతి జలదేహంకల జీవులు అపూకాయులు. నుయ్యి, చెఱువు, వర్షం, నది నీరు, మంచు, పొగమంచు మొదలైనవి.

3 తేజఃకాయం – ప్రత్యేక విధమైన అగ్నికాయంతో కూడిన జీవాన్ని తేజఃకాయం అంటారు. నిప్పురవ్వ, మంట, స్టౌ, గ్యాస్‌మంట, విద్యుచ్ఛక్తికి కాంతినిచ్చే ఉపకరణం (బల్బు, ట్యూబు) మొదలైనవి.

4 వాయుకాయం – ప్రతీ వాయుకాయమున్న జీవం వాయుకాయం అనబడుతుంది. సుడిగాలి, ఈదురుగాలి, పంకా మొదలగు వాటితో వచ్చే గాలి మొదలయినవి.

5 వనస్పతికాయం – ప్రతీ వనస్పతి రూపమైన కాయం కల జీవం వనస్పతి కాయం. చెక్క, ఆకు, పూవు, పండు, నాచు, ఫంగస్, కందమూలాలు, ప్రతి ఆకుపచ్చని కూరలు మొదలైనవి.

6 త్రసకాయం – చలించడంలో సమర్థమైన జీవం త్రసకాయం అంటారు. క్రిములు, కీటకాలు, ఈగలు, చీమలు, నులిపురుగు, నల్లి, తేలు, తుమ్మెద, దేవ, మనుష్య, పక్షి, నారకులు మొదలైనవి.

ఈ అన్నిరకాల జీవులయందు అధిక దయకలిగి ఉండాలి. వానిని రక్షిస్తూ ఉండాలి. వానిని చంపకూడదు. ఎవరైతే అధిక జీవ దయను చూపుతారో వారు అత్యంత సుఖవంతులవుతారు.

# 41 ఆరు ఆవశ్యకములు

శ్రావక్ అవశ్యంగ చేయవలసిన యోగ్యమైన, ఆరాధనకు అవసరమైన ఏ కార్యములున్నవో వానిని 'ఆవశ్యకములు' అంటారు. అవి ఆరు విధాలు.

అవి –

1 సామాయిక్, 2 చౌవిసత్థో, 3 వందనం, 4 ప్రతిక్రమణ, 5 కార్యోత్సర్గం
6 సచ్చక్ఖాణ.

1 సామాయిక్ – జినేశ్వర దేవుని ద్వారా ప్రకటింపబడిన తక్కువలో తక్కువ 48 నిముషాలకు సరిపడిన ధర్మక్రియ. దీనివలన ఆత్మకు సుఖ,దుఃఖాలు, రాగ,ద్వేషాలు, ప్రసంగాలలో అన్నిటిలో సమభావం ప్రాప్తిస్తుంది.

పరమ శ్రావక్ 'పుణియా' ఇటువంటి సామాయిక్ ఆచరించేవాడు. స్వయంగ భగవానుడు మహావీరుడు వానిని ప్రశంసిస్తూ అన్నాడు. "సోదరా! సామాయిక్ చేయాలంటే పుణియాలా చెయ్యి. మనందరం ప్రతిదినం అలాంటి సామాయిక్ చేయడానికి ప్రయత్నిద్దాం."

2 చౌవిసత్థో – చౌవిసత్థో లేదా లోగస్స సూత్రం ఇందులో 24 తీర్థంకర భగవానుల స్మరణచేసి వారికి వందనం చేయబడుతుంది.

3 వందనం – పూజ్య గురుభగవానునికి వినయంగ చేయబడే వందనం

4 ప్రతిక్రమణ – ఆత్మలో బంధింపబడిన పాపములకు పశ్చాత్తాప పడుతూ కడిగి వేసుకునే విశిష్ట ధర్మక్రియను ప్రతిక్రమణ అంటారు. ఈ క్రియ ప్రతిదినం ఉదయం సాయంత్రం ఈ విధంగ రెండుసార్లు చెయ్యాలి.

5 కార్యోత్సర్గం – మనోవాక్కాయములచే జరుగు ఆసక్తి,మమత్వములను తొలగించుకుని ఏకాగ్రతతో 'లోగస్స' కాని 'నవకార' కాని జపించడమే కార్యోత్సర్గం అనబడుతుంది. ఈ క్రియ మిక్కిలి స్థిరత్వంతో ఏమాత్రం చంచలత్వం లేకుండా చేయాలి.

6 పచ్చక్ఖాణ – నిరాసక్తి లేదా పాపాన్ని త్యజించడంకోసం చేయబడే సంకల్పం(ప్రతిజ్ఞ) పచ్చక్ఖాణ అంటారు. రాత్రిభోజనం మానేయడం, కందమూలాలు భక్షించక పోవడం, నౌకారశీ పచ్చక్ఖాణ చేయడం మొదలైనవి.

# 42 జైన ధర్మ ఆరు మూలభూత సిద్ధాంతములు

జైన ధర్మానికి చెందిన మూలభూత సిద్ధాంతాలు ఆరు చెప్పబడుతున్నాయి.

1 ఆత్మయొక్క అస్తిత్వం – ఆత్మ అనే ఒక పదార్థం ఉంది. ఆత్మ జీవితంలో సుఖ,దుఃఖాల అనుభవాన్ని కలిగిస్తోంది. ఆత్మ జ్ఞానయుక్తమైనది. జ్ఞానం ఆత్మయొక్క ప్రధానగుణం.

2 ఆత్మ దేహంకంటె వేరైనది. శాశ్వతమైనది. – మన శరీరం ఏదైతే ఉందో అది ఆత్మకాదు. ఆత్మ శరీరంలో ఉన్నప్పటికీ, శరీరంకంటె వేరైనది. ఈ ఆత్మకు ఎన్నటికీ నాశం లేదు. అది నిత్యం, అది శాశ్వతం. నశించేది దేహం మాత్రమే. ఆత్మ కాదు. ఒక్కొక్క జన్మలో శరీరానికి, ఆత్మకు ఉన్న సంబంధం పూర్తవడం లేదా సమాప్తి కావడం మృత్యువు అనబడుతోంది.

3 ఆత్మ కర్మకు కర్త – ఆత్మే పుణ్యము, పాపము వంటి కర్మ బంధాలను తీసుకు వస్తుంది. శరీరం కర్మచే బంధింపబడదు. శరీరం సాధనం మాత్రమే. వాస్తవానికి శరీరం ఇంద్రియాల సాయంతో కర్మనాచరించే బంధాన్ని కలిగించే కర్మకు కర్త ఆత్మయే.

4 ఆత్మ కర్మ ఫలానికి భోక్త – పుణ్యంవలన కలిగే సుఖం, పాపంవలన కలిగే దుఃఖం అ రెండింటినీ అనుభవించేది ఆత్మ మాత్రమే. శరీరం కాదు.

5 ఆత్మకు సమస్త కర్మలనుండి మోక్షం లభిస్తుంది – ఆత్మయే పుణ్యము, పాపము మొదలైన కర్మ బంధాలను తెచ్చుకుంటోంది. ఆ పుణ్య,పాపములవలన అభించే సుఖ,దుఃఖాల ఫలితాన్ని తానే అనుభవిస్తోంది.

అయితే ఈ చక్రం ఇలా తిరుగుతూ ఉండాల్సిందేనా? అక్కర్లేదు. ఈ చక్రంనుంచి శాశ్వతంగ విముక్తి పొందడం సాధ్యం. పొందుతారుకూడా. దీనినే మోక్షం అంటారు.

6 మోక్షప్రాప్తికి ఉపాయం ఉంది – మోక్షం అంటే కర్మబంధం నుంచి శాశ్వత విముక్తికి మార్గం ఉందా?లేదా?

ఉంది. చక్కని ఉపాయం ఉంది. సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రం పాటించాలి. అహింస, సంయమనం, తపము యొక్క ఆరాధన, దేశవిరతి లేదా సర్వవిరతి ధర్మాన్ని చక్కగ పాటించడం ఇవన్నీ మోక్షప్రాప్తికి ఉపాయాలు.

# 43 ఆరు 'రి'కారముల అర్థం

పూజ్య ఆచార్యుల, ముని భగవానుల సాన్నిధ్యంలో సాధు,సాధ్వి,శ్రావక్,శ్రావిక ఈ నాలుగు విధాలైన సమూహం పాదయాత్రచేస్తూ శత్రుంజయ, శంఖేశ్వర, గిరనార్ మొదలైన తీర్థక్షేత్రాల యాత్రకు వెళ్ళే సమయం 'సంఘ' అని చెప్పబడుతుంది. ఈ సంఘంలో సమ్మిళితులైన వారికి ఆరు 'రి'కారములు(ఆరు విధాలైన నియమములు) పాటించవలసిన ఆవశ్యకత ఉంటుంది.

ఆరుసార్లు ఏ శబ్దాలకు చివర 'రి'వస్తుందో వానిని ఆరు 'రి'కారములు అన్నారు.

1 ఏకాశన కారీ – ప్రతిరోజు ఏకభుక్తం పచ్చక్ఖాణ చేయాలి.

2 భూమి సంధారీ – మార్గమధ్యంలో పడుక్కోవడం, పక్క పరచడం చేయకూడదు.

3 సమకిత ధారీ – సమ్యక్త్వధారణం చేయడం, రోజుకి రెండుసార్లు ప్రతిక్రమణ చేయడం.

4 పాదచారీ – కాలి నడకనే వెళ్ళాలి. ఏ బండిమీద ప్రయాణం చేయకూడదు.

5 బ్రహ్మచారీ – బ్రహ్మచర్యాన్ని పాటించాలి. అనుచిత ప్రవర్తన పనికిరాదు.

6 సచిత్త పరిహారీ – జీవయుక్త ( వేనినుండి జీవులు ఉత్పన్నములవుతాయో) వస్తువులను భుజించరాదు.

పూజ్య గురుదేవుల సాన్నిధ్యంలో పాదయాత్ర చేస్తున్న విషయమే ఒక అసమాన లాభదాయక విషయం. దీనివల్ల ఈ లాభాలు కలుగుతాయి –

1 గురువుయొక్క జ్ఞానవాణి వినడంవలన మన జ్ఞానం వృద్ధిపొందుతుంది.

2 సంఘసభ్యులందరితో నిర్మల స్నేహభావన కలుగుతుంది.

3 జీవులపట్ల కరుణాభావాన్ని చూపూ సౌభాగ్యం కలుగుతుంది.

4 ఈ సమయంలోనే సరిగ్గా సంసారంతో మన సంబంధం తెగిపోతూ, మన మనస్సు ధర్మారాధనలో సరసమైన రీతిలో తల్లీనమవుతుంది.

5 మనోభావనలో, ఉత్సాహంలో అభివృద్ధి కనబడుతుంది.

6 ప్రతి ఒక్క జైనుడు తాను ముని కావాలని కోరుకుంటాడు. ఈ యాత్ర నెపంతో వారికి ఈ అభ్యాపమవుతుంది.

7 పాదయాత్రతో దేహానికి శ్రమ కలుగుతుంది. తద్వారా జినేశ్వరప్రభువుయొక్క దర్శనం, పూజనంయొక్క భాగ్యం లభిస్తుంది. దీని విలువ చాలా అమూల్యమైనది.

ఈ విధంగ 'పదయాత్ర – సంఘం' ద్వారా అపరిమితమైన లాభం కలుగుతుంది.

# 44 ఆరు లేశ్యాలు

లేశ్య అంటే ఆత్మిక పరిణామం. లేశ్య విశిష్టరీతి కర్మ పుద్గలముల సహాయముచే ఉత్పన్నమవుతుంది.

శుభలేశ్య సుఖాభివృద్ధి కలిగిస్తుంది. అశుభ లేశ్య దుఃఖాభివృద్ధి కలిగిస్తుంది.

లేశ్యయొక్క ఆరు భేదాల్ని తెలుసుకోడానికి ఒక దృష్టాంతాన్ని విచారిద్దాం –

ఒకసారి ఆరుగురు మనుష్యులు వారి త్రోవమరిచి అడవిలో దారితప్పి తిరుగుతున్నారు. అలసిపోయారు. ఆ సమయంలో వారికి ఒక నేరేడుచెట్టు కనబడింది. వాళ్ళందరూ మంచి ఆకలితో ఉన్నారు. అందుచేత వాళ్ళు ఒక్కొక్కళ్ళు అన్నారు –

1 కృష్ణ లేశ్య – మొదటివాడన్నాడు – 'చెట్టును సమూలంగ పెకలించి పళ్ళన్నీ తినేద్దాం' అన్నాడు. వీడు కృష్ణ లేశ్య వాడు. ఈ లేశ్య మనుష్యులు క్రూరులు, నిర్దయులు అయిన స్వభావంతో కర్కశులుగ ఉంటారు.

2 నీల లేశ్య – రెండవవాడు అన్నాడు – 'చెట్టు సమూలంగ పెకలించడమెందుకు? చెట్టు పెద్దపెద్ద కొమ్మలు విరిచేద్దాం. పళ్ళన్నీ తినేద్దాం' అన్నాడు. వీడు నీల లేశ్య వాడు. ఈ లేశ్య మనుష్యులు అహంకార, దర్ప ప్రదర్శకులు. లంచం తినడంలో చాలా నేర్పరులు.

3 కపోత లేశ్య – మూడవవాడు అన్నాడు – 'చెట్టు పెద్దపెద్ద కొమ్మలు కూడా విరిచేయడం ఎందుకు? నేరేడు చెట్టు చిన్నచిన్న కొమ్మలు విరుచుకుని పళ్ళన్నీ తిందాం' అన్నాడు. వీడు కపోత లేశ్య వాడు. ఈ లేశ్యవాడు ఇతరులను నిందించడం, తనను ప్రశంసించుకోవడం చేస్తూంటాడు.

4 తేజో లేశ్య – నాల్గవవాడు అన్నాడు – 'నేరేడు చెట్టు చిగుళ్ళుమాత్రం తెంచి వాటి పళ్ళు తిందాం' అన్నాడు. వీడు తేజో లేశ్య వాడు. ఈ లేశ్యవాడు దయాళువు, సరసుడు, దానం చేయాలనే ఆసక్తి కలవాడు అవుతాడు.

5 పద్మ లేశ్య – అయిదవవాడు అన్నాడు – నేరేడు చెట్టు చిగుళ్ళు తెంపి పాడుచేయడం ఎందుకు? పళ్ళుమాత్రం కోసుకుని తిందాం' అన్నాడు. వీడు పద్మ లేశ్య వాడు. ఈ లేశ్యవాడు ధైర్యవంతుడు, ప్రభు పూజాసక్తుడు, వ్రతాచరణమందు ఆనందం పొందేవాడు, ఇతరుల అభివృద్ధి కోరేవాడు అవుతాడు.

6 శుక్ల లేశ్య – ఆరవవాడు అన్నాడు – 'నేరేడు పళ్ళు కోయడంమాత్రం ఎందుకు? కింద రాలిన పళ్ళు ఏరుకు తిందాం' అన్నాడు. వీడు శుక్ల లేశ్య వాడు. ఈ లేశ్యవాడు తీవ్రమైన ధర్మబుద్ధి కలవాడవుతాడు.

చివరి మూడు లేశ్యలు శుభవంతములు.

# 45 ఆరు సంఘయణ విధాలు

సంఘయణమంటే శరీరంలోని ఎముకల విశిష్టరీతి నిర్మాణం. ఈ నిర్మాణం ఆరు విధాలుగ ఉంటుంది.

1 వజ్ర ఋషభ నారాచ సంఘయణ – వీరి ఎముకల కూర్పులో మర్కటబంధం అంటే ఒకే రీతిగ ఎముకల పరస్పర సంబంధం ఉంటుంది. ఒకదానితో ఒకటి ముడిపడి పక్కపక్కనే కలిసిపోయి వానిపైన ఎముకలకు ఒక పట్టీ పట్టి ఉంటుంది. మధ్యలో పైనుంచి కిందికి ఈ వైపునుంచి ఆ వైపుకి ఒక శీల ఉంటుంది. ఇలాంటి సంఘయణమును 'వజ్ర ఋషభ నారాచ సంఘయణము అంటారు.

2 ఋషభ నారాచ సంఘయణ – పైన తెలిపిన రీతిగ మర్కటబంధం అంటే ఒకదానితో ఒకటి ముడిపడి పక్కపక్కనే కలిసిపోయి వానిపైన ఎముకలకు ఒక పట్టీ పట్టి ఉంటుంది. అయితే ఎముకలకు పైరీతిగ శీల ఉండదు. దీనిని ఋషభ నారాచ సంఘయణమంటారు.

3 నారాచ సంఘయణ – దీనిలో కేవలం మర్కటబంధం ఉంటుంది. అంతేకాని ఎముకలపై పట్టీకాని, శీలకాని ఉండవు. దీనిని నారాచ సంఘయణమంటారు.

4 అర్ధ నారాచ సంఘయణ – ఇందులో కేవలం ఒక ప్రక్క అర్ధ మర్కటబంధం రెండవ ప్రక్క కీలాబంధం ఉంటుంది. దీనిని అర్ధ నారాచ సంఘయణమంటారు.

5 కీలక సంఘయణ – దీనిలో మర్కటబంధం పూర్తిగ ఉండదు. రెండు ఎముకలు కేవలం కీలతో జోడింపబడతాయి. దీనిని కీలక లేదా కీలికా సంఘయణమంటారు.

6 అంతిమ సంఘయణ – దీనిలో ఎముకలు వంకరగ ఉండి ఒకదానినొకటి స్పృశించుకుంటూ ఉంటాయి. దీనిని అంతిమ సంఘయణమంటారు. దీనికి మరొక పేరు 'సేవార్త'. ఎందుచేతనంటే ఈ సంఘయణ మనుష్యుడు అనవరతం నూనెను మసాజు మొదలగు సేవలు అపేక్షిస్తూ ఉంటాడు.

ఈ ఆరు సంఘయణములలో మొదటి సంఘయణ సర్వ శ్రేష్ఠమైనది. ఈ జన్మలోనే మోక్షం పొందే జీవులు, తీర్థంకర దేవులందరికీ ఈ మొదటి సంఘయణము ఉంటుంది. మనందరికి ఆఖరిది, ఆరవ సంఘయణము ఉంటుంది.

# 46 ఆరు సంస్థానములు

సంస్థానమంటే శరీరముయొక్క విశిష్ట ఆకృతి.

1 సమ చతురస్ర సంస్థానం – అస్ర అంటే మూల. పర్యంకాసన ముద్రలో కూర్చున్న మనుష్యునియొక్క నాలుగు కోణములు సమసమానంగ ఉంటాయి. అంటే 1 కుడి మోకాలునుండి ఎడమ భుజంవరకు అంతరము, 2 కుడి భుజమునుండి ఎడమ మోకాలివరకు అంతరము, 3 రెండు మోకాళ్ళ అంతరము, 4 రెండు మోకాళ్ళ మధ్యభాగంనుంచి కపాలంయొక్క మధ్యభాగంవరకు అంతరము – ఎవరి శరీరంలో ఈ నాలుగు అంతరములు సమానంగ ఉంటాయో వారు సమ చతురస్ర సంస్థానము కలవారు.

వీరి శరీరంలో నాలుగు వైపులా పైనుంచి కిందివరకు అవయవములు సమానంగ ఉంటాయి. సాముద్రిక శాస్త్రానుసారం సుందర లక్షణాలతో కూడి, తగిన మాత్రలు కలవారై ఉంటారు.

2 న్యగ్రోధ పరిమండల సంస్థానం – న్యగ్రోధం(వటవృక్షం)లా నాభిపైన దేహం శుభలక్షణాలతో కూడి, నాభి కిందిభాగం అశుభ లక్షణాలతో కూడిన శరీరాన్ని కలిగి ఉంటే దానిని న్యగ్రోధ పరిమండల సంస్థానమంటారు.

3 సాది సంస్థానం – వీరి శరీరంలో నాభి కిందిభాగం శుభలక్షణాలతోకూడి తగు మాత్రలతో ఉంటుంది. ఈ శరీరాన్ని సాది సంస్థానమంటారు.

4 వామన సంస్థానం – వీరి శరీరంలో శిరస్సు, కంఠం, చేతులు, పాదములు ఈ నాలుగు అవయవములు తగు మాత్రాయుక్తములై ఉంటాయి. ఛాతీ, కడుపు మొదలైన అవయవములు యోగ్యలక్షణ యుక్తములు కావు. ఈ శరీరాన్ని వామన సంస్థానమంటారు.

5 కుబ్జ సంస్థానం – వీరి శరీరంలో శిరస్సు, కంఠం మొదలగు అవయవములు కురూపములు. ఇంతేకాక ఛాతీ, పొట్ట మొదలగు అవయవములు చక్కగ ఉంటాయి. ఈ శరీరాన్ని కుబ్జ సంస్థానమంటారు.

6 హుండక సంస్థానం – వీరి శరీరంలో అన్ని అవయవములు మాత్రాయుక్తము కాని, లక్షణయుక్తము కాని కావు. అంటే కురూపులు. కొంపా,గోడు లేనివారు. తీరూతెన్నూ లేని ఒంటెలయ్యేవారు. ఈ శరీరాన్ని హుండక సంస్థానమంటారు.

అగ్నిశర్మ అనే తాపసి శరీరం 'హుండక'.

# 47 ఆరు ద్రవ్యాలు

జినశాసనంలో ఆరువిధాలైన ద్రవ్యాలు చెప్పబడుతున్నాయి. ఈ విశాల విశ్వంలో ఈ ఆరు ద్రవ్యాలే ఉన్నాయి. మరో విధంగ చెప్పాలంటే ఈ ఆరు ద్రవ్యాలతోటే విశ్వం తయారుకాబడింది. ఈ ఆరు ద్రవ్యాలు –

1 ధర్మాస్తి కాయం – ఈ ద్రవ్యంయొక్క ముఖ్యగుణం గతి సహాయకత. ఈ ద్రవ్యం జీవుడు అలాగే పుద్గలు గతి కల్పించడంలో సహాయపడుతుంది. ఎలాగంటే చేప ఈదడానికి సహాయపడే నీరు అవుతుంది. నీరు లేకుండా చేప ఈదలేదుగదా! ఆ విధంగానే ధర్మాస్తి కాయ ద్రవ్యం సహాయం లేకుండా జీవుడు లేదా పుద్గలు గతి ఉత్పన్నం కాదు.

2 అధర్మాస్తి కాయం – దీని ప్రధానగుణం స్థిరత్వంలో సహాయపడుతుంది. జీవుడు కాని పుద్గలు కాని స్థిరంగ ఉండడానికి ఏది సహాయపడుతుందో అది అధర్మాస్తి కాయ ద్రవ్యం. ఎలాగంటే కుంటివాడు నుంచోడానికి కఱ్ఱ ఆధారమవుతోంది. కఱ్ఱ ఆధారం లేకుండా రోగిష్ఠి, ముసలి నుంచోలేడుకదా! అలాగే అధర్మాస్తి కాయ ద్రవ్యం సహాయం లేకుండా జీవుడు కాని పుద్గలు కాని స్థిరత్వాన్ని పొందలేవు.

3 ఆకాశాస్తి కాయం – దీని ప్రధాన గుణం స్థాన ప్రదానంలో సహాయపడుతుంది. జీవుడు, పుద్గలు ఏ ద్రవ్యంచేత స్థానప్రదానం పొందుతున్నాడో అది ఆకాశాస్తి కాయ ద్రవ్యం. ఎలాగంటే పాలలో పంచదారబిళ్ళలు కరిగిపోతాయి. పాలలో పంచదార బిళ్ళలకు స్థానం కలుగుతోంది. అలాగే ఆకాశం స్థానం ఇస్తోంది. దానివల్లనే జీవులు ఉండగలుగుతున్నాయి.

4 పుద్గలాస్తి కాయం – దీని ముఖ్యగుణం నింపడం, కరగడం. దీని స్వభావం రూపము,రసము,గంధము,స్పర్శ. వేనిలో కుళ్ళిపోడం, పడిపోడం, పాడైపోడం స్వభావం ఉంటుందో లేదా వేనిలో రూప,రస,గంధ,స్పర్శ మొదలగు స్వభావాలుంటాయో అది పుద్గలాస్తి కాయ ద్రవ్యం. బల్ల,కుర్చీ,ఇల్లు,మానవుడు మొదలగు వాని శరీరం.

5 జీవాస్తి కాయం – దీని ప్రధాన గుణం జ్ఞానం ఉపయోగం మొదలైన వాని స్వభావం. దేనిలో జ్ఞానం, దర్శనం, ఉపయోగం మొదలైనవి ఉంటాయో లేదా దేనిలో సుఖం,దుఃఖం మొదలగు భావాలు ఉత్పన్నమవుతాయో అది జీవాప్తి కాయ ద్రవ్యం. ఎలాగంటే బాల్యావస్థ, యౌవనావస్థ, వృద్ధావస్థ మొదలైనవి పరివర్తన కాల ప్రభావం చేతనే జరుగుతున్నాయి.

జీవాస్తి కాయాన్ని విడిచిపెడితే మిగిలిన అయిదు నిర్జీవములు.

# 48 ఏడు క్షేత్రాలు

శ్రీ జినశాసనంలో ఏడు క్షేత్రాలకి చాలా మహత్తు ఉంది. ఆ ఏడు క్షేత్రాలు –

1 జినమూర్తి – శ్రీజినేశ్వర భగవానునికి మనపై అత్యంత, అపారమైన కరుణ ఉంది. ఈ కరుణయొక్క ఋణభారం కింద మునిగిపోయిన భక్తుడు జినమూర్తిని ప్రతిష్ఠించుకుని ప్రతిరోజు పూజించుకుంటాడు.

2 జినమందిరం – జినమూర్తి విరాజమారుడై ఉండే ప్రధాన స్థలం లేదా ఎక్కడ భావుకుడైన భక్తుడు భగవానుణ్ణి అనేక రీతులుగ ఉప్పొంగిపోయే ఉల్లాసంతో పూజలు చేస్తాడో దాన్ని జినమందిరం అంటారు.

జినమందిరంయొక్క శిఖరాన్ని దూరంనుంచి చూడడం సమయంలోకూడా 'నమో జినానాం' అని నమస్కరించాలి.

3 జినాగమం – శ్రీజినేశ్వర దేవునిద్వారా చెప్పబడిన, గణధరదేవుల ద్వారా స్వీకరించబడిన జగత్తుయొక్క సత్యత్వ సిద్ధాంతపరమైన సంగతులు ప్రస్తుతం దేనిలో నిక్షేపింపబడి ఉన్నాయో అది జినాగమం. అది ధర్మశాస్త్రం.

జినమూర్తి, జినాగమం సంసార సాగరం దాటించడానికి సఫలసాధనం.

4 సాధు, 5సాధ్వి – శ్రీజినేశ్వర దేవుల ఆజ్ఞానుసారం తమ జీవితమంతా సంసారాన్ని విడిచిపెట్టి సర్వవిరతి ధర్మాన్ని ఆరాధిస్తూ గడిపే పురుషుడు సాధు, స్త్రీ సాధ్వి.

6 శ్రావక, 7 శ్రావిక – శ్రీ జినేశ్వర దేవులద్వారా చెప్పబడిన సమస్త సంసార సముద్రాన్ని త్యజించి సర్వవిరతి ధర్మాన్ని ఎవరు పరిస్థితుల ప్రభావంచేత స్వీకరింపజాలరో, కాని ఎవరి హృదయంలో ఆ ధర్మం స్వీకరించాలనే ఆత్రుత ఉంటుందో, సంసారంలో ఉంటూ దేశవిరతి ధర్మాన్ని పూర్తిగ లేదా అంశాలవారీగ అనుసరించే పురుషుడు శ్రావక, స్త్రీ శ్రావిక.

ఈ ఏడూ అత్యంత ఉత్తమ క్షేత్రాలు. ఈ క్షేత్రాలకోసం వినియోగపడే దేహం,మనస్సు,సంపద,జీవనంలోని సమస్త శక్తులు వేలాది,లక్షలాది రెట్లు ఫలాన్ని ఇస్తాయి. అందువలన ఈ ఏడు క్షేత్రాలను యథాశక్తి గాఢమైన భక్తితో అనుసరించాలి. ఈ భక్తి సహాయంవలన వారి జీవాత్మలు అక్షయ పుణ్యశక్తితో నిండిపోతాయి.

# 49 ఏడు భయాలు

ఈ లోకంలో భయం లేనివారెవరు? లోకంలో సాధారణంగ అన్ని జీవులు భయపీడితులే. ఈ భయం ఏడు రకాలు -

1 ఇహలోక భయం, 2 పరలోక భయం, 3 ఆదాన భయం, 4 అకస్మాత్ భయం, 5 ఆజీవికా భయం, 6 మృత్యు భయం, 7 అపయశ భయం.

1 ఇహలోక భయం - ఈ లోకంలో మనిషికి మరొక మనిషివల్ల భయం ఉంటుంది.

2 పరలోక భయం - మానవునికి పరలోక దేవతలు, వ్యంతరముల భయం ఉంటుంది.

3 ఆదాన భయం - మానవునికి తన ధనం, వస్తువులు దొంగిలిస్తారనే భయం ఉంటుంది.

4 అకస్మాత్ భయం - జీవునికి అనుకోని సమయంలో అకస్మాత్తుగ అనుకోని సమయంలో ప్రమాదం జరుగుతుందనే భయం ఉంటుంది.

5 ఆజీవికా భయం - వ్యాపారం, నౌకరీ మొదలైనవి పోతాయేమోననే భయం ఉంటుంది.

6 మృత్యు భయం - సమస్త జీవులకి మృత్యుభయం ఉంటుంది.

7 అపయశ భయం - ఈ లోకంలో అందరికి అపకీర్తి కలుగుతుందనే భయం ఉంటుంది.

ఎవరు అరిహంత శరణులో ఉంటారో వారికి భయం భూతం భయపడి పారిపోతుంది. అరిహంత భగవానుడు అభయదానం ఇచ్చేవాడు. మనం అట్టి అరిహంత భగవానుని శరణులో జీవించాలి. అరిహంత అంతఃకరణ పూర్వకంగ భక్తితో పూజించాలి. మనం అలాచేస్తే మేఘకుమారునివలె భవసాగరాన్ని దాటిపోగలం.

# 50 ఆత్మ అస్తిత్వసిద్ధి

మన శరీరంలో ఒక ఆత్మ ఉంది. ఈ శరీరం ఆత్మ కాదు. అది ఈ దేహంకంటె వేరైనది. చాలామంది అనుకుంటుంటే వింటూంటాం. ఆత్మ మనకంటికి కనబడటంలేదు. కాబట్టి ఆత్మ అనేది లేదు' అని.

అలాంటివాళ్ళని మనం అడగాలి 'మీరు మీ తాతతాతని చూశారా?' వాళ్ళప్పుడు అంటారు 'లేదు. మేం చూడలేదు.' అప్పుడు మనం వెంటనే అనాలి 'మీరు మీ తాతతాతని చూడకుండానే ఎలా ఉన్నాడని అంగీకరిస్తున్నారో అలాగే ఆత్మ మనచే చూడబడకపోయినా ఉంది అని అంగీకరించడానికి మీరు ఎందుకు సిద్ధపడరు?'

ఆఫ్రికా అడవుల్లో సంచరించే ఏనుగును ఎవరూ స్వయంగ చూడలేదు. కాని ఆ ఏనుగు అస్తిత్వాన్ని ఎవరూ తిరస్కరించడం లేదు. అలాగే ఆత్మ స్వరూపాన్ని మనం స్వయంగ చూడలేకపోతున్నాం. కాని ఆత్మజ్ఞానులైన మహాత్ములు ఆత్మను దర్శించగలిగేరు కదా! అందువలన ఆత్మ అనేది ఉంది. దానికి అస్తిత్వముంది అనడంలో సందేహంలేదు.

ఆ తరువాత మన దగ్గర 'జ్ఞానం' ఉంది. ఈ జ్ఞానం ఆత్మయొక్క గుణం. జ్ఞానం ఆత్మలేనట్టి జడ(నిర్జీవ) పదార్థాల్లో (బల్ల,కుర్చీ,ఇల్లు,స్తంభం మొదలగునవి) లేదు. కేవలం ఆత్మలేనే జ్ఞానం, వాంఛ, సుఖ-దుఃఖాలు, భావన మొదలైనవి ఉంటున్నాయి. అందువలన ఆత్మ ఉందని అంగీకరించాలి.

చనిపోయిన మనిషి శవాన్ని, బ్రతికున్న మనషిని పక్కపక్కనే పడుకోబెట్టి చూడండి. శవంలో లేనిదేమిటి? బ్రతికున్న మనిషిలో ఉన్నదేమిటి? దేని వశంవలన వాడు తిరగ్గలుగుతున్నాడు. తినగలుగుతున్నాడు. మాట్లాడగలుగుతున్నాడు. గ్రహించగలుగుతున్నాడు. వీటన్నిటికి కారణం ఆత్మ. ఎవరి దేహంనుండి ఆత్మ ఎగిరిపోతుందో వాడు చనిపోయాడు అంటాం. ఈ విధంగ ఆత్మ అస్తిత్వం నిరూపింపబడుతోంది.

ఏవస్తుకైనా ఒక పదంకాని, అర్థంకాని ఉందంటే, ఆ వస్తువు గురించి మన మనస్సులో శంక కలిగిందంటే, ఆ వస్తువు జగత్తులో ఎక్కడో అక్కడ ఉండే ఉంటుంది. అది సృష్టి నియమం.

జినేశ్ ఇంట్లో లేడు. దీనికి సూటిగ అర్థం చెప్పాలంటే ఆ సమయానికి జినేశ్ ఇంట్లో లేడని, అంటే ఆ సమయానికి మరోచోట ఉన్నాడనేకదా అర్థం. అలాగే ఈ శరీరంలో ఆత్మ లేదు అంటే దీనికి సూటిగ అర్థం ఆత్మ ఇక్కడ లేదుకాని ఎక్కడో మరొకచోట అక్కడ అవశ్యం ఉండితీరాలి.

ఇంకోమాటేమిటంటే వర్తమానకాలంలోకూడా చాలామందికి తమ పూర్వజన్మ జ్ఞానం కలుగుతోంది. ఇలాంటి అనేక సంఘటనలు మనం వార్తాపత్రికలలో, టి.వి.లో చదువుతూనే ఉంటాం, వింటూనే ఉంటాం. ఈ సంఘటనల సహజత్వాన్నిగూర్చి శాస్త్రజ్ఞులు పరిశోధనలు జరుపుతూనే ఉన్నారు. జయపూర్‌కి చెందిన డా.బెనర్జీ, అలాగే విదేశీ ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు అలెగ్జాండరు వేనాక్ పూర్వజన్మ జ్ఞానంకల వందలాదిమంది వృత్తాంతాలను, విషయాలను శాస్త్రీయంగ పరిశోధించారు. అపుడు అవి పూర్తి సత్యములని తేలాయి.

పూర్వజన్మ జ్ఞానాన్ని జైన పరిభాషలో 'జాతిస్మరణ జ్ఞానం' అంటారు. పూర్వజన్మ దేహం(మరణానంతరం పార్థివశరీరానికి చేయబడే అంతిమ సంస్కారంతో) మట్టై, బూడిదై పోయింది. ఈ జన్మలో మరో కొత్త శరీరం ధరించింది. ఈ రెండు శరీరాల్లో ఉండేది ఒకటే స్వతంత్ర ఆత్మ. అందువలన ఈ ఆత్మకు తన పూర్వజన్మలోని దేహం, ఆ జీవిత అనుభవాల జ్ఞానం కలుగుతోంది. ఈ విధంగ 'జాతిస్మరణ' ద్వారాకూడా ఆత్మయొక్క అస్తిత్వం నిరూపింపబడుతోంది.

ఇలా ఆత్మయొక్క అస్తిత్వాన్ని నిరూపించడానికి అనేక విధాలైన నిరూపణలు ఇవ్వవచ్చు. కాని ఇక్కడ అంగీకరించడానికి ఇది చాలు. ఈ విషయంలో ఇంకా తెలుసుకోవాలనే కోరిక ఉంటే పూజ్య గురుదేవులు శ్రీచంద్రశేఖర విజయజీ మహరాజ్ రచించిన 'విజ్ఞాన్ ఔర్ ధర్మ్' (గుజరాతీ భాషలో) పుస్తకం చదవండి.

# 51 కర్మ అస్తిత్వసిద్ధి

చాలామంది దగ్గర ఈ ప్రశ్న ఉంటుంది. 'అసలు కర్మ అనేది ఉందా?' దీనికి సమాధానం 'ఉంది, కర్మ అనేది ఉంది'. ఎలాగంటే ఈలోకంలోనే అది కంటికి కనబడుతోంది. ఒకడు సుఖపడుతున్నాడు, మరొకడు దుః ఖపడుతున్నాడు. ఒకడు ధనవంతుడవుతున్నాడు, మరొకడు దరిద్రుడవుతున్నాడు. ఒకడు కళ్ళుండి అన్నీ చూడగలుగుతున్నాడు, మరొకడు పుట్టుగుడ్డివాడై ఏమీ చూడలేకపోతున్నాడు. ఒకడు ఆగర్భ శ్రీమంతుడవుతున్నాడు, మరొకడు ఉత్త బికారి అవుతున్నాడు. అంతేకాదు ఒకే తల్లికి, తండ్రికి పుట్టిన ఇద్దరి సంతానంలో ఒకడు చాలా బుద్ధిమంతుడు అవుతున్నాడు, మరొకడు మూర్ఖుడవుతున్నాడు. ఒకడు అందగాడవుతున్నాడు, మరొకడు కురూపి అవుతున్నాడు. ఈ విధంగ మనిషికీ మనిషికీ వ్యత్యాసాలు లోకంలో నిత్యం మనం చూస్తూనే ఉన్నాం. ఇప్పుడో ప్రశ్న ఉదయిస్తోంది. 'దీనికంతకీ కారణమేమిటి? ఇవన్నీ చేస్తున్నదెవరు? భగవానుడే ఇవన్నీ చేస్తున్నాడా?' ఏమీ కాదు. భగవానుడు అపార కరుణామయుడు. దయాశీలుడు. అంతేకాదు ఆయన అపార శక్తిసంపన్నుడు. ఆయన ఇలాంటి పనులు చేస్తాడా? చెయ్యడు. ఎన్నటికీ చెయ్యడు. ఇలాంటివి ఆయన చేయడం అసంభవం.

ఒకవేళ భగవానుడే ఇలాంటివి చేయాలనుకుంటే అపుడు అందరికీ సమానంగ చెయ్యాలికదా! కాని చూస్తుంటే ఈ లోకంలో అందరూ ఒకే విధంగ సమానంగ లేరే? అయితే ఇలా అవడానికి కారణమేమిటి? అనే ప్రశ్న మళ్ళీ ఉదయిస్తోంది. ఈ ప్రశ్నకి సరైన సమాధానం ఏమిటంటే ప్రతియొక్క జీవి తన పూర్వజన్మ కర్మననుసరించి వచ్చే జన్మలో సుఖ–దుఃఖాల ప్రాప్తిని పొందుతున్నాడు.

చాలాసార్లు ఇలాకూడా అవుతూ ఉంటుంది. రాత్రి, పగలు చాలా శ్రద్ధగ చదివే విద్యార్థి పరీక్ష తప్పుతాడు. అలాగే కొద్దిపాటి శ్రమపడిన మరొక విద్యార్థి ఉత్తీర్ణుడవుతాడు. కష్టపడి చదివిన మొదటి విద్యార్థి పరీక్ష ఎందుకు తప్పేడు? మరొకటి చూస్తే రోగగ్రస్తుడైన మనిషిని బ్రతికించడానికి డాక్టరు చాలా శ్రమపడతాడు. దురదృష్టవశాత్తు రోగి చనిపోతాడు. దీనికి కారణమేమిటి? ఈ ప్రశ్నలకి సమాధానం ఆ జీవాత్మలు చేసుకున్న ఆయా కర్మలు.

ఈ విధంగ ఈ లోకంలో ఈ సంచలనానికి వెనుక వేరువేరు జీవులకు వేరువేరు కర్మలే కారణమవుతున్నాయి. కర్మ కారణంగానే జీవుడు ఈ లోకంలో సుఖం–దుఃఖం, ఆరోగ్యం–అనారోగ్యం, మోదం–విషాదం మొదలైనవి పొందుతున్నాడు. ఈ కర్మ ఆ జీవులను తమ పూర్వజన్మలతో బంధిస్తోంది. ఈ జన్మలో ఆ బంధనంగ వచ్చిన కర్మకూడా పుట్టి వారివారి స్వభావాల కరుగుణంగ మంచి,చెడు ఫలితాలనిస్తోంది. పూర్వజన్మలో చేసుకున్న మంచికర్మల ఫలితం పొందడానికి జీవుడు ఈ జన్మలో సుఖం అనుభవిస్తున్నాడు. చెడుకర్మల ఫలితంగ దుఃఖం అనుభవిస్తున్నాడు.

ఈ జన్మలో మనం ఏం పనులు చేస్తామో అవి మంచివో చెడ్డవో వాని ప్రకారంగానే మనల్ని కర్మ బంధిస్తుంది. ఎప్పుడైతే వారు ఈ కర్మలచేత బంధింపబడతారో (కర్మ ఫలం సాధారణంగ మరుజన్మలోనే ఉంటుంది) అప్పుడు వాని ఫలస్వరూపాన్ని పొందే సుఖము,దుఃఖము తప్పక అనుభవించవలసి వస్తోంది. అందువలన మనం మన జీవితంలో ఎప్పుడూ చెడుపనులు చేయకూడదు. ప్రతిక్షణం మంచిపనులే చేస్తూ ఉండాలి.

# 52 ఎనిమిది కర్మలు

ఆత్మ ఎప్పుడూ నశించిపోని అనంతమైన,అక్షయమైన ఎనిమిది గుణాల యజమాని. కాని ఈ గుణాలను ఎనిమిది విధాలైన కర్మ మూతపెట్టి కప్పేస్తోంది. దీని పరిణామ స్వరూపంగ మనం ఈ లోకంలో మాటిమాటికి పుట్టడం,చావడం చక్కర్లు కొడుతూ ఉన్నాము. దారితప్పి తిరుగుతున్నాము. పలువిధాలైన దుఃఖాలను అనుభవిస్తున్నాము. ఈ ఎనిమిది కర్మలు -

1 జ్ఞానావరణీయ కర్మ - ఈ కర్మ ఆత్మజ్ఞానం గుణంమీద ఎక్కి కూర్చుంటుంది. జ్ఞానం స్థానంలో అజ్ఞానం లేదా తప్పుడు జ్ఞానం ఇస్తూంటుంది. ఈ కర్మ ఆత్మను ఏ స్థితికి తెస్తుందంటే ఎవరేనా మన కళ్ళకి పట్టీ బంధించినట్టే చేస్తుంది.

2 దర్శనావరణీయ కర్మ - ఈ కర్మ ఆత్మ దర్శన గుణంమీద అధికారం చలాయిస్తుంది. అంధత్వాన్ని లేదా నిద్రను కలిగిస్తుంది. ఇది ఎలాంటి స్థితి అంటే ద్వారపాలకుడు రాజుగారి దర్శనాన్ని నిరోధించడం లాంటిదే.

3 వేదనీయ కర్మ - ఈ కర్మ ఆత్మయొక్క నిరాబాధా సుఖాన్ని అడ్డుకుంటుంది. దాని స్థానంలో ఈ లోకంలోని సుఖ-దుఃఖాలను కలిగిస్తుంది. ఈ స్థితి కత్తికి అంటుకున్న తేనెలాంటిది. తేనె నాకితే తియ్యగ బాగానే ఉంటుంది కాని కత్తి అంచు తగిలి నాలుక తెగే ప్రమాదం కూడా ఉంది.

4 మోహనీయ కర్మ - ఈ కర్మ ఆత్మ సత్యాన్ని గ్రహించే శక్తిని మరిచిపోయేలా చేస్తుంది. ఈ కర్మ ఆత్మను భ్రమలో పడేస్తుంది. దీనివల్ల జరిగేదేమిటంటే మంచి సుందరవస్తువు చెడ్డదిగాను, చెడ్డవస్తువు మంచి సుందరంగాను కనబడుతుంది. ఒక విధంగ ఇది పూర్తిగ మద్యం సేవించిన వాడి స్థితి. తాగినవాడికి మద్యం ప్రభావంవలన మంచి,చెడు విచక్షణ ఎలా నశిస్తుందో అలాంటిదే దీని స్థితి.

5 ఆయుః కర్మ - ఈ కర్మ ఆత్మ ముక్తి లేదా మోక్షం వంటి అక్షయమైన, శాశ్వతమైన స్థితిని పొందకుండా చేస్తుంది. ఈ కర్మ ఆత్మకి ఈ లోకంలో పుట్టుకనిస్తుంది. జీవనాన్ని ఇస్తుంది. చివరకు మరణాన్నీ ఇస్తుంది. ఇదెలాంటిదంటే జైలరు ఖైదీ కాళ్ళకు వేసిన సంకెళ్ళు లాంటిది. ఖైదీ జైలరు ఆదేశానుసారం నడవాలికానీ వాడిష్టం వచ్చినట్టు స్వేచ్ఛగ ఏ కొంచెంకూడా చెయ్యలేడు.

6 నామ కర్మ - ఈ కర్మ ఆత్మ రూపహీన స్థితిని అడ్డుకుంటుంది. దానికి దేవ, మనుష్య, నారక మొదలగు గతులను కల్పిస్తుంది. శారీరాన్నిస్తుంది. ఇంద్రియాలను కల్పిస్తుంది. ఇది ఒక చిత్రకారుడు గీసిన చిత్రం లాంటిది.

7 గోత్ర కర్మ - ఈ కర్మ ఆత్మయొక్క తేలికపాటుతనం,అల్పత్వం(అగురుత,లఘుత) వీటిని

అడ్డుకుంటోంది. ఈ లోకంలో ఉన్నతకులాన్ని, నీచకులాన్ని కల్పిస్తోంది. ఎలాగంటే కుమ్మరివాడు మట్టితో తయారుచేసిన కుండ పాలుపోసుకోడానికి ఉపయోగపడుతోంది, కల్లు పోసుకోడానికీ ఉపయోగపడుతోంది.

8 అంతరాయ కర్మ – ఈ కర్మ ఆత్మయొక్క అనంతవీర్యాన్ని అడ్డుకుంటోంది. ఈ కర్మ ఆత్మను లోభిని చేస్తుంది. బికారిని చేస్తుంది. బలహీనుణ్ణి,దుర్బలుణ్ణి చేసివేస్తుంది. ఇదెలాంటిదంటే రాజుగారి ధనాగారాధ్యక్షుడు లాంటిది. రాజుగారి మనసులో ఎవరికేనా ఏదేనా ఇద్దామని లక్ష ఆశలున్నప్పటికీ ధనాగారాధ్యక్షుడు కావాలనుకుంటే డబ్బు ఇవ్వడంలో అడ్డుకో గలుగుతాడు.

ఈ ఎనిమిది కర్మలలో జ్ఞానావరణీయ, దర్శనావరణీయ, మోహనీయ, అంతరాయ ఈ నాలుగు ప్రమాదకరమైన కర్మలు. ఎందువల్లనంటే ఈ నాలుగు కర్మలు ఆత్మయొక్క నిర్మలత్వంమీద అంటే ఆత్మయొక్క అనంత జ్ఞానంమీద, అనంత దర్శనంమీద, వీతరాగత్వంమీద ఇలాంటి మూలగుణాలమీద సూటిగ అధికారం చలాయిస్తాయి.

వేదనీయ, ఆయు, నామ, గోత్ర ఈ నాలుగు అంత ప్రమాదకరములు కానివి. ఎందువల్లనంటే ఈ నాలుగు కర్మలు ఆత్మయొక్క మూలగుణాలమీద సూటిగ అధికారం చటాయించవు. కానీ ప్రమాదకరములైన నాలుగు కర్మలకు సహాయకారులుగ ఉంటాయి.

ఈ ఎనిమిది కర్మలను కంఠస్థం చేయడానికి సులభమార్గం ఈ క్రింది కథ చదవండి –

జ్ఞానచంద్ అని ఒకడుండేవాడు. వాడు దైవదర్శనానికి వెళ్ళాడు. దారిలో వాడి కడుపులో వేవన బయలుదేరింది. కొంచెం దూరం వెళ్ళాక మిత్రుడు మోహనభాయి కలిశాడు. వాడు అడిగాడు 'ఏం అలా ఉన్నావు?'అని. 'కడుపులో చాలా వేదనగ ఉంది. ఇక్కడే ఆయువు తీరిపోతే బాగుంటుందనిపిస్తోంది' అన్నాడు. మోహన్‌భాయికి అర్థమయింది. 'అలా అనకు. భగవానుడి నామం స్మరించు. మీ గోత్రదేవతలను స్మరించు. అప్పుడు నీకున్న అంతరాయములన్నీ తొలగిపోతాయి.

ఇక్కడ జ్ఞానచంద్ జ్ఞానావరణీయ కర్మ, దర్శనం దర్శనావరణీయ కర్మ, వేదన వేదనీయ కర్మ, మోహన్‌భాయి మోహనీయ కర్మ, ఆయు ఆయుకర్మ, నామ నామ కర్మ, గోత్ర కర్మ, అంతరాయం అంతరాయ కర్మ.

# 53 ఎనిమిది కర్మల పట్టిక

ఆత్మయొక్క అక్షయగుణాలు ఎనిమిది. ఈ గుణాలను అడ్డుకుని సంసారస్థితిని కల్పించే కర్మలుకూడా ఎనిమిదే. వాని రీతి -

| విధములు | కర్మ | ఏగుణాన్నిఅడ్డుకుంటోంది | ఏఫలాన్నిఇస్తోంది | దేనికిసమానం |
|---|---|---|---|---|
| + 5 | జ్ఞానావరణీయ | ఆత్మయొక్కజ్ఞాన గుణాన్ని | అజ్ఞానం, తప్పుడుజ్ఞానం | కళ్ళకుగంతలు కట్టడం |
| + 9 | దర్శనవావరణీయ | ఆత్మయొక్క దర్శన గుణాన్ని | అంధత్వం, నిద్ర | ద్వారపాలకుడు |
| 2 | వేదనీయ | ఆత్మయొక్క నిరాబాధమైన సుఖాన్ని | శాంతి, అశాంతి | తేనె అంటిన కత్తి |
| + 28 | మోహనీయ | సమ్యక్ దర్శనం, చారిత్రం గుణాల్ని | మిథ్యాత్వం, అవిరతి రాగద్వేషం, కామం, క్రోధం మొదలైనవి. | మద్యం తాగిన మనిషి |
| 4 | ఆయు | అక్షయ స్థితిని | పుట్టుక,జీవనం, మరణం. | సంకెళ్ళు |
| 103 | నామ | రూపహీనత | గతి,శరీరం, ఇంద్రియాలు, కీర్తి,అపకీర్తి మొదలైనవి | చిత్రకారుడు చిత్రించిన చిత్రం |
| 2 | గోత్ర | తేలికపాటితనం, అల్పత్వం | ఉన్నత, నీచ కులత్వం | కుమ్మరివాని కుండ |
| + 5 | అంతరాయం | అనంతవీర్యాన్ని | లోభత్వం,దరిద్రత పరాధీనత,దుర్బలత | రాజుగారి ధనాగారాధ్యక్షుడు |

+ ఈ గుర్తుగలవి విశ్వాసఘాతుక కర్మలు. మిగిలిన నాలుగు విశ్వాసఘాతుక కర్మలు కావు,

తెలుసుకోండి :- మిథ్యాత్వం, అవిరతి(పాపం), కషాయం, ప్రమోదం, యోగం ఈ 5 కారణాలచేత ఆత్మ నిరంతరం పైన చెప్పబడిన కర్మలచే బంధింపబడుతోంది.

# 54 ఎనిమిది ప్రభావకములు

ఈ విశాల విశ్వ ప్రాంగణంలో శ్రీజినశాసనంయొక్క ఏ ప్రచారం ప్రసారమవుతోందో దాని ప్రభావం వ్యాప్తి చెందుతోంది. వానినే 'ప్రభావకములు' అంటారు.

1 ప్రావచనిక – ప్రవచనంయొక్క అర్థం ద్వాదశాంగీరూపమైన ధర్మశాస్త్రం. వర్తమానకాలంలో ఏ శాస్త్రం ఉపలబ్ధమవుతోందో దానిని లోతుగ అధ్యయనం చేసేవాణ్ణి 'ప్రావచనిక' అంటారు.

2 ధర్మ కథాకార – ధర్మసంబంధమైన కథలను చెప్పి తద్వారా ప్రజల్లో విరక్తి భావాన్ని వృద్ధిపరచేవాడు లేదా మోక్షమార్గంవైపు దృష్టి మరల్చేవాడు 'ధర్మకథాకార'. (నందిషేణుడులాగ)

3 వాది – ధర్మశాస్త్రము మొదలగువానియొక్క సిద్ధాంతములను గూర్చి చర్చించడాన్ని వాదము అంటారు. ఈ చర్చలో నేర్పరిని 'వాది' అంటారు. రాజసభ మొదలగు వాటిలో తన మతాన్ని ప్రతిష్ఠాపించి, ఇతర మతాలను ఖండించి విజయం సంపాదించే శక్తిశాలి. (మల్లవాది సూరిలాగ)

4 నైమిత్తిక – భూత,భవిష్యత్,వర్తమాన కాలములను గూర్చి మాట్లాడేవాడు. నిమిత్త(జ్యోతిషం మొ.వి) శాస్త్రముల నెరిగినవాడు. (భద్రబాహు స్వామీజీలాగ)

5 తపస్వీ – తపోగుణంచే శోభిల్లే ఏ జీవుడు జినజ్ఞానుసారం చిరకాలం తపస్సు చేస్తాడో, ఆశ్రవ(పాపములు) త్యాగం చేస్తాడో, క్రోధాన్ని విసర్జించి నిరంతరం క్షమాగుణాన్ని ఆశ్రయించి ఉంటాడో అటువంటివాడు 'తపస్వి' అనబడతాడు. (చంపాశ్రావికలాగ)

6 విద్యావాన్ – ఆకాశగమనం మొదలైన అనేక విద్యలను సాధించిన విద్వాంసుడు. (వజ్రస్వామీజీలాగ)

7 సిద్ధ – విచిత్రములు(అంజనగుటిక) మొదలైనవి తెలిసినవాడు. ఈ విద్యలచే ఆ వ్యక్తి అదృశ్యంకూడా కాగలడు. (ఆచార్య కాలికసూరీజీలాగ)

8 కవి – అత్యంత సుందరమైన, అమృతోపమానమైన, మధురమైన అర్థంతో కూడిన శ్లోకాదుల కావ్యరచన చాల శీఘ్రంగ చేయగలవాడు 'కవి'. (సిద్ధసేన దివాకరసూరిలాగ)

ఈ 8 విధాలైన శక్తులను సాధించగలిగినవారు 'అష్ట ప్రభావకులు'. జినధర్మ ప్రచారంకోసం తమ శక్తులను వినియోగించేవారినే 'ప్రభావక' అంటారు.

# 55 ఎనిమిది గుణాలు

ప్రతి మనిషి ఈ చెప్పబడే ఎనిమిది గుణాలను తప్పక ఆదరించాలి.

1 పాప భయం – మనిషికి ఎల్లప్పుడూ పాపమంటే భయం ఉండాలి. నిత్యం తన మనసులో ఈ ఆలోచన చేస్తూండాలి. 'నేను పాపకర్మ చేయకుండా ఉండడం ఎలాగ? ఒకవేళ నేను పాపకర్మ చేస్తే నా ఆత్మకు ఏం గతి పడుతుంది?' అనే విచారం మనసులో ఉంచుకుని పాపకర్మలకు దూరంగ పారిపోడానికి ప్రయత్నించాలి.

2 లజ్జ – లజ్జ అంటే సిగ్గు, సంకోచం. ఇది చాలా గొప్ప గుణం. ఏదేనా చెడ్డపని చేసే సమయంలో మనిషి మనసులో సిగ్గు ఉదయిస్తే సాధారణంగ వాడు పాపం చేయనేలేడు. పెద్దవాళ్ళు, వృద్ధులు, తల్లి, తండ్రి ఇతర పెద్దలగూర్చి మన మనసులో లజ్జపడితే అప్పుడు మనం దారి తప్పిపోకుండా రక్షింపబడతాం. అందువలన మానవుడు లజ్జను విడిచిపెట్టి నిర్లజ్జను ఆశ్రయించకూడదు.

3 సౌమ్యత – సౌమ్యతగల మనిషి అందరికీ ఇష్టుడవుతాడు. వీని మనస్సు, మాట, ముఖంతీరు అన్నీ సౌమ్యంగ ఉంటాయి. రౌద్రంగ, కోపంగ ఉండే మనిషి ఎవరికీ ఇష్టుడుగ ఉండడు. మంచివాడనరు. సౌమ్యంగ, శాంతంగ ఉండే మనిషి అందరి ప్రేమ, సానుభూతి, సద్భావం సంపాదించగలుగుతాడు.

4 జనప్రియత – ఎవరి జీవితం సుందరమో, పాపరహితమో, సదాచారం, సద్విచారం, మధురంగ మాట్లాడడంతో సుశోభితమవుతుందో వాళ్ళ ఎల్లప్పుడూ జనప్రియులవుతారు. జనప్రియులుగానే ఎల్లకాలం ఉంటారు. ఈ విధంగ జనప్రియులు కావడానికి ఎల్లరూ ప్రయత్నించాలి.

5 దూరదృష్టి – ఏ పని చేసేటప్పుడయినా ఆ పని పూర్తికావడంవలన వచ్చే పరిణామాలను ముందే దృష్టిలో ఉంచుకుని ఆలోచిస్తారో, దూరదృష్టితో పనిచేస్తారో వారు తర్వాత పశ్చాత్తాప పడనవసరంలేదు.

6 బలాబల విచారం – ఎవరైనా ఏదైనా పని చేసేటప్పుడు అందులోంచి బయటపడేమార్గం ఆలోచించిన తరువాత, ఆ పని లాభదాయకమని నిశ్చయించుకున్న తరువాతకూడా ఒక్క విషయం ఆలోచించాలి. 'ఈ పని సాధించడానికి కావలసిన శక్తి నాకు ఉందా?' ఏ పని చేసేందుకైనా ఆ పని చేసేందుకు కావలసిన శక్తి తనవద్ద ఉందా?లేదా? అని ఆలోచించుకుని ముందుకడుగేయాలి. అలా ఆలోచించకుండా ముందుకెళితే మధ్యలో తోక ముడవాల్సి వస్తుంది. వెనుతిరగాల్సి వస్తుంది.

7 విశేషజ్ఞత – ఏ పని చేసేటప్పుడైనా ముందు మంచి–చెడులు నిర్ణయించే వివేకం నేర్చుకోవాలి. మంచి ఏది? చెడు ఏది? ఏ పనివల్ల లాభం? ఏ పనివల్ల నష్టం? అనేది బాగా ఆలోచించాలి. ఆత్మకు లాభం చేకూర్చే విషయాలను, కొంగ్రొత్త జ్ఞానాన్ని సాధించడానికి శక్తి కొలది ప్రయత్నిస్తూ ఉండాలి.

8 గుణ పక్షపాతం – ఏ మనిషిలోనైనా మనకు కనబడే మంచి గుణాలను తప్పకుండా మనం ఆదరించాలి. గుణాలను ప్రేమించే వాళ్ళం కావాలి. మనలో కాని, ఇతరులలో కాని కనబడే గుణాలపట్ల పక్షపాతం కలవాళ్ళం కావాలి. వాటిని సమర్థించే వాళ్ళం కావాలి. మనుషులలో ఉండే దోషాలను కాదు, వారిలో కల గుణాలను తప్పక సమర్థించే వాళ్ళం కావాలి.

ఏ మనిషి తన జీవితంలో ఈ 8 గుణాలను అలవరచుకుంటాడో వాని జీవితం సఫలమవుతుంది. జీవితాన్ని సఫలం, సుందరం, సార్థకం చేసుకోడానికి ఈ 8 గుణాలు సాధించడం, సాధించుకున్న వారిపట్ల నిరంతరం ఆదరణ భావముంచడం చేయాలి.

# 56 అష్ట ప్రవచన మాతలు

సంయమధారులైన (దీక్షితులు) ముని శ్రేష్ఠులు 5 సమితులను, 3 గుప్తిలను నిరంతరం అనుసరిస్తూ ఉంటారు. ఈ సమితులు, గుప్తిలు మునులయొక్క సంయమానికి తల్లులవలె పాలన, పోషణ, అభివృద్ధి చేస్తూంటాయి. అందువలన వీనిని 'అష్ట ప్రవచన మాత'లని చెబుతారు.

శ్రావకులు కూడా వీనిని కోరుకోవాలి. వారు సామాయిక్, పౌషధ్‌లో ఈ అష్ట ప్రవచన మాతలను యథాశక్తి అనుసరించాలి.

**5 సమితులు** – 'సమితి' అంటే ఇక్కడ అర్థం సాధుజీవనానికి తయారుకావడంపై ఆసక్తి, మంచి నడవడిక, జాగృతి కలిగి ఉండడం. ఆ సమితులు –

1 ఈర్యా సమితి – ఏ జీవికి వ్యాకులత చెందే పీడ, దెబ్బ కలుగని విధంగ సావధాన దృష్టితో నాలుగుబారలవరకు దృష్టిని సారించి చూసి నడవాలి.

2 భాషా సమితి – పాపం కలుగని రీతిలో, శాస్త్రాలలో చెప్పబడిన విధి,నియమాల కనుగుణంగ 'ముహపత్తి'ని ఉపయోగించుకుని మాట్లాడాలి.

3 ఏషణా సమితి – ఆహారము, నీళ్లు వీటి విషయంలో శాస్త్రం విధించిన రీతిగ 42 దోషములనుండి నివారింపబడి ఆహార,పానీయాలను స్వీకరించాలి.

4 ఆదానభండ మత్త నిక్షేపణా సమితి – వస్త్రములు, పాత్రలు, ఇతర ఉపకరణములు సంపాదించడం, భద్రపరచుకోవడం, పూజించడం, శుభ్రంచేయడం వంటి క్రియలు.

5 పారిష్ఠాపనిక సమితి – మల,మూత్రములు మొదలగు అశౌచములను శాస్త్రం విధించిన రీతిగ అనుసరించే క్రియ.

**3 గుప్తిలు** – ఇక్కడ గుప్తి అంటే సంయమాన్ని ఉచితమార్గంలో అనుసరించడానికి మంచివైపు మనసు ఆకర్షింపబడి చెడువైపు వెళ్లకుండా ఉండడం.

1 మనోగుప్తి – మనస్సును అశుభములు, చెడ్డ వికల్పములు, తర్కముల ఆలోచనలనుండి నివారించడం, శుభకరమైన ఆలోచనలవైపు మళ్లించడం, ఆకర్షింప చేయడం.

2 వచనగుప్తి – నోటితో అశుభం కాని, చెడును కాని పలుకకుండడం, అవసరముంటేనే మాట్లాడడం, అవసరం లేకపోతే మాట్లాడకపోవడం, పలికితే శుభం పలకడం.

3 కామగుప్తి – శరీరాన్ని అశుభానికిగాని, చెడుకుగాని ఉపయోగించుకో కూడదు. శరీరంతో యథాశక్తి వీలైనంత తక్కువ కార్యకలాపాలు జరపాలి. శరీరాన్ని మంచి పనులకే వినియోగపడేలా చూసుకోవాలి.

# 57 అష్టాహ్నిక మహోత్సవం

అష్టాహ్నిక మహోత్సవం అంటే 8 రోజుల మహోత్సవం అంటే గొప్ప పండుగ.

ఈ 8 రోజులలో తీర్థంకర భగవానుడు ప్రతిరోజూ వివిధ రీతులలో పూజలు చేయబడతాడు. 64 రీతులలో పూజ, 99 రీతులలో పూజ, అంతరాయ కర్మ నివారణ పూజ మొదలైనవి.

ఈ రోజులలో రాత్రి సమయం జిన భక్తి భావనను ప్రకటించే సుమధుర గీతాలను గానం చేస్తారు. ప్రభుభక్తిలో ఉత్సాహాన్ని ప్రకటించడానికి కోలాటం ఆడతారు. అయితే ఇవన్నీ వివేకవంతములుగ ఉండాలి. అవివేక పూర్ణములు కాకూడదు.

ఈ 8 రోజులలో ప్రభుమూర్తిని వేరువేరు రీతులలో పువ్వులు మొదలగు వాటితో అలంకరిస్తారు. ప్రభువు దగ్గర పళ్ళు, నైవేద్యం, దివ్యసామగ్రిలతో సిద్ధపరుపబడిన పాత్రలను ఉంచుతారు. సమయ సమయానికి అక్షతలతో జినరాజు పూజ నిర్వహింప బడుతుంది. ఈ రోజులలో ఏకరీతిగ రోజూ స్వామి వాత్సల్యం (జైన సంఘానికి భోజనం) చేయబడుతుంది.

ఈ రీతిగ 8 రోజులు గడిచిన తరువాత దాన్ని 'అష్టాహ్నిక మహోత్సవం' అంటారు. 5 రోజుల మహోత్సవాన్ని 'పాంచాహ్నిక మహోత్సవం' అంటారు. ఈ విథంగ రెండు,మూడు,పది,పన్నెండు రోజుల మహోత్సవాలు కూడా జరుగుతూంటాయి. జినశాసనంయొక్క ప్రభావన (ప్రచారం,ఔన్నత్యం) దృష్టితో ఇది ఒక గొప్ప కర్తవ్యం.

మహోత్సవంయొక్క పూర్ణాహుతి జరిగిన తరువాత, ఉత్సవ సమాప్తి తరువాత రథయాత్రకూడా దివ్యంగ జరుగుతుంది. ఈ యాత్రతోపాటు ఒక ఖటారీకాని, బండికాని ఉంటుంది. ఇందులో ప్రసాదం,సన్నబూందితో చేసిన లడ్డు ప్లాస్టిక్కు సంచుల్లో సిన్ చేయబడి ఉంటుంది. ఈ ప్రసాదం దారిలో కలిసే బీదలకు వినయంగ పంచడం జరుగుతుంది. దీనివలన ఆ బీదల అంతఃకరణలు కూడా ప్రభుభక్తితో కూడిన మహోత్సవంలో ఆనందభరితములవుతాయి. దీని ఫలస్వరూపంగ వారి ముఖాలనుండి అనాయాసంగ జినశాసనం ప్రశంసింపబడుతుంది. వారికి ఈ జన్మలో కాని, వచ్చే జన్మలో కాని జైనత్వప్రాప్తికి బీజావాపన జరుగుతుంది.

# 58 అష్టవిధ పూజా దోహాలు (ద్విపదలు)

ప్రభువుకి వివిధ రీతులలో అష్టవిధపూజ చేయబడుతుంది. ఈ 5 రీతుల పూజా సమయాల్లో దోహాలు గానం చేస్తారు.

1 జలపూజ – జల్‌పూజా జుగతే కరో మేల్ అనాది వినాశ్
జల్‌పూజా ఫల్ ముజ్ హజో మాగో ఎమ్ ప్రభు పాస్ ॥

మనఃపూర్వకంగ పరమాత్మకు జలపూజ చెయ్యి. భగవానుణ్ణి నీటితో అభిషేకించు. దీనివలన అనాదికాలంగ ఆత్మను అంటిపెట్టుకుని ఉన్న కర్మమైల నాశనమైపోతుంది. జలపూజవలన కర్మమైల నశించిపోవడమనే ఫలితం నాకు లభించింది అని ప్రభువు పాదాలచెంద యాచించు.

2 చందనపూజ – శీతలో గుణ్ జెమా రహ్యో శీతల్ ప్రభు ముఖరంగ్
ఆత్మ శీతల్ కరవా భణీ పూజో అరిహా అంగ్ ॥

చందనంలో శీతలత్వాన్నిచ్చే గుణం ఉంది. ప్రభువుయొక్క ముఖవర్చస్సుకూడా శీతలత్వాన్ని ప్రసాదిస్తూ ఉంటుంది. మీ ఆత్మలను శీతలత్వపరచుకోడానికి అరిహంత భగవానుని అవయవాలకి చల్లని చందనం పూసి అర్చించండి.

3 పుష్పపూజ – సురభి అఖండ కుసుమ గ్రహీ పూజో గత సంతాప్
సమ జంతు భవ్యజ పరే కరీయే సమకిత ఛాప్ ॥

సుగంధయుక్తమైన, మంచిపుష్పాలను తీసుకుని, ఏవిధమైన అన్యాలోచనలు లేకుండా ప్రభువుకి పుష్పార్చన చెయ్యి. ప్రసిద్ధి ఏమిటంటే ప్రభువు అవయవాలపై పడ్డ పుష్పములలో ఏఏ కేంద్రీయ జీవం ఉందో అవి ధన్యములవుతాయి. అంటే ఏదో ఒకనాటికి తప్పక మోక్షాన్ని పొందుతాయి. ఆ జీవులతో సమానంగ పుష్పార్చనద్వారా మీ సమ్యక్త్వ ప్రభావాన్ని గట్టిపరచుకోండి.

4 ధూపపూజ – ధ్యాన్ ఘటా ప్రగటావీయే వామనయన జినధూప్
మిధ్యాత్వ దుర్గంధ దూర్ టలే ప్రగటే ఆత్మస్వరూప్ ॥

జిన ప్రభువుకి ఎడమవైపున నుంచుని ధూపంద్వారా ధ్యానరూపమైన మేఘాలను కల్పించండి. దీనివలన మిధ్యాత్వభావనతో కూడిన దుర్గంధం దూరమవుతుంది ఆత్మ పరిశుద్ధమై స్వాభావిక స్వరూపాన్ని, నిర్మలత్వాన్ని పొందుతుంది.

5 దీపపూజ – ద్రవ్య–దీప్ సువివేకథీ కరతాం దుఃఖో హోయ ఫోక్
భావ–ప్రదీప్ ప్రగట్ హుయే భాసిత లోకాలోక్ ॥

వివేకవంతుడవై ప్రభువు సాన్నిధ్యంలో హారతి ఇవ్వడంవలన సమస్త దుఃఖరాశులు నాశనమైపోతాయి. కేవలం జ్ఞానరూపమైన భావదీపం ప్రకటమౌతుంది. దీనివలన ఆత్మలో సమస్త లోకాలోకాలు ప్రకాశితమౌతాయి.

6 అక్షతపూజ – శుద్ధ అఖండ్ అక్షత గ్రహీ నందావర్త విశాల్
పూరీ ప్రముఖ్ సన్ముఖ్ రహో టాలో సకల్ జంజాల్ ॥

ప్రభువు సాన్నిధ్యంలో పవిత్రమైన, అఖండములైన అక్షతలతో విశాలమైన నందావర్త స్వస్తికాన్ని ఏర్పరచండి. దీనివలన ఉపాధి(ఈదేహం)యొక్క అన్ని జంఝాటాలు పటాపంచలైపోతాయి.

7 నైవేద్యపూజ – అణాహారీ పద్ మే కర్యాం విగ్గహ్ గయియే అనంత్
దూర్ కరీ తే దీజీయే అణాహారీ శివ్ సంత్ ॥

మన అందరి ఆత్మ ఈ జన్మ తరువాత మళ్ళీ ఒకసారో, రెండుసార్లో మళ్ళీ జన్మించాల్సి ఉంటుంది. అప్పుడు మళ్ళీ బహుశః ఆహారం తీసుకోవలసినవాళ్ళమే అవుతాం. కానీ రెండవజన్మలో సరిపోక మూడు,నాలుగు జన్మలైతే వక్రగతిపొంది ఆహారం స్వీకరించని జీవమౌతుంది. నైవేద్యం సమర్పించేటప్పుడు ఏం ప్రార్థించాలంటే 'వక్రగతిలో నా ఆత్మ అనేకసార్లు ఆహారం స్వీకరించని దేహాన్ని పొందే ఉంటుంది. అటువంటి స్థితికి దూరంచేసి నాకు మోక్షాన్ని ప్రసాదించు, అటువంటి ఆహారాన్ని స్వీకరించని స్థానాన్ని ప్రసాదించు, స్వచ్ఛమైన,శాశ్వతమైన మోక్షాన్ని అనుగ్రహించు.

8 ఫలపూజ – ఇంద్రాదిక పూజా భణీ ఫల్ లావే ధరీ రాగ్
పురుషోత్తమ్ పూజీ కరీ మాగే శివ్‌ఫల్ త్యాగ్ ॥

ఇంద్రాది దేవగణములుకూడా హృదయంలో రాగం ఉంచుకుని మంచి ఫలాదులను ప్రభువు సముఖంలో ఉంచి పూజిస్తారు. అందరి పురుషులలో ఉత్తమ పురుషుడైన ప్రభువును పూజించి శివం(మోక్షం) దాని ఫలంగ స్వీకరించు. దయాస్వరూపుడైన ప్రభువును మోక్షఫలం కోసం ఫలములతో పూజించి, యాచించు.

# 59 నవాంగపూజకు దోహాలు

ప్రభువు మూర్తికి తొమ్మిది అంగాలకు పూజసలిపే సమయంలో పాడే దోహాలు–

**1 వేళ్ళు –** జల్‌భరీ సంపుట్ పత్రమాం యుగలిక్ నర్ పూజంత్
ఋషభ్ చరణ్ అంగుఠడే దాయక్ భవజల్ అంత్ ॥

పత్రసంపుటిలో జలాన్ని నింపి స్త్రీలు, పురుషులు జంటలుగ ఋషభదేవ భగవానుని పాదాల వేళ్ళకు జలాభిషేకం చేస్తూంటారు. ఈ విధంగ పూజచేయడంవలన భవసాగరం నశించిపోతుంది.

**2 మోకాళ్ళు –** జానుబలె కాఉసగ్గ రహ్యా విచర్యా దేశ్ – విదేశ్
ఖడా – ఖడా కేవల్ లహ్యుం పూజో జాను నరేశ్ ॥

జినుడు మోకాళ్ళ బలంమీదనే కార్యోత్సర్గ ధ్యానంలో నిలబడగలుగుతాడు. దేశ – విదేశాల్లో సంచరించగలుగుతాడు. ఎవరైతే నిలబడి నిలబడి కేవల జ్ఞానాన్ని పొందగలిగేడో ఆ ఋషభదేవ రాజుయొక్క మోకాళ్ళకు పూజ చెయ్యి.

**3 ముంజేతులు –** లోకాంతిక్ వచనే కరీ వరస్యా వరసీ దాన్
కరకాండే ప్రభు పూజనా పూజో భవి బహుమాన్ ॥

తొమ్మిది లోకాల్లో ఉన్న దేవతలు ప్రార్థించడంతో పరమాత్మ జినుడు చేతులతో వార్షిక మహాదానమిచ్చాడు. అటువంటివాని ముంజేతులకు పూజ చేయాల్సి ఉంది. కాబట్టి ఓ జీవా! నువ్వు మనఃపూర్వకంగ భగవానుని ముంజేతులకు పూజ చెయ్యి.

**4 భుజాలు –** మాన గయుం దోయ అంశ థీ దేఖీ వీర్య అనంత్
భుజావలే భవజల్ తర్యా పూజో ఖంధ్ మహంత్ ॥

భగవానునియొక్క అనంత పరాక్రమంచూసి రెండు భుజాలనుంచి అభిమానం దూరమై పోయింది. జినుని భుజబలంమీద మహాప్రభువు భవసాగరాన్ని దాటిపోయాడు. ఆ మహాత్ముని భుజాలకు పూజ చెయ్యి.

**5 తల –** సిద్ధశిలా గుణ్ ఉజలీ లోకాంతే భగవంత్
వసీయా తేణే కారణ్ భవి శిర్‌శిఖా పూజంత్ ॥

పదునాల్గు రాజలోకాలకి పైన సర్వోన్నత స్థానంలో ఉన్న ఉజ్వలగుణయుక్తుడైన స్ఫటికమయమైన సిద్ధశిలమీద సిద్ధాత్ముడై శాశ్వతుడై ఉన్నాడు. అందువలన ఓ భవిజనులారా! మీరు భగవానుని తలను, శిఖను శ్రద్ధగ పూజించండి.

**6 కపాలం –** తీర్థంకర్ పద్ పుణ్యథీ త్రిభువన్ జన్ సేవంత్
త్రిభువన్ తిలక్ సమా ప్రభు భాల్ తిలక్ జయవంత్ ॥

తీర్థంకరునియొక్క కర్మరూపమైన పుణ్యోదయంచేత తీర్థంకర భగవానుని మూడులోకాల జనులు సేవిస్తున్నారు. అందువలన త్రిభువన తిలకుడైన విజయప్రభువుయొక్క కపాలంమీద తిలకము దిద్దండి.

**7 కంఠం –** సోల ప్రహర ప్రభు దేశ్నా కంఠే వివర్ వర్తుల్
మధుర్ ధ్వని సుర్– నర్ సుణే తిణే గణే తిలక్ అమూల్ ॥

వీరభగవానుని కంఠంయొక్క వివరరూపమైన వర్తులం ద్వారా పదహారు గంటలు ధర్మోపదేశం చేశారు. ప్రభువుయొక్క మధుర ధ్వని దేవ, మనుష్యులందరూ వింటూ ఉండేవారు. అటువంటి ప్రభువుకు కంఠంలో తిలకం దిద్దండి.

**8 హృదయం –** హృదయ కమల ఉపశమ బలె బాలయా రాగ నే రోష్
హిమ దహే వన ఖండనే హృదయ తిలక సంతోష్ ॥

హృదయరూప కమలంలో ఉండే క్షమాభావంయొక్క బలంచేత ప్రభువు రాగద్వేషాలను దహింపచేస్తున్నాడు. పచ్చని చెట్లుకల వనప్రదేశం మంచు విస్తారంగ కురవడంచేత నాశమవుతుందికదా! అటువంటి ప్రభువు హృదయంమీద తిలకందిద్ది సంసారజీవులు సంతోషంపొందుతారు.

**9 నాభి –** రత్న త్రయీ గుణ ఉజలీ సకల సుగుణ విశ్రామ్
నాభి కమలనీ పూజనా కరతా అవిచల ధామ్ ॥

జ్ఞానం,దర్శనం,చారిత్రం రూపమైన రత్నత్రయం మొదలైన సమస్త ఉజ్వల సద్గుణాలకు ఏది విశ్రామ స్థానమో, అట్టి నాభిరూప కమలంయొక్క పూజనంచేత మనకు మోక్షరూపమైన అవిచలధామం ప్రాప్తిస్తుంది.

**ఉపసంహారం –** ఉపదేవక నవ తత్త్వనా తిగె నవ అంగ్ జిణంద్
పూజో బహువిధ రాగశుం కహే శుభ్ వీర్ మునీంద ॥

శ్రీ జినేశ్వర ప్రభువు జీవ–అజీవ మొదలైన తొమ్మిది తత్త్వాలకు ఉపదేశకులు. మునీంద్ర శ్రీశుభవీర చెబుతారు 'శ్రీజినేశ్వర ప్రభువు తొమ్మిది అవయవాలకు అత్యంత భక్తిభావంతో పూజ సల్పాలి'.

# 60 నవ తత్త్వాలు
(సంక్షిప్త స్వరూపం)

ఈ ప్రపంచంలో రెండే ముఖ్య తత్త్వాలు (వస్తువులు) 1. జీవములు(చేతనములు), 2. అజీవములు(అచేతనములు,జడములు). ఈ రెండు తత్త్వాలను గురించి వివరంగ ఆలోచించినప్పుడు వచ్చే తొమ్మిది తత్త్వాలు ఈ విధంగ ఉంటాయి -

1 జీవము - వేనిలో జ్ఞానము, సుఖము-దుఃఖముయొక్క భావాలు, ప్రాణము ఉంటాయో అవి జీవములు. మనుష్య, దేవ, నరకజీవులు, ఏనుగు, గుల్మము మొ.వి.

2 అజీవములు - వేనిలో జ్ఞానము, సుఖము-దుఃఖముయొక్క భావాలు,ప్రాణము ఉండవో అవి అజీవములు. ఇల్లు, బల్ల, పుస్తకం, పీట మొ.వి.

3 పుణ్యం - ఇలాంటి మంచికర్మ దేని ఫలస్వరూపంగ జీవాత్మకు సుఖం, ఆనందం, మనోభీష్ట వస్తువులను ప్రాప్తింపచేస్తుందో అదీ పుణ్యం. శాతావేదనీయకర్మ, యశనామకర్మ మొ.వి.

4 పాపము - ఇలాంటి చెడ్డకర్మ దేని పరిణామ స్వరూపముగ జీవునికి దుఃఖము, శోకము మిగిలిస్తుందో, మనసుకోరే వస్తువులు ప్రాప్తములు కావో అదీ పాపం. అశాతావేదనీయకర్మ, అపయశనామకర్మ మొ.వి.

5 ఆశ్రవ - కర్మబంధానికి ఏది కారణమవుతోందో అంటే కర్మల ప్రవేశానికి ఏది ద్వారమవుతోందో దాన్ని ఆశ్రవ అంటారు. మిధ్యాత్వం, అవిరతి, కషాయం, యోగం, ప్రమాదం మొ.వి.

6 సంవర - ప్రవేశించే కర్మలబంధాన్ని అడ్డుకునేది సంవర. సామాయిక్, అహింస, క్షమ మొ.వి.

7 నిర్జర (కర్మక్షయం) బంధింపబడిన కర్మలు కొద్దికొద్దిగ క్షయమవడం, నాశమవడం నిర్జర అంటారు. తపం, స్వాధ్యాయం, ప్రాయశ్చిత్తంతో కర్మక్షయం అవుతుంది.

8 బంధం - పాలు, నీళ్ళు కలిసి ఎలా ఏకరసమవుతున్నాయో అలాగే అత్మ, కర్మల ఏకాత్మ సంబంధాన్ని బంధం అంటారు.

9 మోక్షం - అన్ని కర్మలు సంపూర్ణంగ, శాశ్వతంగ నాశమవడం, ఆత్మ పరిశుద్ధమైన, నిర్మలమైన సహజ స్వరూపం ప్రకటమవడమే మోక్షం అంటారు. మోక్షాన్నే 'ముక్తి' అని కూడా అంటారు.

# 61 నవ పదములు

(సంక్షిప్త స్వరూపం)

**1 అరిహంత** – అరిహంతకాని మరెవరైనకాని రాగ,ద్వేషరూపమైన ఆంతరిక శత్రువులను జయించారో వారు వీతరాగులు, సర్వజ్ఞులు. వారు సమస్త దోషరహితులై సమస్త గుణయుక్తులవుతారు. వారు జైనశాసనరూపమైన తీర్థానికి సంస్థాపకులు. దేవేంద్రుడు,నరేంద్రులచేతనూ పూజార్హులు. వారికి 12 గుణాలు.

**2 సిద్ధ** – ఎవరైతే సమస్త కర్మలబంధనమునుండి విముక్తులవుతారో వారు సిద్ధ. వారికి తిరిగి మళ్ళీ ఎప్పుడూ జనన–మరణ చక్రంలో పడవలసిన అవస్థరాదు. వారు మళ్ళీ తిరిగి ఈ ప్రపంచంలోకి దిగనే దిగరు. వారు సిద్ధిపదాన్ని పొందుతారు. శరీర రహిత, పరిశుద్ధ, నిర్మల(బుద్ధ) ముక్తులు అవుతారు. వీరికి 8 గుణాలు.

**3 ఆచార్య** – 36 గుణాలతో శోభించేవారిని ఆచార్య అంటారు. వారు చతుర్విధ సంఘములకు (సాధు,సాధ్వి,శ్రావక,శ్రావిక) నాయకుడు. గచ్ఛకు, సమూహానికి పూజ్యుడు. వారు ఆగమశాస్త్రాన్ని (ధర్మశాస్త్రాన్ని), దాని అర్థాన్ని పూర్తిగ తెలిసినవారు. అపార కరుణాసాగరులు.

**4 ఉపాధ్యాయ** – సాధువులకు శాస్త్రగ్రథాలను చదివి వినిపించేవారు ఉపాధాయులంటారు. ఆయన గచ్ఛకు, సమూహానికి బాగోగులు చూస్తూంటారు. వీరి గుణాలు 25.

**5 సాధు** – పంచ మహావ్రతాలను అత్యంత నియమంతో పాటించే వారు సాధు. వారు అత్యున్నతమైన సంయమంతో మానవ జీవనాన్ని తేజోవంతం చేసుకుంటారు. వారు సంయమసాధన చేస్తూనే నిరంతరం మోక్షమార్గంలో ముందుకి సాగుతూ ఉంటారు. వీరికి 27 గుణాలు.

**6 సమ్యక్ దర్శనం** – శ్రీజినేశ్వరదేవుని ద్వారా ఉపదేశింపబడిన జీవ,అజీవ మొదలైన తొమ్మిది పదార్థముల సరసమైన గట్టి జ్ఞానం సమ్యక్ దర్శనం. వీని భేదం 51.

**7 సమ్యక్ జ్ఞానం** – శ్రీసర్వజ్ఞ ప్రణీతమైన ధర్మశాస్త్రములో వర్ణితమైన తత్త్వములయొక్క శుద్ధబోధ సమ్యక్ జ్ఞానం. ఇది ముఖ్యంగ 5 భాగాలు, అనేక ఉప విభాగాలు.

**8 సమ్యక్ చారిత్రం** – శ్రీజినేశ్వరదేవుని ద్వారా ప్రకటింపబడిన సంయమి సాధు లేదా మంచి శ్రావకుడు జీవించవలసిన రీతి సమ్యక్ చారిత్రం. దీని విభాగాలు 70.

**9 సమ్యక్ తపం** – శ్రీజినేశ్వరదేవుల ఆజ్ఞానుసారం ఉపవాసము మొదలైన భాహ్యములు, ప్రాయశ్చిత్తము మొదలైన అభ్యంతర తపస్సులు చేయడం సమ్యక్ తపం. వీనికి 12 భేదాలున్నాయి.

ఈ నవపదములను ఏ భావజ్ఞుడు మనఃపూర్వకంగ ఆరాధిస్తాడో వాని సమస్త ఆపదలను శ్రీపాల్‌రాజా, మయణాసుందరీల ఆపత్తులకు సమానంగ నాశనమైపోతాయి. వారి సమస్త పాపాలు దూరంగ పారిపోతాయి. సర్వత్ర ఆనందం, మంగళం ప్రతిబింబిస్తుంది. అంత్యకాలంలో మోక్ష రూప సుందరి అతనిని వరిస్తుంది. అంటే వారికి మోక్షం ప్రాప్తిస్తుంది.

# 62 నవ పుణ్యబంధాలు

ఈ లోకంలో మనం సుఖాన్ని అనుభవిస్తున్నాం. మన జీవితంలో అనేక మధురానుభూతి సంఘటనలు సంభవిస్తూంటాయి. అనేక విధాలైన సుఖాన్నందించే సామగ్రి మనకు లభిస్తోంది. మనదేశంలో అనేకమంది జనాలు ఆకలితో బాధపడుతూ, దుఃఖిస్తూ అస్థిపంజరాల్లా జీవిస్తున్నారు. వాళ్లు అలా ఉంటే మనకి మాత్రం రెండుపూటలా కడుపునిండా ప్రతిరోజూ భోజనం లభిస్తోంది. ఈ ప్రభావం దేనిది? పుణ్యానిది.

మనకు ఉత్తమమైన మనుష్యజన్మ లభించింది. అంతకంటె ఉత్తమమైన కులంలో జన్మించాం. ఉత్తమ గోత్రం, ఉత్తమ సంస్కారం కలిగిన తల్లిదండ్రులు మనకి లభించారు. అందమైన శరీరం లభించింది. మిక్కిలి ఉత్తమమైన దేవ,గురు,ధర్మం మనకి లభించాయి. అనేక విధాలైన సుఖమార్గాలు మనకి అందుబాటులో ఉన్నాయి. ఇవన్నీ మనకి మన పుణ్యబలంచేత సంపాదించుకున్నవే.

ఒకవేళ మన పుణ్యం సురక్షితంగ లేకపోతే మనం శ్వాసకూడా పీల్చుకోలేం. సుఖంగ జీవించలేం. అందుచేత పుణ్యం సురక్షితంగ ఉంటే మనం సురక్షితంగ ఉంటాం. అంతా సురక్షితం.

మరి ఇలాంటి పుణ్యం ఎలా సాధింపబడుతోంది? ఎలా సంపాదించుకోవాలి? ఈ పుణ్యం తొమ్మిది విధాలుగ సంపాదించబడుతోంది.

1 సుపాత్రులైన,సుయోగ్యులైన వ్యక్తులకు(సాధు,సాధ్వి,శ్రావక,శ్రావిక) బియ్యం పంచడం ద్వారా
2 సుపాత్రుడు, సుయోగ్యుడునైన వ్యక్తికి నీళ్ళివ్వడం ద్వారా
3 ,, నివాసం కల్పించడం ద్వారా
4 ,, సుఖనిద్రకు పక్క,దుప్పటి ఇవ్వడం ద్వారా
5 ,, బట్టలు,వంటపాత్రలు ఇవ్వడం ద్వారా
6 మనసులో మంచి ఆలోచనలు చేయడం ద్వారా
7 ఇతరులకు ఆనందమయ్యేలా నోటితో తియ్యని,హితకరమైన సత్యవచనం పలకడం ద్వారా
8 దేహంతో మంచిపనులు చేయడం ద్వారా
9 సుయోగ్యులు, సమస్కరింపదగిన పెద్దలు – తల్లి,తండ్రి,దేవ,గురు,అధ్యాపక మొ.వారికి గౌరవం వినయం చూపి నమస్కరించడం, సేవించడం ద్వారా

పుణ్యాన్ని సంపాదించుకోడానికి ఈ తొమ్మిది విధాలు చక్కగ ఉపయోగపడతాయి.

ఇక్కడ ఒక్క విషయం స్మరించుకోవాలి. పాపం ఇనుప సంకెళ్ళయితే, పుణ్యం బంగారు సంకెళ్ళు. సంకెళ్ళు ఇనుపవైనా, బంగారువైనా చెడ్డవేకదా! సంకెళ్ళంటే బంధనమేకనుక. పుణ్యం,పాపం ఈ రెండూ మనల్ని ఈ సంసారంతో ముడిపెడుతుంటాయి. మన ఆత్మను మోక్షం పొందకుండా చేస్తూంటాయి. అందువలన చివరకు మనం పుణ్యాన్ని కూడా వదలిపెట్టాలి. ఇలా ఉన్నప్పటికీ ప్రారంభావస్థలో సామాన్య జీవులు పుణ్యాన్ని సంపాదించుకోడం అత్యంత ఆవశ్యకం. పుణ్యం లేకుండా శ్రేష్ఠ మానవజన్మ, ఉన్నతమైన దేవ,గురు ధర్మం. ధర్మాన్ని ఆరాధించడంకోసం ఉత్తమ సామగ్రి మనకి ఎక్కడినుంచి దొరుకుతాయి? ఈ సామగ్రి లేకుండా మనం భవసాగరం దాటి ముక్తి ధామం వరకు, మోక్షం వరకు ఎలా చేరుకోగలం?

# 63 శ్రావకుని వార్షిక పదకొండు కర్తవ్యాలు

శ్రావకుడు ప్రతిసంవత్సరం తన జీవితంలో ఈ క్రింది పదకొండు కర్తవ్యాల (క్రియల) ఆరాధనను తప్పక చేయాలి.

1 సంఘపూజ – సాధు,సాధ్వి,శ్రావక,శ్రావిక ఈ నాలుగు విధాలైన సంఘాలను తన ఇంటికి ఆహ్వానించి వారికి చాలా భక్తితో ఆరాధన చేయాలి. తన శక్త్యానుసారం సాధు,సాధ్వీలకు వస్త్రం,పాత్రలు మొదలైనవి ఇచ్చి భక్తి చూపాలి. శ్రావక,శ్రావికలకు డబ్బు మొదలైనవి ఇచ్చి వారిని సన్మానించుకోవడంద్వారా భక్తి ప్రకటించుకోవాలి.

2 సాధర్మిక భక్తి – జినశాసన ఉపాసకులైన శ్రావకులు,శ్రావికలు వీరికి వినయంతో, అభిమానంతో భోజనం పెట్టడం, వారిని స్వాగతించడం, అవసరమైన వారికి ధనసహాయం చేయడం, వారిని ధర్మం అనుసరించేవారిగ చేయడం, సన్మార్గం వైపు పయనించడానికి వారిని ప్రోత్సహించడం, మనఃపూర్వకంగ వారిపై వాత్సల్యం చూపడం సాధర్మిక భక్తి.

3 యాత్రా త్రిక – 1 అట్ఠాయీ మహోత్సవం – జినేంద్ర ప్రభులకు భక్తి చూపడం, పాటలు పాడుతూ తాళ,వాయిద్యాలు వాయించడం యోగ్యులకు దానాదులు చేసి మహోత్సవం నిర్వర్తించడం.

2 రథయాత్ర – భగవానుని ప్రతిమను రథంలో ఉంచి భవ్యమైన శోభాయాత్ర జరపడం.

3 తీర్థయాత్ర – శత్రుంజయ, గిరనార్, పావాపురి మొ. తీర్థయాత్రలు చేయడం.

4 స్నాత్ర మహోత్సవం – ప్రతిరోజు వీలుకాకపోతే పర్వం రోజులలో, నెలలో శుక్ల పాడ్యమికి, ఉగాదికి, ఎప్పుడు వీలైతే అప్పుడు, కనీసం సంవత్సరంలో ఒక్కసారైనా స్నాత్ర మహోత్సవం చేయాలి.

5 దేవద్రవ్య వృద్ధి – పలు పండుగలు, ఉత్సవాల సమయంలో వాగ్దానం చేసి, దానం నగదుగ ఇచ్చి, పూజ–భక్తి మొదలైనవాని సామగ్రి ఇచ్చి దేవద్రవ్యాన్ని వృద్ధి పరచాలి.

6 మహాపూజ – జినేశ్వర ప్రభువుకి అందంగ అలంకరణ చేయాలి. మందిరాన్నికూడా అలంకరించాలి. నాలుగువైపులా వాతావరణం శోభాయమానంగ ఉండాలి.

7 రాత్రి జాగరణ – ప్రత్యేక మహోత్సవాల సందర్భంలో, గురుమహారాజ్ కాలధర్మం చెందిన నాటి రాత్రి ధార్మికమైన గీతాలను పాడుతూ జాగరణ చేయాలి.

8 శ్రుత పూజ – ధర్మశాస్త్రంలో వ్రాయబడిన రీతిగ, పేర్కొన్న విధంగ వారిని పూజించడం,

సన్మానించడం శ్రుత పూజ.

9 ఉద్యాపన – ఏదైన వ్రతంయొక్క మొదటకాని, చివరకాని చేసే ఉత్సవాన్ని ఉద్యాపన అంటారు. నవపదజీ, వీసస్థానక్ మొదలగు తపస్సుల పూర్ణాహుతి సమయంలో లేదా ఇతర సందర్భాలలో జ్ఞానము,దర్శనము,చారిత్రములకు సంబంధించిన ఉపకరణముల ప్రదర్శనరూపంలో ఉంచడం సమాప్తి ఉత్సవం అని పేర్కొనబడుతుంది. అనంతరం ఈ ప్రదర్శన వస్తువులను పూజ్య గురుదేవులు మున్నగువారికి ఇచ్చివేయాలి.

10 తీర్థ ప్రభావన – తీర్థ ప్రభావన ఎందుకంటే పూజ్య గురుదేవులు పల్లెలోకాని, పట్టణంలోకాని ప్రవేశించడం అంగీకరించి వారి ద్వారా ప్రజల హృదయాలలో జినశాసనం యొక్క మహత్తు హత్తుకునేలా ప్రచారం చేయడం, ప్రసారం చేయడం చేయాలి.

11 శుద్ధి – ఆత్మలో నిలచియున్న దోషాలను గురువు దగ్గర చంటిపిల్లవానిలా దాపరికం లేకుండా వెల్లడించుకోవడం, తన దోషాలకి, పాపాలకి గురువుని ప్రాయశ్చిత్తం కోరడం, వారు ఏ తపస్య మొదలైనవి ఆదేశిస్తారో వానిని ఆచరించడం శుద్ధి.

సామాన్యంగ ఎప్పుడెప్పుడు తప్పులు చేయబడతాయో అప్పుడు లేదా చతుర్దశి (పఖవాడె) రోజున లేదా చాతుర్మాస్య చతుర్దశి రోజులలో కాని కనీసం సంవత్సరానికి ఒకసారి 'సావంత్సరిక ప్రతిక్రమణ' చేయడం ద్వారా అంతకుముందున్న పాపాలను శుద్ధి చేసుకోవాలి.

ఈ విధంగ ప్రతి సంవత్సరం శ్రావకుడు తన పదకొండు కర్తవ్యాలను నిర్మల హృదయంతో అరాధించి తన శ్రావక జీవనాన్ని సార్ధకం చేసుకోవాలి.

# 64 అరిహంత భగవానుని 12 గుణాలు

శ్రీఅరిహంత భగవానునికిగల 12 గుణాలలో 8 ప్రతిహార్యములు, 4 అతిశయములుగ సమ్మిళితములు.

ఎనిమిది ప్రతిహార్యములు -

1 అశోకవృక్షం - ఇది భగవానుని దేహానికి 12 రెట్లు ఎత్తు ఉంటుంది.

2 సురపుష్పవృష్టి - భగవానుడు ఎక్కడ కూర్చుని ధర్మోపదేశం చేశారో, ఆ సమవసరణంలో భగవానుని మోకాళ్లవరకు పంచరంగుల పరిమళపుష్పాలు భగవానునిపై పుష్పవృష్టి కురిసాయి.

3 దివ్యధ్వని - వీణ, బాంసురి మొదలగు సుమధుర వాయిద్యములద్వారా భగవానుని వాణికితోడు దేవతలు మ్రోగించారు.

4 చామరం - దేవసమూహాలు భగవానునికి నాలుగువైపుల నాలుగుజతల తెల్లని చామరములతో గాలి వీచారు.

5 సింహాసనం - దైవభగవానులు ఆసీనులు కావడానికి బంగారుమయమైన రత్నఖచిత సింహాసనం తయారు చేయబడింది.

6 తేజోవర్తులం - భగవానుని శిరస్సు వెనుక ఒక గొప్ప తేజోవంతమైన గుండ్రని కాంతి ఉంటుంది. దాన్ని తేజోవర్తులం అంటారు.

7 దేవ దుందుభి - ఆకాశంలో దేవదుందుభులు మ్రోగించి దేవతలు మానవులకు ఇలా సందేశమిస్తున్నట్లు ఉంటుంది.'ఓ భవ్యజనులారా! మీరు మోక్షనగరంలో ప్రవేశించడానికి ధర్మసారధిగ నిలచిన ఈ ప్రభువును శరణు కోరుకోండి'

8 మూడు ఛత్రాలు - భగవానుని శిరసుపై నాలుగువైపుల బంగారుమయమైన తెల్లని ముత్యాలహారాలతో శోభిల్లుతున్న ఒకటి తరువాత ఒకటి మూడు ఛత్రములు ఉన్నాయి. నాలుగు దిశలను కలుపుకుని ఇలాంటి మొత్తం 12 ఛత్రములు ఉన్నాయి.

4 అతిశయములు -

ప్రభువుయొక్క మిక్కిలి గొప్ప తరగతికి చెందిన మహిమను సూచించడానికి చెప్పబడే లక్షణములు 'అతిశయములు'.

1 అపాయాపగమాతిశయము - ప్రభువుయొక్క ఆత్మకు సమస్త ఉపద్రవములు, రాగద్వేషములు మొదలగు దుర్గుణములు పూర్తిగ సమాప్తమైపోయాయి. భగవానుడు ఎక్కడ సంచరిస్తాడో అక్కడ ఆ ప్రత్యేక దిశలో మొత్తం 125 యోజనాలవరకుగల ప్రదేశంలో అంటురోగాలు, దీర్ఘరోగాలు,అకాలములు వంటి సంకటములు ఏమీ ఉండేవికావు.

2 జ్ఞానాతిశయం - భగవానుడు కేవల జ్ఞాని. ఈ జ్ఞానంయొక్క దివ్యకాంతిలో వారు విశ్వాన్నంతను(లోకాలోకాలను), సమస్త వస్తుజాలాన్ని, వాని అవస్థలను చూసి తెలుసుకోగలిగేవారు.

3 పూజాతిశయం - భగవానుని పూజ, భక్తి లోకంలో పెద్దపెద్ద రాజులు, మహరాజులు, చక్రవర్తులు, దేవలోకంలోని దేవగణాలు, దేవేంద్రుడుకూడా ప్రకటించేవారు. దీని అర్థం భగవానుడు అందరికీ పూజనీయుడు.

4 వచనాతిశయం - భగవానునియొక్క వాక్కు చాలా ప్రభావయుక్తమైనది. అది దేవ,మనుష్య,ఏనుగు,గుఱ్ఱం, ఆవు,ఎద్దు మొదలైన సమస్త ప్రాణులకుకూడా వారివారి భాషలలో అర్థమయ్యేది. రెండో విషయం ప్రభువు వాణి 35 గుణాలతో కూడుకొన్నది.

ఈ విధంగ అరిహంత భగవానుడు 12 గుణాలతోకూడి ఉండడమే కాక 18 దోషాలు లేనివాడుగకూడా ఉన్నాడు.

# 65 12 భావనలు

చక్కగ ఆలోచించడమే భావన. దీని సహాయంవల్లనే లోకంలో ప్రతీ రాగ(మోహ) ఘటన జరుగుతోంది. సంయమ భావం మేల్కొలుపుతుంది. చివరకు ఆత్మకు పరిపూర్ణ శుద్ధస్వరూపం (మోక్షం) ప్రాప్తించేలా చేస్తుంది. ఈ ఆలోచన ఎప్పుడూ మన మనసులో మాటిమాటికి చేస్తే, దానినే అప్పుడు 'భావన' అంటారు. ఈ భావన 12 విధాలు –

1 అనిత్య భావన – డబ్బు, పరివారం, శరీరం, స్త్రీ మొదలైన లోకంలోని సమస్త వస్తువులు ఎప్పుడో ఒకప్పుడు నాశమవుతాయి. అందువలన వాటిపట్ల అనురాగం(మోహం) పెంచుకోడం పాపం. ఇదే అనిత్య భావన.

2 అశరణ భావన – ఈ లోకంలో నాకు దిక్కెవ్వరూ లేరు. ఆశ్రయస్థానమూ లేదు. భార్య,సంతానం,పరివారం,డబ్బు ఇవేవీ యదార్థమైన ఆశ్రయస్థానములు (శరణ్యములు) కావు. యథార్థమైన శరణ్యం కేవలం దైవం,గురువు,ధర్మం మాత్రమే. ఇదే అశరణ భావన.

3 సంసార భావన – ఈ లోకంలో ఈ జన్మలో తల్లి, వచ్చే జన్మలో సంతానమవుతుంది. కొడుకు చనిపోయి వచ్చే జన్మలో భర్త అవుతున్నాడు. భార్య చనిపోయి తల్లిగ జన్మిస్తోంది. తండ్రి చనిపోయి కొడుకుగానో, శత్రువుగానో పుడుతున్నాడు. ఈ విధంగ ఈ లోకం చాలా విచిత్రమైనది. అంతేకాదు, ఈ లోకం రోగం–శోకం, ఔన్నత్యం–పతనం, లాభం–హాని, ఆసక్తి–అనాసక్తి ఇటువంటి వాటితో నిండి ఉంది. ఇలా లోకంలో ప్రతి వస్తువుపై అనురాగం నిరర్ధకమవుతోంది. ఇదే సంసార భావన.

4 ఏకత్వ భావన – నేను ఒంటరిని. నేను ఒంటరిగానే జన్మించాను. ఒంటరిగానే చనిపోతాను. నేను ఒంటరిగానే రోగగ్రస్తుణ్ణి అయ్యాను. ఒంటరిగానే దుఃఖం పొందాను. ఇవన్నీ నేను చేసుకున్న కర్మకు ఫలితాలు. ఈ ఆలోచన చేయగలిగితే ఇప్పుడు,ఇంకెప్పుడూ రాగద్వేసాలకు లోనుకాము. ఇదే ఏకత్వ భావన.

5 అన్యత్వ భావన – నేను(ఆత్మ) నా శరీరంకంటె వేరు. శరీరం నశిస్తుంది. కాని నేను(ఆత్మ) ఎన్నటికీ నశించదు. డబ్బు,కుటుంబం మొదలగు వాటినుండి కూడా నేను వేరు. నేను జ్ఞానవంతుడను. శరీరం జడము. ఆత్మకు శుద్ధ స్వరూపంలో మాత్రమే యదార్థమైన సుఖం ఉంటుంది. లౌకిక విషయాల్లో ఎప్పుడూ శాశ్వత సుఖం లేదు. ఇదే అన్యత్వ భావన.

6 అశుచిత్వ భావన – ఈ శరీరం నిజానికి ఒక మురికి కుండ. రక్తం,మాంసం, మేదస్సు మొదలైన అనేక మురికి పదార్థాలతో నిండివున్న ఈ దేహంపై మమకార మెందుకు? శరీరంపై

మమకారం విడిచిపెట్టి తపస్సు,త్యాగము వీటిని ఆచరించండి. ఇదే అశుచిత్వ భావన.

7 ఆశ్రవ భావన – మిథ్యాత్వం,అవిరతి,కోపం మొదలైన కషాయములు,యోగం వల్ల అశుభకర్మలు జీవుణ్ణి బంధిస్తూంటాయి. వాటి ఫలం దుఃఖభారమే అవుతుంది. దయ,దానం మొదలైన మంచి ఆలోచనలవల్ల శుభకర్మల బంధం ఏర్పడుతుంది. ఈ శుభకర్మల ఫలం శుభదాయకమే అవుతుంది. అందువలన పాపరూపమైన ఆశ్రవముల నుండి మనల్ని మనం రక్షించుకుందాం. ఇదే ఆశ్రవ భావన.

8 సంవర భావన – 5 సమితులు, 3 గుప్తిలు అనుసరించడంద్వారా కర్మబంధం తెగిపోతుంది. ఇలా ఆలోచించి కర్మను అడ్డుకోడానికి ధర్మారాధన చేయడానికి ప్రయత్నిద్దాం. ఇదే సంవర భావన.

9 నిర్జర(కర్మక్షయ) భావన – 12 విధాలైన తపస్సుద్వారా కర్మ నిర్జర(నాశ) మవుతుంది. అందువలన తపస్సుద్వారా కర్మను నాశంచేసుకోడంకోసం ప్రయత్నించాలి. ఎందుకంటే కర్మ నాశంకానిదే మోక్షం లభించదు. ఇదే నిర్జర భావన.

10 లోకస్వభావ భావన – ఈ లోకం 14 రాజలోక జీవులు, పుద్గలములతో నిండి ఉంది. ఈ లోకంయొక్క స్వరూపం ఉత్పత్తి, స్థితి, నాశం ఈ విధంగానే ఉంటుంది. ఇదే లోకస్వభావ భావన.

11 బోధి దుర్లభ భావన – నాలుగు గతులతో కూడిన ఈ లోకంలో పరిభ్రమిస్తూ వేలు,లక్షలు దుఃఖాలను సహిస్తూ జీవాత్మకు జైన ధర్మంలో పుట్టుక లభించడం, సమ్యక్త్వ ప్రాప్తి లభించడం చాలా దుర్లభం. అందువలన దాన్ని పొందడానికి ప్రయత్నించాలి. ప్రాప్తిస్తే దాన్ని సార్థకం చేసుకోవాలి. మనల్ని మనం రక్షించుకోవాలి. ఇదే బోధి దుర్లభ భావన.

12 ధర్మ భావన – ఓహో సర్వజ్ఞ అరిహంత భగవానుడు ఎంత గొప్ప ధర్మాన్ని బోధించాడు. ఎంత చక్కని శ్రుత ధర్మం, చారిత్ర ధర్మం ఉపదేశించాడు. గొప్ప పుణ్యాన్ని పొందగలిగే ధర్మాన్ని నేను శ్రద్ధగ అనుసరిస్తాను. ఆచరిస్తాను. ఇదే ధర్మ భావన.

ఇలాంటి భావనలు(ఆలోచనలు) మనసులో మాటిమాటికి ఆలోచించుకుని మీ జీవాన్ని(ఆత్మని) ధర్మనిష్ఠాభరితం చేసుకోండి.

# 66 తపస్సు 12 విధాలు

దేనివలన ఆత్మ తపింపబడుతుందో అది తపము. తపము పరిశుద్ధుడిని, నిర్మలుడిని చేస్తుంది. వికారాది దుర్గుణాలనుండి దూరం చేస్తుంది. మోక్షమార్గ ఆరాధనలో ముందుకు తీసుకెళుతుంది. బాహ్యతపము 6, ఆభ్యంతరతపము 6గ వెరసి ఈ తపము 12 విధాలు.

బాహ్యతపము – లోకులు బాహ్యరూపంలో తమ కళ్ళతో చూడగలగడం బాహ్యతపం అనబడుతుంది. ఈ తపములో విశేషరీతిలో దేహం తపింపచేయబడుతుంది. ఇది 6 విధాలు –

1 ఉపవాసము – ఆహారం మానివేయడమే ఉపవాసం. ఇందులో నౌకారశీ (పచ్చక్ఖాణ) మొదలుకొని ఆరునెలలదాకా ఉపవాసము ఉంది.

2 ఉణోదరి – తమ నియమిత ఆహారంలో ఎంత తింటారో అందులో అయిదారు ముద్దలు తక్కువ తినడం ఉణోదరి.

3 వృత్తిసంక్షేపం – తినే వస్తువుల సంఖ్యను సమయాన్ని నియంత్రించుకోడం వృత్తిసంక్షేపం. తక్కువ పదార్థాలు, తక్కువ సమయం ఇవి రెండు యథాసంభవములుగ ఉండాలి.

4 రసత్యాగం – వికారమును కలిగించే విలువైన పదార్థములను విడిచిపెట్టడం రసత్యాగం. పెరుగు,నెయ్యి,పాలు,నూనె,బెల్లం,బియ్యం మొదలైన విగయిలలో ఒకటికాని, అన్నిటినికాని త్యజించాలి.

5 కాయక్లేశం – లోచ(కేశ లుంఛనం), విహారం(పాదయాత్ర) మొదలైన శారీరక కష్టాలను సహించడం కాయక్లేశం.

6 సంలీనత – పద్మాసనం మొదలైన ఆసనాల సహాయంతో శరీరంలోని అవయవాలని, ఉపావయవాలని సంకుచిత పరచుకోవడం సంలీనత.

ఆభ్యంతరతపము – చర్మ చక్షువులతో చూడలేనిది ఆభ్యంతరతపము. దీన్ని చూడడానికి అంతచ్చుచువుల ఆవశ్యకత ఉంది. ఈ తపము సూటిగ మనసును,ఆత్మను తపింపజేసి పరిశుద్ధి చేస్తుంది. ఈ తపము 6 విధాలు –

1 ప్రాయశ్చిత్తము – తెలిసో, తెలియకనో చేసిన పాపాలకు పశ్చాత్తాపము పడడంతోపాటు గురువులదగ్గరకు వెళ్ళి తీసుకునే శిక్షను ప్రాయశ్చిత్తం అనే పేరుతో వ్యవహరిస్తారు.

2 వినయం – గురువు ఇతరపెద్దల విషయంలో చూపే గౌరవం,వినయంయొక్క భావనే వినయం.

3 సేవ – సంయమీ తపస్వులు, బాలలు, వృద్ధులు, రోగులు, సాధు,సాధ్వీలకు ఆహారం, బట్టలు, మందులు మొదలైనవి ఇవ్వడం వారికి సేవ.

4 స్వాధ్యాయం – జైనధర్మశాస్త్రాన్ని అధ్యయనం, అధ్యాపనం చేయడం అంటే శాస్త్రాన్ని చదవడం, చదివించడం, చెప్పడం స్వాధ్యాయం.

5 ధ్యానం – ఏకాగ్రతతో తన్మయుడై చింతనం,మననం చేయడం ధ్యానం.

6 కార్యోత్సర్గం – శరీరాన్ని పాపకార్యములనుండి నిరోధించడానికి భావమునుండి కోపము మొదలగువాటిని తొలగించుకోడానికి స్వయంగ నిర్ణయించుకున్న ధ్యానంలో శరీర వ్యామోహాన్ని విడిచిపెట్టడం కార్యోత్సర్గం.

ఈ 12 విధాలైన తపము అనుష్ఠించడంవలన అత్యంత భయంకరములైన పాపకర్మలుకూడా నాశనమైపోతాయి. కర్మక్షయమై ఆత్మ మోక్షాన్ని పొందగలుగుతుంది.

# 67 తీర్థంకరులు 24 గురు

| వరుస | పేరు | పరిచయ చిహ్నం(లాంఛనం) | వర్ణం |
|---|---|---|---|
| 1 | శ్రీ ఋషభదేవ | ఎద్దు | బంగారుఛాయ |
| 2 | శ్రీ అజితనాథ | ఏనుగు | బంగారుఛాయ |
| 3 | శ్రీ సంభవనాథ | గుఱ్ఱం | బంగారుఛాయ |
| 4 | శ్రీ అభినందనస్వామి | కోతి | బంగారుఛాయ |
| 5 | శ్రీ సుమతినాథ | క్రౌంచపక్షి | బంగారుఛాయ |
| 6 | శ్రీ పద్మప్రభస్వామి | కమలం | ఎఱుపు |
| 7 | శ్రీ సుపార్శ్వనాథ | స్వస్తిక్ | సువర్ణచ్ఛాయ |
| 8 | శ్రీ చంద్రప్రభస్వామి | చందమామ | పచ్చన |
| 9 | శ్రీ సువిధినాథ | మకరమచ్చ | పచ్చన |
| 10 | శ్రీ శీతలనాథ | శ్రీవత్స | సువర్ణచ్ఛాయ |
| 11 | శ్రీ శ్రేయాంసనాథ | ఖడ్గమృగం | సువర్ణచ్ఛాయ |
| 12 | శ్రీ వాసుపూజ్యస్వామి | దున్నపోతు | ఎఱుపు |
| 13 | శ్రీ విమలనాథ | పంది | సువర్ణచ్ఛాయ |
| 14 | శ్రీ అనంతనాథ | డేగ | సువర్ణచ్ఛాయ |
| 15 | శ్రీ ధర్మనాథ | వజ్రం | సువర్ణచ్ఛాయ |
| 16 | శ్రీ శాంతినాథ | లేడి | సువర్ణచ్ఛాయ |
| 17 | శ్రీ కుంథునాథ | మేక | సువర్ణచ్ఛాయ |
| 18 | శ్రీ అరనాథ | నందావర్త | సువర్ణచ్ఛాయ |
| 19 | శ్రీ మల్లినాథ | కడవ | నీలం |
| 20 | శ్రీ మునిసువ్రతస్వామి | తాబేలు | నలుపు |
| 21 | శ్రీ నమినాథ | నల్లకలువ | సువర్ణచ్ఛాయ |
| 22 | శ్రీ నేమినాథ | శంఖం | నలుపు |
| 23 | శ్రీ పార్శ్వనాథ | సర్పం | నీలం |
| 24 | శ్రీ మహావీరస్వామి | సింహం | సువర్ణచ్ఛాయ |

ఎవరైతే జినశాసన రూపమైన తీర్థాన్ని స్థాపిస్తారో, అనేక జీవులను ధర్మమార్గ ప్రవర్తకులను చేస్తారో వారు తీర్థంకరులు అనబడతారు. భూతకాలంలో ఇలాంటి తీర్థంకరులు అనంతంగ ఉన్నారు. భవిష్యత్కాలంలోను ఉంటారు. ఈ తీర్థంకరులందరూ ఒకేరీతి ఉపదేశం ఇస్తుంటారు. ఎందుకంటే వీరందరి జ్ఞానం ఒకే విధమైనది.

భరతభూమిలో అలాగే ఐరావతక్షేత్రంలో ఉత్సర్పిణీ, అవసర్పిణీ కాలంలో ఏ తీర్థంకరులున్నారో వారు 24గురు 24గురు సమూహంగ ఉండేవారు. అందుకని వీరిని 24గురు అంటారు.

ప్రస్తుతం ఈ భరతక్షేత్రంలో ఏ చివరి 24గురు సంపన్నులయ్యారో వారిలో చివరివాడు అనగ 24వ తీర్థంకరులు భగవాన్ శ్రీ మహావీర్‌స్వామివారు. మనమందరం వారి శాసనం ప్రకారం శ్రావకులం, శ్రావికలం. ఈ విధంగ మనందరిమీద, అందరికంటె ఎక్కువ కరుణ భగవాన్ శ్రీ మహావీర్‌స్వామివారికి ఉంది.

# 68 తీర్థంకర భగవానుని దర్శనఫలం

శ్రీజినేశ్వర అరిహంత భగవానునికి మనపై అపారమైన కరుణ ఉంది. ఆయన మనకి చాలా గొప్ప ఉపకారం చేస్తున్నాడు. ఆయన మూర్తితో శోభిల్లుతున్న జినమందిరం కృతజ్ఞులైన భక్త శ్రావకుల అంతః కరణకు హద్దులేని భక్తికి ఒక అనుపమాన ప్రతీకగ నిలుస్తోంది. భక్తజీవులు భక్తిరసంలో తమ ఆత్మను పూర్తిగ అవలగ్నం చేసుకుని ఎలాంటి అనుపమాన ఫలాన్ని పొందుతారో దాని సంక్షిప్త స్వరూపం ఇపుడు తెలుసుకుందాం –

1 జినమందిరానికి వెళ్ళాలనే కోరిక కలిగినందుకు ఒకరోజు ఉపవాసఫలం లభిస్తుంది.

2 జినమందిరానికి వెళ్ళడానికి లేస్తే 2 రోజుల ఉపవాసఫలం లభిస్తుంది.

3 జినమందిరానికి వెళ్ళడం ప్రారంభిస్తే 3 రోజుల ఉపవాసఫలం లభిస్తుంది.

4 జినమందిరానికి వెళ్ళడానికి అడుగు కదిపితే 4 రోజుల ఉపవాసఫలం లభిస్తుంది.

5 జినమందిరానికి వెళ్ళేదారిలో ముందుకు సాగితే 5 రోజుల ఉపవాసఫలం లభిస్తుంది.

6 జినమందిరానికి సగందూరం మళ్ళితే 15 రోజుల ఉపవాసఫలం లభిస్తుంది.

7 జినమందిరం కంటికి కనబడగానే 30 రోజుల ఉపవాసఫలం లభిస్తుంది.

8 జినమందిరం చేరగానే 6 నెలల ఉపవాసఫలం లభిస్తుంది.

9 జినమందిరం ప్రవేశించగానే ఒక సంవత్సరం ఉపవాసఫలం లభిస్తుంది.

10 జినేశ్వర ప్రభుకి పరిక్రమ వలన 100 సంవత్సరాల ఉపవాసఫలం లభిస్తుంది.

11 జినేశ్వర ప్రభు దర్శనం వలన 1000 సంవత్సరాల ఉపవాసఫలం లభిస్తుంది.

12 జినేశ్వర ప్రభుకి పూజచేసి, రెండుచేతులతో పుష్పమాలను సమర్పించగానే పైవానికంటె అనేకరెట్లు అధికఫలం లభిస్తుంది.

13 శ్రీజినేశ్వర ప్రభుకి భావయుక్తంగ స్తుతి,స్తోత్రగీతాలు,నృత్యం,స్తవనం చేస్తే అనంతమైన పుణ్యం లభిస్తుంది.

ఒకసారి లంకాధిపతి రావణుడు అష్టాపదపర్వతంమీద జినభక్తియుక్తుడై ఆత్మలో ఐక్యమైపోయాడు. ఆవిధంగానే తాదాత్మ్యంచెందిన అతరి రాణి మండోదరి ప్రభువు ఎదుట చేస్తున్న నృత్యానికి వాద్య సహకారం అందిస్తున్న సమయంలో వీణతీగ తెగిపోయింది. వెంటనే రావణుడు తన పేగుల్లోంచి నరాలను బయటకు లాగి వాద్య సహకారం ఆగకుండా కొనసాగించాడు. జినభక్తిలో కలిగే ఇలాంటి అపూర్వమైన ఏకాగ్రత ప్రభావ స్వరూపంగ రావణచక్రవర్తి తీర్థంకర నామకర్మ సాధించాడు.

రండి, మనంకూడా జినభక్తి మత్తులో ఈ విధంగ తాదాత్మ్యం చెంది భక్తిరసంయొక్క లాభాన్ని చూరగొందాం.

## 69 శ్రీతీర్థంకర భగవానుని అద్భుతరూపం

శ్రీతీర్థంకర అరిహంత భగవానుడు అనంతమైన, అద్భుతమైన రూపంకల స్వామి.

సామాన్యరాజుకంటె అధికమైన గొప్ప రూపం సామంతరాజుకి

సామంతరాజుకంటె అధికమైన గొప్ప రూపం బలదేవునికి

బలదేవునికంటె అధికమైన గొప్ప రూపం వామదేవునికి

వామదేవునికంటె అధికమైన గొప్ప రూపం చక్రవర్తికి

చక్రవర్తికంటె అధికమైన గొప్ప రూపం వ్యంతరదేవునికి

వ్యంతరదేవునికంటె అధికమైన గొప్ప రూపం భవనపతిదేవునికి

భవనపతిదేవునికంటె అధికమైన గొప్ప రూపం జ్యోతిషిదేవునికి

జ్యోతిషిదేవునికంటె అధికమైన గొప్ప రూపం ప్రధమ వైమానికదేవునికి

ప్రధమ వైమానికదేవునికంటె అధికమైన గొప్ప రూపం రెండవ వైమానికదేవునికి

రెండవ వైమానికదేవునికంటె అధికమైన గొప్ప రూపం మూడవ వైమానికదేవునికి

ఈ విధంగ ఉత్తరోత్తర, అధికాధిక గొప్పరూపం 12వ వైమానికదేవునిలో ఉంటుంది. 12వ వైమానికదేవునికంటె సరసమైన రూపం **నౌవేం** గ్రైవేయకదేవులకు, వారికంటె మంచిరూపం అనుత్తరదేవులకు, వారికంటె గొప్పగ, అధికంగ ఆహారక శరీరులకు, అంతకంటె అధికంగ మంచిరూపం గణధరదేవులకు, అంతకంటె మంచి సుందర, అపూర్వ రూపం శ్రీతీర్థంకర అరిహంత భగవానునికి ఉంటుంది.

ఇలాంటి అద్భుతమైన, అనుపమానమైన సుందరరూపానికి స్వామియైకూడా స్వర్గలోకంలోని అప్సరసల ప్రేమపూర్వక హావభావాలకు, అంగవిన్యాసాలకు లొంగక స్థిరంగ, చలించక నిలిచాడు. వీరి రోమాలలో రాగ(మోహ)భావన స్ఫురించనే స్ఫురించలేదు. అటువంటి శ్రీతీర్థంకర అరిహంతదేవునికి మనం అనంతానంత వందనాలర్పిద్దాం. (లలిత విస్తార)

## 70 పదహారుగురు పతివ్రతల పేర్లు

1 బ్రాహ్మి, 2 సుందరి, 3 చందనబాల, 4 రాజీమతీ, 5 ద్రౌపది, 6 కౌసల్య, 7 మృగావతి, 8 సులస, 9 సీత, 10 సుభద్ర, 11 పార్వతి, 12 కుంతి, 13 శీలవతి, 14 దమయంతి, 15 ప్రభావతి, 16 పద్మావతి.

ఈ పదహారుగురు మహాపతివ్రతలు. ప్రతిరోజూ ప్రాతఃకాలం వీరి పేర్లను స్మరించుకోవాలి. దీనివలన మీకు రోజంతా శుభప్రదంగ, ఏ ఆపదలు లేకుండా సాగిపోతుంది.

# 71 తీర్థంకర భగవానుని సాటిలేని బలం

శ్రీతీర్థకర భగవానుని బలంకూడా పోటీ లేనిది.

పన్నెండుగురు వీరయోధుల బలం - ఒక ఆబోతు బలం

| | |
|---|---|
| పది ఆబోతుల బలం | - ఒక గుఱ్ఱం బలం |
| పన్నెండు గుఱ్ఱాల బలం | - ఒక దున్నపోతు బలం |
| ఏభై దున్నపోతుల బలం | - ఒక ఏనుగు బలం |
| ఐదువందల ఏనుగుల బలం | - ఒక సింహం బలం |
| రెండువేల సింహాల బలం | - ఒక అష్టాపద బలం |
| | (అష్టాపద అంటే 8 కాళ్లతో నడిచే జంతువు) |
| పదివేల అష్టాపదుల బలం | - ఒక్క బలదేవుని బలం |
| ఇద్దరు బలదేవుల బలం | - ఒక్క వామదేవుని బలం |
| ఇద్దరు వామదేవుల బలం | - ఒక్క చక్రవర్తి బలం |
| లక్ష చక్రవర్తుల బలం | - ఒక్క నాగలోకస్వామి ధరణేంద్ర బలం |
| కోటి ధరణేంద్రుల బలం | - ఒక్క వైమానిక ఇంద్రుని బలం |
| లెక్కలేని వైమానికేంద్రుల బలం | - తీర్థంకర భగవానుని చిటికినవేలు బలం |

తీర్థంకర భగవానుని ఒక్క చిటికినవేలుకే ఇంత బలం ఉంటే ప్రభువుయొక్క అవయవాలన్నిటిలో ఎంతటి విశిష్టబలం ఉందో, అది ఊహకుకూడా అందనిది.

అటువంటి అనంతమైన, అనుపమానమైన బలంకల స్వామియైయుండికూడా ఒక గోవులకాపరిలా తుచ్ఛ మానవునిద్వారా చేయబడే ఉపద్రవాల్లో అంతులేని సహనగుణంతో లోకంలోని జీవులయెదుట క్షమాధర్మంయొక్క అమరసందేశం వినిపించాడు.

అందుకు

శ్రీతీర్థంకర భగవానుని చరణకమలాలకు మన హృదయపూర్వక కృతజ్ఞతతో

అనంతానంత వందనాలర్పిద్దాం

(కల్పసూత్ర-బాలావబోధ)

# 72 శ్రీభగవాన్ మహావీరదేవుని సంక్షిప్తజీవనం

భగవాన్ శ్రీమహావీరదేవులు వారి వెనుకటి మూడవజన్మలో 'నందన' అను పేరుగల రాజర్షి, ఆయన ఒక లక్ష సంవత్సరాలు ఒక నెల ఉపవాసం, పారణ(సమాప్తి) మళ్ళీ ఒక నెల ఉపవాసం, మళ్ళీ పారణ ఈరీతిగ కఠోరతపస్సు చేశారు. ఆతరువాత మరుజన్మలో ఆయన 'ప్రాణత' పేరుతో పదోదేవలోకంలో జన్మించారు. అక్కడ తన జన్మను పూర్తిచేసుకుని ఆషాఢ శుక్ల షష్ఠి రోజున దేవలోకంనుంచి అవనతులై మొదట దేవనంద–బ్రాహ్మణిల గర్భంలో జనియించారు. ఆతరువాతే త్రిశలాదేవి గర్భంలో అవతరించారు. ప్రభువుయొక్క జననం చైత్రశుక్ల త్రయోదశి రోజున 'క్షత్రియకుండ్' నగరంలో జరిగింది. ప్రభువు కుటుంబంలో ముఖ్య సభ్యులు –

తండ్రి – రాజా సిద్ధార్థ, తల్లి – త్రిశలాదేవి, అన్న – నందివర్ధన, సోదరి – సుదర్శన, భార్య – యశోద, కుమార్తె – ప్రియదర్శన బావమరిది – జమాలి, పినతండ్రి – సుపార్శ్వ, మామ – రాజా చేటక్, వీరుకాక పినతల్లులు ఏడుగురు.

సమ్యక్త్వ ప్రాప్తి తరువాత ప్రభువుయొక్క ప్రధాన జన్మలు 27. అందులో ప్రభువు 14సార్లు మనుష్యజన్మ, 10సార్లు దేవజన్మ, 2సార్లు నారకజన్మ, 1సారి సింహం జన్మ స్వీకరించారు.

ప్రభువు గృహస్థాశ్రమంలో తన 30వ ఏడువరకు ఉన్నారు. దీక్ష స్వీకారానంతరం 121/2 సంవత్సరాలు రహస్య సాధుజీవనం గడిపారు. కేవలజ్ఞానిరూపంలో 29సంవత్సరాల,2నెలల,28రోజులు ఉన్నారు. వారి సంపూర్ణజీవనం 72సంవత్సరాలు. ప్రభువు కార్తీకశుక్ల దశమిరోజున దీక్ష స్వీకరించారు. వైశాఖశుక్ల దశమిరోజున 'ఋజువాలికా' నదీతీరంలో 'శాలివృక్షం' కింద ఆవుపాలు పితికేముద్ర(గోదోహికాముద్ర) ఆసనంలో ఆయన రెండురోజుల ఉపవాసదీక్షలో లీనమయ్యారు. అప్పుడు వారికి కేవల జ్ఞానం సిద్ధించింది. వైశాఖశుక్ల ఏకాదశిరోజున ప్రభువు ధర్మతీర్థాన్ని స్థాపించారు. ఒకేసారి ఇంద్రభూతిగౌతమ మొదలైన వేదశాస్త్రాల్లో పండితులైన 1411మంది పండితబ్రాహ్మణులకు దీక్షాప్రదానం చేశారు. వారిని తమ శిష్యులుగ చేసుకున్నారు. వారిలో 11గురు గణధరులుగ పేర్కొనబడ్డారు. వారు 1 ఇంద్రభూతి గౌతమస్వామి, 2 అగ్నిభూతిస్వామి, 3 వాయుభూతిస్వామి, 4 వ్యక్తస్వామి, 5 సుధర్మస్వామి, 6 మండితస్వామి, 7 మౌర్యపుత్రస్వామి, 8 అంకపితస్వామి, 9 అచలభ్రాతాస్వామి, 10 మేతార్యస్వామి, 11 ప్రభావస్వామి.

ప్రభువు తన పన్నెండున్నర సంవత్సరాల సాధనకాలంలో పదకొండున్నర సంవత్సరాలకంటె అధికకాలం ఉపవాసం చేశారు. ప్రభువుయొక్క ఉపదేశంవలన ఎనమండుగురు రాజులు దీక్ష(సంయమ) స్వీకరించారు. ప్రభువుయొక్క పరివారంలో 11గురు గణధరులు, 14వేల సాధులు, 36వేల సాధ్వీలు, ఒకలక్షా 59వేల శ్రావకులు, 3లక్షల18వేల శ్రావికలు ఉన్నారు.

ప్రభువు ఏడుపేర్లతో పిలువబడుతున్నారు.అవి – 1 వర్ధమానుడు, 2 మహావీరుడు, 3 సన్మతి, 4 కాశ్యప, 5 జ్ఞాతపుత్ర, 6 విదేహ, 7 వైశాలిక.

ప్రభువు శరీరం ఏడుచేతుల ఎత్తు, వారి దేహం సువర్ణచ్ఛాయ.

ప్రభువు నిర్వాణం (మోక్షం) ఆశ్వయుజ అమావాస్య రోజున జరిగింది.

ప్రభువు నిర్వాణమైన 12 సంవత్సరాల తరువాత ప్రథమ గణధర శ్రీగౌతమస్వామి నిర్వాణం జరిగింది.

# 73 శ్రీజినేశ్వరప్రభు గద్య ప్రార్థన

'జయ వీరరాయ' సూత్రంలో వచ్చే 13 కోరికలను సుందరమైన భాషలో కూర్చబడిన గద్య ప్రార్థన -

ఓ వీతరాగ ప్రభూ ! ఓ జగద్గురూ ! నీ ప్రభావంవలన నా మనస్సులో సంసారంపై విరక్తిభావం కలుగుగాక.

ఓ ధర్మదురంధరా ! పరమ దయామయ పరమేశ్వరా ! నీ దయవలన నాకు సమ్యక్ జ్ఞానము, సమ్యక్ దర్శనము, సమ్యక్ చారిత్రము ప్రాప్తించుగాక.

ఓ అభయదాతా ! అరిహంత పరమాత్మా ! మీ అనుగ్రహంవలన నా మనస్సు ధర్మసామాధి పొందడానికి కావలసిన ఇష్టఫలములను నాకు కటాక్షించు.

ఓ విశ్వ వత్సల వీతరాగప్రభూ ! నీ దయవలన నాకు లోకనిందితకార్యాలు చేయకుండ, తల్లి,తండ్రి మొదలైన గురుజనులందరిని గౌరవించి,పూజించే ఆత్మబలాన్ని ప్రసాదించు. పరోపకారం చేయడంలో నిరంతర తత్పరుణ్ణి కావాలి.

ఓ త్రిభువనపతి తీర్థంకరదేవా ! మీ ధ్యానమువలన నాకు ఎప్పుడూ సర్వత్ర సద్గురువుల సాన్నిధ్యం లభించి, వారి ఆదేశములను నేను సంపూర్ణముగ జీవితాంతం పాటించాలి.

ఓ నిరంజన నిర్వికారప్రభూ ! నాకు ఒకే ఒక్క కోరిక ఉంది. మీ మహిమవలన నాకు ప్రతిజన్మలోనూ మీ పాదపద్మముల సేవ చేసుకునే సౌభాగ్యం లభించుగాక.

ఓ శాసననాయక దేవాధిదేవా ! మీకు చేయబడే వందనంచేత -

- నా దుఃఖములు నశించిపోవుగాక.
- నా కర్మలన్నీ నిర్జర(కర్మక్షయ)ములగుగాక
- నాకు నిత్యం సమ్యక్ దృష్టి ప్రాప్తించుగాక
- మరణసమయంలో నాకు సంపూర్ణసమాధి (ప్రభునామస్మరణతో కూడిన చిత్త ప్రసన్నత) లభించుగాక.

ఇది నా మనఃపూర్వక ప్రార్థన.

# 74 పదునాల్గు కలలు

ప్రతి ఒక్క తీర్థంకరుని మాతృదేవి, తీర్థంకరప్రభు తమ గర్భంలో ప్రవేశించే సమయంలో 14 కలలు కంటుంది. ఈ 14 కలలు గొప్ప శుభాన్ని కలిగించేవి. విఘ్నములనే మేఘాల్ని చెదరగొట్టేవి.

ప్రతి ఒక్క తీర్థంకరుని మాత ఈ 14 స్వప్నాలను తమ ముఖంనుండి లోనికి గర్భంలోకి ప్రవేశించడం చూస్తుంది.

ఈ స్వప్నాలను చూసినమీదట తీర్థంకరుల మాతృమూర్తులు తమ శయనగృహం నుండి బయటకు వచ్చి తమ భర్త శయనమందిరానికి వెళ్ళి తాము చూచిన స్వప్న వృత్తాంతాన్ని చెప్పి తమ భర్తలను ఆ స్వప్నాల ఫలాలనుగూర్చి ప్రశ్నిస్తారు.

ఆ 14 స్వప్నాలు ఏవంటే ! ఇవి –

1 ఏనుగు, 2 ఎద్దు, 3 సింహం, 4 అభిషేకం జరిగే శోభ, 5 పుష్పమాల, 6 చందమామ, 7 సూర్యుడు, 8 ధ్వజం, 9 కలశం, 10 పద్మ సరోవరం, 11 సముద్రం, 12 విమానం, 13 రత్నాలరాశి, 14 ధూమరహిత అగ్ని.

మనకయితే ఎలాంటి కలలు వస్తాయంటే 'నేను భారత ప్రధానమంత్రి నయ్యాను' ఇలాంటివి. కాని ఇలాంటి మన కలలనుగూర్చి చెప్పుకోడానికి ఎవరూ దొరకరు. ఒకవేళ ఖర్మకాలి ఎవరేనా దొరికినా వాళ్లు ఇది విని మనల్ని వేళాకోళం చేస్తూ నవ్వుకుంటారు. అయితే ఇక్కడ భగవానునిద్వారా, కాకపోతే భగవానుని మాతృమూర్తి ద్వారా చూడబడిన 14 కలల విషయం జ్ఞానపురుషులు శాస్త్రాలలో లిఖించినవి. కారణం, వారు భగవానుని కన్న మాతృమూర్తులు. గొప్పవనుకునే వానికన్నింటికంటే చాలా గొప్పవి. భగవానుడు గొప్పవాడు. ఆయన తల్లి మహాత్మురాలు. తల్లిద్వారా చూడబడిన స్వప్నాలు ఇక అద్భుతములే ఔతాయికదా !

# 75 పదునాల్గు రాజలోకాలు

జైన శాస్త్రాలలో చెప్పబడిన లోకంయొక్క స్వరూపం పీఠంవైపు చేతులుంచి, కాళ్లుచాపి నిలబడి గిరగిర తిరిగే మనుష్యునిలా ఉంటుంది. ఈ లోకం 14 విభాగాలుగ విభక్తమయింది. వానినే 14 రాజలోకాలు అంటారు. ప్రతి రాజలోకం వంద కోట్లు, వందవందల కోట్లు మైళ్ళకంటె ఎక్కువ పొడవుగ వెడల్పుగ ఉంటాయి.

ఈ లోకాల్లో ముఖ్యంగ మూడు భాగాలు ఉన్నాయి.

1 ఊర్ధ్వలోకాలు(పైనున్నవి) – ఇందులో ప్రధానంగ పలువిధాలైన దేవతలు ఉంటారు. అన్నిటికంటె పైన సిద్ధశీలలో సిద్ధభగవానుడు ఉంటాడు.

2 మధ్యలోకం – ఇందులో ప్రధానంగ మనుష్యులు,పశువులు,కొద్దిమంది దేవతలు ఉంటారు. మనం జంబూద్వీపం, భరతఖండంలో దక్షిణభాగంలో ఉన్నాం.

3 అధోలోకాలు(కింద ఉన్నవి) – ఇందులో ప్రధానంగ ఏడు నరకలోకాలున్నాయి. కొంతమంది దేవతలుకూడా ఇక్కడ ఉంటారు.

చాలా భయంకరమైన పాపాలు చేసినవారు, మాంసాహారులు,విశ్వాసఘాతకులు, క్రూరులైన దొంగలు,అసత్య భాషులు,పశువులను హింసించేవారు అయిన పాపాత్ములు మరణించి నరకలోక జీవులు,తిర్యక్కులు రూపంలో పుడుతూ ఉంటారు. వందల,లక్షల కోట్ల సంవత్సరాలు అంతులేని దుఃఖాలను అనుభవిస్తారు. నరకలోక జీవులతో పోల్చితే తిర్యక్ ప్రపంచం జీవరాశి మొదలైనవాటి దృష్టిలో చాలా నీచములు. ఎందువల్లనంటే అనేకమార్లు అందులోంచి బయటపడి తిరిగి వెంటనే మనుష్యజన్మ నెత్తటం చాలాకష్టం.

# 76 మన లోకం

14 రాజలోకాలకి మధ్యభాగానికి 1800 యోజనాల దూరంలో మనలోకం (మర్త్యలోకం) ఉంది. మర్త్యలోకానికి సరిగ్గా మధ్యలోమధ్య ఒక లక్షయోజనాల ఎత్తైన మేరుపర్వతం ఉంది. దానికి నాలుగువైపుల వర్తులాకారంలో తిరుగుతూ ఒక లక్ష యోజనాల వెడల్పైన జంబూద్వీపం ఉంది. ద్వీపం అంటే నాలుగువైపులా నీరు ఉండి మధ్యలో భూప్రదేశం ఉండడం. మన లోకంలో ఇటువంటి అనేక సముద్రాలు,ద్వీపాలు ఉన్నాయి.

జంబూద్వీపం నాలుగు ప్రక్కల తిరుగుతున్న వర్తులాకార లవణసముద్రం ఉంది. అది రెండులక్షల యోజనాల వెడల్పయినది. దానికి నాలుగువైపుల తిరుగుతూ వర్తులాకార ధాతకీ ఖండద్వీపం ఉంది. ఇది నాలుగులక్షల యోజనాల వెడల్పయినది. ధాతకీఖండానికి నాలుగువైపుల తిరుగుతూ గోళాకార కాలోదధి సముద్రం ఉంది. ఇది ఎనిమిది లక్షల యోజనాల వెడల్పయినది. కాలోదధి సముద్రానికి నాలుగువైపుల తిరుగుతూ గోళాకార పుష్కరవర ద్వీపం ఉంది. అది పదహారులక్షల యోజనాల వెడల్పయినది.

పుష్కరవర ద్వీపానికి సరిగ్గా మధ్యలోమధ్య గోళాకారంగ తిరుగుతున్న మానుషోత్తర పర్వతం ఉంది. ఈ పర్వతం కారణంగ పుష్కరవర ద్వీపం రెండు విభాగాలవుతోంది. ఇందులో లోపలి ఎనిమిదిలక్షల యోజనాలవరకు మాత్రమే మానవలోకం. మనుష్యులు నివసించేది. పుష్కరవరానికి బయటి ఎనిమిదిలక్షల యోజనాలలోను, తరువాత ఉండే అసంఖ్యాక ద్వీపాలలోనూ, సముద్రాలలోనూ ఉండే జీవులకు జన్మమృత్యువులు ఉండవు. ఈ ద్వీప, సముద్ర పంక్తిలో అన్నిటికంటె చివర స్వయంభూరమణమనే సముద్రం వస్తుంది.

జంబూద్వీపం వెనుకు లవణసముద్రం, ఆ పైన ధాతకీ ఖండం, దానిచూట్టూ కాలోదధి సముద్రం, ఆ పైన సగభాగంలో పుష్కరద్వీపం కలుపుకుని రెండున్నర ద్వీపాలు మానవలోకం అవుతుంది.

# 77 దేవ లోకం

దేవలోకంలో దేవతలు నివసిస్తారు. దేవతలు గొప్ప పుణ్యాత్ములై ఉంటారు. వారి దేహాలు అత్యంత సుందరములు, కాంతిమంతములు. మలమూత్రములువంటి ఎటువంటి మలినములు లేనివారు. వందలకోట్ల రూపాయలకంటె అధికమైన విలువగల వలురకాలైన రత్నాలు,వజ్రాలు,మాణిక్యాలు,ముత్యాలతో నిర్మింపబడిన ప్రాసాదాలలో వారు నివసిస్తూంటారు.

వారి వెనుకటి జన్మలో చాలా ధర్మారాధనచేసి పుణ్యం సంపాదించుకున్న జీవులకు దేవలోకంలో దేవతల రూపంలో జన్మ లభిస్తుంది. చాలా ఉన్నత తరగతికి చెందిన సంయమ(సదాచార)యుక్త సాధుజీవనం, శ్రావకుల 12 వ్రతాలను నిర్మల హృదయంతో పాటించే జీవులకు మాత్రమే దేవత్వం ప్రాప్తిస్తుంది. దేవజన్మ లభిస్తుంది. దేవతలు ముఖ్యంగ నాలుగు విధాలు – 1 భవనపతి, 2 వ్యంతర, 3 జ్యోతిష్క, 4 వైమానిక.

ఈ నలుగురిలో ముఖ్యులైన వైమానిక దేవులకు 12 ఉపవిభాగాలున్నాయి. అవి –

1 సౌధర్మ, 2 ఈశాన, 3 సనత్కుమార, 4 మహేంద్ర, 5 బ్రహ్మలోక, 6 లాంతక, 7 మహాశుక్ర, 8 సహస్రార, 9 ఆనత, 10 ప్రణత, 11 ఆరణ, 12 అచ్యుత.

దేవగణాల్లా సుఖసముద్రంలో మునుగుతూ,తేలుతూ లేకపోయినా మనం మానవులం వారితో పోలిస్తే చాలా ఉన్నతులం. ఎందుకంటే మనకి మన జీవితకాలమంతా సంయమపాలన, దేశవిరతిపాలన రూపంలో జిన శ్రేష్టునిపై భక్తి చూపడానికి అవకాశం లభిస్తుంది. అలాంటి అవకాశం దేవగణానికి లభించదు.

సంసారరూపమైన ఎడారిని దాటి వెళ్ళడానికి మానవజన్మరూపమైన ఒంటె కావాలి. మానవజన్మనెత్తి, ఒంటెయొక్క అవయవములన్నీ వక్రములైనా ఎదిరించి ఎలా జీవిస్తోందో అలాగే కష్టపర్వాతాన్ని ఎదిరించి ఎందుకు నిలబడలేకపోతున్నావు? ఈ ఎడారిని దాటే ప్రయత్నంలో చూడ్డానికి సుసంపన్నంగ, సుందరంగ ఏనుగులా కనబడే దేవజన్మ ఎందుకూ పనికిరాదు. ఏనుగు బలమైనదికదా అని ఆబలంతో ఎడారిని దాటగలదా? అలా కాకుండా మానవజన్మరూపమైన ఒంటె ధర్మారాధమనే గొప్ప బలంతో సంసారరూపమైన ఎడారిని చాలా సులభంగ, వేగంగ దాటి మోక్షం పొందగలుగుతుంది.

ఇప్పుడు చెప్పండి. దేవజన్మను తిరస్కరించి, మానవజన్మను అభిలషించడమే ఉత్తమం కదూ?

# 78 నరక లోకం

నరకమంటే భయంకర దుఃఖాలను అనుభవించవలసిన స్థానం. అక్కడ ఇహలోకం కంటె లక్షలు,కోట్లురెట్లు అధిక ఆకలి,దాహం,రోగం,శోకం,ఎండ,చలి,తాపం,చింత,వ్యాధి మొదలైన లక్షలవిధాలైన దుఃఖాలు నరకజీవులు అనుభవించాల్సి ఉంటుంది. 'పరమాధామీ' అనే దేవుడు నరకజీవులకు భయంకరమైన పీడను కలిగిస్తూ ఉంటాడు. వారిని రంపంతో కోస్తూ ఉంటాడు. మరుగుతున్న సీసద్రవాన్ని తాగిస్తాడు. శరీరాన్ని ముక్కలు ముక్కలుగ ఖండిస్తాడు. అయినా నరకజీవులు చావరు. భయంకర రోగాలచే పీడింపబడి, వ్యాకులత ననుభవిస్తూ, ఘోరమైన చీకటికూపంలో పడి ఉన్నప్పటికీ ఈ మిక్కిలి కురూప,నిస్సహాయ నరకజీవులకు తమకు ప్రాప్తించిన జీవనం జీవింపక తప్పదు.

ఈ లోకంలో మిక్కిలి భయంకరమైన పాపకర్మలు – దొంగతనం,అబద్ధమాడడం, విశ్వాసఘాతుకత్వం,క్రూరత్వం,మాంసాహారం,పంచేంద్రియ జీవులహత్య,అత్యంత దురాచారములైన పనులు మొదలైనవి చేసే జీవులకు ఇటువంటి నరకలోకంలో జన్మ పొందాల్సి ఉంటుంది.

ఇలాంటి ఈ నరకం మన భూమికి కింద ఉంది. ఈ నరకాలు ఏడు. అవి –

1 రత్నప్రభ, 2 శర్కరప్రభ, 3 వాలుకాప్రభ, 4 పంకప్రభ, 5 ధూమప్రభ,

6 తమోప్రభ, 7 తమస్తమప్రభ. ఇందులో నివసించే జనులుకూడా ఇలా ఏడు విధాలుగానూ ఉంటారు.

శ్రావకులారా ! మీకు ఇటువంటి భయంకర నరకానికి వెళ్ళాలని లేకపోతే, మీ తల్లిదండ్రులపై వినయం చూపండి. ఎవరికీ చెడు చేయకండి. ఎవరికీ విశ్వాసఘాతుకం చేయకండి. శీతల,మాదక పానీయాలు,మసాలా పదార్థాలువంటి తినకూడని వాటిని తినకండి. సినిమా,టి.వి. చూసి మనసు వికారంవంతం చేసుకోకండి. జినపూజ, సామాయిక్, ప్రతిక్రమణ, గురువందనం, సాధర్మికభక్తి, దీనులు,దుఃఖితులుపట్ల దయ, జాలివంటి ధర్మభావన కలిగి ఉండండి. రాత్రిసమయంలో భోజనం మానండి.

# 79 పదునెన్మిది దోష రహితుడైన అరిహంతస్వామి

దోషాలు 18. వాటిని ఇలా చెబుతారు -

1 చాలా కష్టపడినప్పటికీ చదవడం,వ్రాయడం సరిగ్గా రాదు. అలవడదు. జ్ఞానగ్రహణం లేకపోతే దానిని 'అజ్ఞాన' దోషమంటారు.

2 దేనివల్లనైతే నిద్రవస్తుందో దాన్ని 'నిద్ర' దోషమంటారు.

3 సత్యాన్ని అసత్యంగ, అసత్యాన్ని సత్యంగ అర్థంచేసుకోడం 'మిధ్యాత్వ' దోషమంటారు.

4 కోరిక ఉన్నప్పటికీ వ్రతం-పచ్చక్ఖాణ స్వీకరించలేకపోవడం 'అవిరతి' దోషమంటారు.

5 మనసుకోరే వస్తువులపై ఉండే ఆసక్తి,ప్రేమ 'రాగ' దోషమంటారు.

6 అయిష్టమైన వస్తువు లభించినపుడు దానిపై కలిగే ఏహ్యభావం 'ద్వేష' దోషమంటారు.

7 మంచి మంచి వస్తువులను అనుభవించాలని కోరుకోవడం 'కామ' దోషమంటారు.

8 కారణవశంచేత లేదా నిష్కారణంగ నవ్వడం 'హాస్య' దోషమంటారు.

9 సౌఖ్యవంతములయిన పదార్థములపై ప్రేమభావం కలిగి ఉండడం 'రతి' దోషమంటారు.

10 దుఃఖకరములైన పదార్థములపై అయిష్టత కలగడం 'అరతి' దోషమంటారు.

11 ఏ కారణంవల్లనైతే మనసులో భీతి కలుగుతుందో అది 'భయ' దోషమంటారు.

12 దుఃఖ సందర్భాల్లో ఏడవడం, చాలా దుఃఖపడడం 'శోక' దోషమంటారు.

13 మల,మూత్రములవంటి మలినములను చూడగానే నోరు,ముక్కు మూసుకోవడం, ముఖం రంగులు మారడం 'దుర్గంధ' దోషమంటారు.

14 దగ్గర డబ్బులున్నప్పటికీ, దానంవల్ల వచ్చే ఫలితం ఎఱిగున్నప్పటికీ దానమివ్వడానికి మనసు రాకపోతే 'దానాంతరాయ' దోషమంటారు.

15 ధనం-సంపద, లేదా ధర్మంచేయడానికి అవసరమైన వస్తువులు లభించకపోవడం 'లాభాంతరాయ' దోషమంటారు.

16 అన్నపానీయాలకు లోటులేకపోయినా తీవ్రమైన వ్యాధి కారణంగ తినడానికి,తాగడానికి దూరమైతే 'భోగాంతరాయ' దోషమంటారు.

17 వస్త్రములు,నగలు,ఇల్లు మొదలైనవి ఉన్నప్పటికీ ఏదో కారణంవలన అనుభవించలేకపోవడం 'ఉపభోగాంతరాయ' దోషమంటారు.

18 ఒంట్లో బలం,యౌవనం ఉన్నప్పటికీ తపస్సు మొదలగు ధర్మారాధన చేయడానికి ఉత్సాహం, ఉల్లాసం చూపకపోవడం 'వీర్యాంతరాయ' దోషమంటారు.

మన భగవానునిలో ఈ 18 దోషాల్లో ఏ ఒక్క దోషంకూడా కాగడా పెట్టి వెదకినా కనబడవు. మన భగవానుడు అష్టాదశ దోషరహితుడు. మనం మాత్రం అన్ని దోషాలకు అవకాశం ఇచ్చేవాళ్ళం, నిండి ఉన్నవాళ్ళం. మనం జీవితమంతా కష్ట పడిపడి చనిపోతాం. అయినా ఈ మన దోషాలుమాత్రం నశించవు.

భగవంతుడా ! ఓ భగవానుడా ! నామీద నీ దయావర్షం కురిపించు. దాని మహిమవలన నాలోనుండి అన్ని దోషాలు చుట్టచుట్టుకుని పారిపోవాలి. అలా అయితే మాత్రమే నేను నీలా కాగలను.

భగవానుడా ! నాపై ఈమాత్రం కరుణ చూపవా? చూపిస్తావు కదూ?

# 80 మహాకరుణాసాగరులు అరిహంత భగవాన్

ఒక పెద్ద భయంకరమైన కీకారాణ్యం ఉంది. ఈ అరణ్యంగుండా చాలామంది మనుష్యులతో ఒక గుంపు ప్రయాణంచేస్తోంది. అకస్మాత్తుగ ఒక దొంగలగుంపు వారిమీద దాడిచేసింది. వారు ఆ గుంపులోని వారి అందిరి కళ్ళకు గంతలు కట్టేసారు. చేతులు వెనక్కి విరిచి కట్టేసారు. ఆ తరువాత నెమ్మదిగ ఆ సొమ్ములు దోచుకుని పారిపోయారు.

గుంపులోని జనమంతా భయపడిపోయారు. గాఢాంధకారం అలుముకున్న రాత్రి, కళ్ళకు గంతలు, ఏమీ కనబడటం లేదు. ఏమీ తోచడం లేదు. వాళ్ళని రక్షించడానికి ఎవరూ రావడం లేదు. వాళ్ళందరూ హడలిపోతున్నారు. చచ్చిపోతామనే భయంతో అరవడం మొదలుపెట్టారు. 'రక్షించండి... కాపాడండి...'

ఇంతలో ఈ దుఃఖాత్ముల కరుణాపూరిత ఆక్రందన విని ఎక్కడినుంచో ఒక భగవానునిదాసుడు అక్కడికి వచ్చాడు. వాడు వాళ్ళతో అన్నాడు 'ఏడవకండి. భయపడకండి. నేను వచ్చానుకదా !' మనకి సహాయపడడానికి ఎవరో వచ్చారు అనే ధైర్యంతో ఆ గుంపులోని వాళ్ళంతా భయం వదలిపెట్టారు.

ఆ దేవదాసుడు ఈ జనాలదగ్గరకు వచ్చాడు. వాళ్ళ చేతుల కట్లు విప్పాడు. వాళ్ళ గంతలు ఊడదీశాడు. అప్పుడు వాళ్ళందరూ చూడగలిగేరు, స్వేచ్ఛను పొందారు. ఆ దేవదూత మొదట వాళ్ళకి అభయదానం ఇచ్చాడు. ఆ తరువాత వాళ్ళచూడగల శక్తి వాళ్ళకు ఇచ్చాడు. ఆపైన నగరంవైపు వెళ్ళే దారిని ఆ గుంపుకి చూపించాడు. 'వెళ్ళండి. మీ నగరం చేరే దారి ఇదే' అని వెళ్లమన్నాడు.

కాని ఆ భయంలోంచి పూర్తిగ బయటపడని ఆ గుంపులోని జనాలు 'మేము ఒంటరిగ ఎలా వెళ్ళగలం? మాకు చాలా భయంగ ఉంది.' అన్నారు. అప్పుడు ఆ దేవదూత వారికి శరణమిచ్చాడు. వారికి తోడు నిలిచాడు. అంతేకాక ఆ దేవదూత తన వద్దనున్న ఆహారాన్ని వాళ్ళకిచ్చి తినమన్నాడు. ఆకలితో ఉన్న ఆ జనం కడుపునిండా ఆ ఆహారాన్ని భోజనం చేశారు. అపుడు వాళ్లందరూ దేవదూత రక్షణలో నగరంవైపు ప్రయాణం కొనసాగించారు.

అందరూ వాళ్లవాళ్ల మనసుల్లో అనుకుంటున్నారు 'ఈ దేవదూత నిజంగ భగవానుడే.' ఔను. ఈ చిన్న కథ మన భగవానుడు జినేశ్వరదేవునియొక్క అపారకరుణను తెలియజేయడానికే ఇక్కడ చెప్పబడింది.

ఈ సంసారం ఒక భయంకర కీకారణ్యం. మనం ఈ అరణ్యంలో తిరుగుతూ దారితెలీక చక్కర్లు కొడుతున్నాం. అక్కడే మోహరూపమైన గూండాలు మనమీద దాడి చేస్తున్నారు. వాళ్లు మన కళ్ళకి మిధ్యాత్వ(మోహ)మనే గంతలు కడుతున్నారు. మన సత్యశ్రద్ధ(సమ్యక్ దర్శనం) లాగేసుకుంటున్నారు.

ఇటువంటి భయానకస్థితిలో మనకు దేవదూతవలె అరిహంతభగవానుడు దొరుకుతాడు. ఆయన

'నేను ఉన్నాను కదా ! భయపడకండి' అంటాడు. భగవానునియొక్క అస్తిత్వమే మనకు అభయదానం ఇస్తోంది. భగవానుడు ఉన్నాడనుకున్నంతనే మనకు కావలసినంత విశ్రాంతి అనుభూతి లభిస్తోంది. భగవానుడు మన కళ్ళకు,చేతులకు కట్టిన మోహబంధాలను విడగొడుతున్నాడు. మనకి సమ్యక్ జ్ఞానం ప్రసాదిస్తున్నాడు. లోకాన్ని గుర్తించడానికి ఆయన మనకి మంచి కళ్ళను,చూపును ప్రసాదిస్తున్నాడు. అంతేకాదు, ఆయన మనకి మోక్షప్రాప్తికి మార్గం(సాధుధర్మం) చెబుతున్నాడు. ధర్మానుజ్ఞనిచ్చి ఆయన మనవెంటే నిలుస్తున్నాడు. మనకి శరణమిస్తున్నాడు. ఆయన మనం దీక్షామార్గంలో నడిచేలా మొదటి భోజనంకోసం ఆహారం(సమ్యక్ దర్శనం) ఇస్తున్నాడు.

ఓహో ! ఎంతటి దయాసముద్రుడు శ్రీజినేశ్వరభగవానుడు. జగత్తులోని సమస్త జీవులకు మోక్షం పొందడానికి వీలుగ భవ్యకరుణాళువై శరణులైన భక్తుల అంతఃకరణలో ఆయన నిలిచి ఉంటున్నాడు. ఇలాంటి మహామహిమాన్వితుడు, కరుణాసాగరుడు లోకంలో ఎక్కడైనా, మరెక్కడైనా ఉన్నాడా? లేడు. లేనేలేడు.

# 81 భగవానుని 18 దోషాల నివారణ

జ్ఞానావరణీయ, దర్శనావరణీయ, మోహనీయ. అంతరాయ ఈ నాలుగు విశ్వాసఘాతుక కర్మలు ఈ నాలుగు నాశనమైతే జీవుడు కేవలి, సర్వజ్ఞ భగవానుడు కాగలుగుతాడు.

1 జ్ఞానావరణీయ కర్మ నశించడం వలన 'అజ్ఞాన' దోషం నశిస్తుంది.

2 దర్శనావరణీయ కర్మ దూరంకావడం వలన 'నిద్ర' దోషం నశిస్తుంది.

3 మోహనీయ కర్మ నష్టంకావడం వలన 'మిధ్యాత్వ,అవిరతి,రాగ,ద్వేష,కామ, హాస్య,రతి,అరతి,భయ,శోక,దుర్గంధ ఈ పదకొండు దోషాలు దూరమవుతాయి.

4 అంతరాయ కర్మ దూరంకావడం వలన 'దానాంతరాయం, లాభాంతరాయం, భోగాంతరాయం, ఉపభోగాంతరాయం, వీర్యాంతరాయం ఈ ఐదు దోషాలు దూరమౌతాయి.

ఈ విధంగ నాలుగు విశ్వాసఘాతుక కర్మలు నష్టమైపోయినప్పుడు సర్వజ్ఞ భగవానుని అన్ని దోషాలు అనగా 18 దోషాలు నష్టమైపోతాయి.

## 82 పదునెన్మిది పాపస్థానములు

వేనిద్వారా జీవుడు దుష్టమైన చెడుకర్మలను ఆచరిస్తున్నాడో అవియే పాపకర్మలు. వేనిని సంపాదించడంవలన జీవుడు అత్యంత భయంకరమైన దుఃఖాలను,బాధలను అనుభవించవలసివస్తున్నదో అవియే పాపములు. అటువంటి పాపములు ముఖ్యంగ 18 విధములు.

పాపములను సంపాదించుకునే స్థానములను 'పాపస్థానములు' అంటారు.

ఇవి మొత్తం 18 –

1 ప్రాణాతిపాతం – జీవులను హింసించడం.

2 మృషావాదం – అసత్యం పలకడం.

3 అదత్తాదానం – దొంగతనం చేయడం.

4 మైధునం – అధర్మంగ ప్రవర్తించడం.

5 పరిగ్రహం – ధనం,ధాన్యం,సంపద కూడబెట్టడం.

6 క్రోధం – కోపపడడం.

7 మానం – అభిమానం లేదా అహంకారం.

8 మాయ – మోసం చేయడం.

9 లోభం – లోభపడడం.

10 రాగం – ఆసక్తి,మోహపడడం.

11 ద్వేషం – ద్వేషం,తిరస్కరించడం.

12 కలహం – దెబ్బలాడడం.

13 అభ్యాఖ్యానం – ఇతరులపై కళంకం ఆపాదించడం.

14 పిశునత్వం – ఇతరులపై చాడీలు చెప్పడం.

15 రతి–అరతి – సుఖం కలిగితే ఆనందించడం (రతి).

కష్టంవస్తే ఏడవడం (అరతి)

16 పరపరివాదం – ఇతరులను నిందించడం.

17 మాయామృషావాదం – మోసంచేసి అబద్ధం చెప్పడం.

18 మిధ్యాత్వశల్యం – సత్యాన్ని అసత్యంగ, అసత్యాన్ని సత్యంగ భావించడం.

(దుష్టదైవం, దుష్టగురువు, దుష్టధర్మంమీద విశ్వాసముంచడం)

మనం జీవితంలో సుఖపడాలనుకుంటే పాపాలను చేయనేకూడదు. ఎప్పుడు మనం పాపాలను విడిచిపెడతామో అప్పుడు దుఃఖమూ మనలను విడిచిపెడుతుంది. అపుడు ఇక మిగిలేది అంతా సుఖమే.

# 83 మధుబిందువులా సంసారం

ఒక మనుష్యుడున్నాడు. అనుకోకుండా వాడు తనమిత్రులకు దూరమయ్యాడు. ఒక భీకర కీకారణ్యంలో దారితప్పి ఒంటరిగ తిరుగుతున్నాడు. ఇంతలో వాడి వెనుక యముడిలా ఒక నల్లని ఏనుగు వెంటపడింది. ఆ మానవుడు హడిలిపోయాడు. దానితో పరుగెత్తడం లంకించుకుని అలా పరుగెడుతూనే ఉన్నాడు. ముందేమో భయంతో పరుగెత్తే మనిషి, వెనకేమో తరుముకొస్తున్న అడవి ఏనుగు. వాడు బాగా అలిసిపోయాడు.

ఇంతలో దారిలో ఒక వటవృక్షం వాడి కంట పడింది. వెంటనే ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఆ చెట్టునెక్కి చిటారుకొమ్మన కూర్చున్నాడు. వెనకనే ఆ ఏనుగూ అక్కడికి చేరుకుంది. అయతే ఆ ఏనుగు తొండానికి ఆ మనుష్యుడు అందడంలేదు. దానితో కోపం కట్టలుతెగిన ఆ ఏనుగు వటవృక్షాన్ని తన తొండంతో చుట్టి గట్టిగ కుదపడం ప్రారంభించింది. దీనితో చెట్టుకొమ్మమీద ఉన్న మనుష్యునికి పట్టుతప్పింది. ఒక్కసారిగ కిందపడ్డాడు. అదృష్టవశాత్తు వాడి చేతికి ఒక మఱ్ఱిఊడ పట్టుదొరికింది. అది పట్టుకుని ఊగిసలాడుతున్నాడు. ప్రాణభయంతో వణికిపోతున్నాడు.

అనుకోకుండా ఒకసారి కిందకు చూసాడు. ఇంకేముంది కింద అగాధమైన పెద్దగొయ్యి, అందులో నోళ్ళు తెరుచుకుని నాలుగు నల్లత్రాచులు. ఆ నాలుగు నల్లత్రాచులు తమ పొడవైన నాలుకలు బయటకు చాపి వాణ్ణి కరవడానికి సిద్ధంగ ఉన్నాయి. ఇది చాలదన్నట్టు ఇంకోప్రక్క వాడు ఏ ఊడనైతే పట్టుకుని వేలాడుతున్నాడో ఆ ఊడ చివర రెండు ఎలుకలు ఉన్నాయి. ఒకటి నల్లనిది, రెండోది తెల్లనిది. ఆ రెండూ ఊడను కొరుకుతున్నాయి. ఇదంతా చూసి ఆ మనుష్యుడు ఎంత గాబరాపడ్డాడు, ఎంత భయపడ్డాడు మాటల్లో చెప్పలేం.

ఒకపక్క తరుముకొచ్చిన వేట(మనుష్యుడు) దొరక్కపోవడంతో ఏనుగు కోపం నసాళానికి అంటింది. దానితో అది మళ్ళీ ఆ వటవృక్షాన్ని గట్టిగ కుదపడం మొదలెట్టింది. దాని పరిణామంగ ఆ చెట్టుపై ఉన్న తేనెపట్టు కదలి తేనెటీగలు నాలుగు వైపులకీ వ్యాపించాయి. ఊడ పట్టుకుని వేలాడుతున్న ఆ మనుష్యుణ్ణి కుట్టికుట్టి గాయపరచసాగాయి. దానితో ఆ మానవుడి పరిస్థితి మరీ ఘోరంగ తయారయింది. నాలుగువైపుల వత్తిడి,దుఃఖం,బాధ,అయోమయత్వం,భయంకరమైన వేదన,అంతులేని వ్యధ. ఇంకేం ఉండాలి.

ఇంతలో ఏనుగు గట్టిగ ఊపడంచేత తేనెపట్టు నలిగి, తేనెటీగలు కూడబెట్టిన తేనెబిందువులు నేరుగ ఊడపట్టుకుని వేలాడుతున్న ఆ మనుష్యుడి నోట్లో పడడం మొదలెట్టింది. ఓహో! ఎంత చక్కని ఆహారం. ఎంత మధురం. ఎంత తియ్యన. ఇంత కష్టంలోనూ ఉన్న ఆ మానవుడు కొంచెంసేపు ఆ తేనె తియ్యదనానికి అన్నీ మరిచిపోయాడు.

సరిగ్గ అదే సమయంలో ఒక విద్యాధరుడు తన విమానంలో కూర్చుని ఆకాశమార్గంలో వెడుతున్నాడు. అతడు ఈ మనుష్యుని దురవస్థను చూసాడు. అతని మనసులో వీడిపై జాలి కలిగింది. అతడు తన విమానాన్ని కిందకు దింపి, ఆ మనుష్యుని దగ్గరగ పోనిచ్చి ఆ మనిషితో 'చూడు సోదరా! భయపడకు. నేను నిన్ను ఈ దుఃఖాన్నుంచి గట్టెక్కించడానికే వచ్చాను. నువ్వు వెంటనే ఒక్క గెంతుగెంతి విమానంలోకి వచ్చెయ్యి. నేను నిన్ను కాపాడుతాను.' అన్నాడు.

ఎంత విలక్షణమైనవాడు ఈ విద్యాధరుడు. ఎంత సుందరమైనది వాని కరుణాహృదయం. అతని విమానం ఎంత చక్కనిది. ఇదంతా చూసి ఆ మనుష్యుడు నమ్మలేకపోయాడు. సరిగ్గ అదే సమయానికి తేనెపట్టునుండి మరొక తేనెచుక్క కిందపడ్డానికి సిద్ధంగ ఉంది. అందుకని ఆ మనుష్యుడు విద్యాధరునితో అన్నాడు 'ఇదుగో ఈ తేనెచుక్కకూడా తాగేసి నీతో వచ్చేస్తాను' అన్నాడు.

విద్యాధరుడు ఆగేడు. తేనెచుక్క కింద పడింది. మనుష్యుడు ఆ తేనెచుక్కను స్వీకరించాడు. కాని ఇంకో తేనెచుక్క అక్కడ సిద్ధంగ ఉండడం కనబడింది. అది చూసి విద్యాధరుడు అన్నాడు 'ఇప్పుడు ఆ తేనెచుక్కకూడా తాగాలనే లోభం విడిచిపెట్టు. నీ దురవస్థను గురించి ఆలోచించు. ఆలస్యం చెయ్యకు. నా విమానంలోకి వచ్చెయ్యి.' అన్నాడు. అయితేనేం ఆ మనుష్యుడు తన లోభాన్ని విడిచిపెట్టలేక పోయాడు. వాడు ప్రతిసారీ 'ఇదుగో వచ్చేస్తున్నా! ఈ ఒక్క తేనెచుక్కే ! ఇదుగో ఇది ఒక్కటే !' అంటూ అంటూ వాడు ఎన్నో తేనెచుక్కలు అనుభవించాడు.

చూసి చూసి విద్యాధరుడు విసుగెత్తిపోయాడు. చెప్పి చెప్పి అలసిపోయాడు. చివరికి వాడిని విడిచిపెట్టి తనదారిన తాను వెళ్ళిపోయాడు. తేనె మాధుర్యానికి లోభపడిన ఆ మనుష్యుడు పట్టుకున్న ఊడని తెల్లని,నల్లని ఎలుకలు తెగేదాకా కొరికాయి. దానితో ఆ మనుష్యుడు దభేలున కింద గోతిలో ఉన్న పాముల మధ్యన పడ్డాడు.

ఇది ఒక కథ. అరణ్యంతో సమానమైనదీ సంసారం. ఆ మనుష్యుడు ఎవరోకాదు. మన జీవుడే. కాల ఏనుగు మృత్యువు. అగాధమైన గోతిలో ఉన్న నాలుగు నల్లత్రాచులు మనిషి నాలుగు అవస్థలు. వేలాడుతున్న మట్టి ఊడ జీవనకాలం. తేనెటీగలు గాయపరచడం రోగం,శోకం,బాధ మొదలైన దుఃఖాలు. తేనెచుక్కల వంటివే సంసారంలో వచ్చే క్షణిక సుఖాలు. విద్యాధరుడే సద్గురువు.

సద్గురువు జీవుణ్ణి అనేక విధాల మేలుకొలుపుతాడు. కాని జీవుడు 'ఇంకా మరికొద్ది సంవత్సరాలు సంసార జీవన ఆనందాన్ని అనుభవించనీ, అపుడు దీక్ష స్వీకరిస్తాను. అపుడు ధర్మసాధన చేస్తాను' అంటాడు. ఇలా అంటూ అంటూ శుక్లపక్షరూపమైన తెల్లఎలుక, కృష్ణపక్షరూపమైన నల్లఎలుక జీవుని జీవనకాలరూపమైన మట్టి ఊడను కొద్దికొద్దిగ కొరకడం ప్రారంభిస్తాయి. ఆయువు తరిగిపోతూ ఉంటుంది. కాని జీవునికి తేనెబిందువులాంటి సంసార సుఖాలమీద లోభం జారిపోదు. మళ్ళీ మళ్ళీ సద్గురువు హెచ్చరిస్తూనే ఉంటాడు. చివరికి సంసార రసికుడైన జీవుడు నాలుగు అవస్థల (బాల్య,యౌవన,కౌమార,వార్ధక్య) రూపమైన నాలుగు నల్లత్రాచుల నోట్లోపడి అనంత దుఃఖాలను అనుభవిస్తాడు.

మిత్రులారా ! మనం సరైన సమయంలో జాగ్రత్తపడాలి. ఆ మనుష్యునిలా తేనెచుక్కల మోహంలో ఎన్నడూ పడకూడదు. అటువంటి మూర్ఖత్వం మీరెన్నడూ పొందకండి. నేటినుండి, ఈ క్షణంనుండి ధర్మారాధన ప్రారంభించడానికి సన్నద్ధులుకండి.

ధర్మారాధన ఈ మూడు గుణాలతో ప్రారంభమవుతుంది –

1 పాపానికి చాలా భయపడండి. పాపం చాలా చెడ్డది. పాపం నల్లత్రాచుకంటె భయంకరమైనది. ఇలాంటి ఆలోచన నిత్యం మనసులో ఉంచుకుని పాపానికి దూరంగ ఉండండి.

2 సంసారం,సంసార సుఖాలు – ఈ సుఖాలపట్ల రాగం వీనిని ఎల్లప్పుడూ మంచివికావని గ్రహించండి. వీటిపట్ల మనసులో అనాసక్తి ప్రకటించండి. ఈ అరుచిని క్రమంగ పెంచుకుంటూ వెళ్ళండి.

3 తల్లి,తండ్రి,అధ్యాపకుడు,పెద్దలు,వృద్ధులు పాదాలకు నిత్యం శిరసువంచి నమస్కరించండి, సద్గురువులకు పాదాభివందనం చేస్తూ ఉండండి.

వీటి అన్నిటిపైన మనసులో ఆదరభావం పెంచుకుంటూ ఉండండి. వినయభావంతో వీటన్నిటినీ గౌరవించండి, స్వీకరించండి.

## 84 సమవసరణ

తారకుడు,ఉద్ధారకర్త అయిన భగవానుడు ధర్మదేశనా(ధర్మోపదేశం) ఇస్తున్నప్పుడు దేవగణం తమ విశిష్ట శక్తితో 'సమవసరణ' రచన చేస్తారు. 'సమవసరణ' అంటే భగవానుని వాణి వినడానికి వచ్చే పుణ్యాత్ములకొరకు మూడుదుర్గాలతోకూడిన ప్రాకార నిర్మాణం.

ఈ 'సమవసరణ' ఆకారంలో గుండ్రంగ సమతలంగ ఉంటుంది. దీనికి మూడు దుర్గాలుంటాయి. మొదటి దుర్గం వెండితోను, రెండవ దుర్గం బంగారంతోను, మూడవ దుర్గం అనేకజాతుల రత్న,మాణిక్యాలతోను కూడి ఉంటుంది.

మొదటి దుర్గప్రదేశం దేవతలయొక్క,మనుష్యులయొక్క వాహనాలకోసం సురక్షితమైనది. రెండవ దుర్గప్రదేశం పశువులు,పక్షులకోసం ప్రత్యేకించబడింది. మూడవది అన్నిటికంటె పైనున్న దుర్గప్రదేశం దేవతలు,మనుష్యులు కూర్చోడానికి ఏర్పరచబడింది. భగవానుడుకూడా ఈ మూడవదుర్గంలోనే కూర్చుని ధర్మోపదేశం చేస్తూంటాడు.

భగవానుడు తూర్పుదిక్కుగ ముఖంపెట్టి కూర్చుంటాడు. మిగిలిన మూడు దిక్కులలో భగవానుడు ఎలా ఉంటాడో అలాంటి ప్రతిబింబ భగవానులు ఏర్పాటు చేయబడతారు. ఈ ప్రతిబింబాలు ఎంత సహజంగ ఉంటాయంటే ఎవ్వరూకూడా అసలు భగవానుడెవ్వరో ఆయన ప్రతిబింబములు ఏవో కొంచెంకూడా గుర్తించలేరు.

ఈ 'సమవసరణ'లో కూర్చుని భగవానుడు త్యాగం,విరక్తి గురించి రసధార ప్రవహిస్తోందా అన్నట్టు అద్భుతమైన,అనుపమానమైన,అమోఘమైన ధర్మోపదేశం మాల్‌కోస్ రాగంలో ప్రవహింపచేస్తాడు.

'సమవసరణ' ప్రథమ దుర్గమునకు పదివేలమెట్లు, రెండవ దుర్గమునకు ఐదువేల మెట్లు, మూడవ దుర్గమునకు ఐదువేల మెట్లు ఉంటాయి. ఇన్ని మెట్లున్నా భగవానుని అత్యంతమైన ప్రభావం కారణంగ భక్తగణం ఈ మెట్లన్నిటినీ అనాయాసంగ, సునాయాసంగ, సులభంగ ఎక్కేస్తారు. వాళ్ళకి ఏమాత్రం అలసటభావంకూడా కనబడదు.

## 85 నవకార మంత్ర మహిమ

శ్రీ నవకార(నమస్కార) మహామంత్రం జైనధర్మంలో చెప్పబడే మూలభూతమైన, అనుపమానమైన అమూల్య మంత్రం. లోకంలోని సమస్త మంత్రాలలోను ఈ మంత్రం సర్వశ్రేష్ఠమైనది. అందువల్లనే దీనిని 'మంత్రాధిరాజము' అంటారు.

ఎవరైతే నవకారమంత్రాన్ని పరిపూర్ణ భక్తిభావనతో జపం చేస్తారో, వారికి ఉన్న అనుపమాన శ్రద్ధ కారణంగ భగవానుడు వారి శరణు స్వీకరిస్తాడు. వారి సమస్త విఘ్నాలు తొలగిపోతాయి. అన్ని పాపాలు నశించిపోతాయి. పుణ్యం సంపాదింప బడుతుంది. వారు నిత్యం సుఖాలను అనుభవిస్తారు. నవకార మంత్రంలో 68 అక్షరాలున్నాయి. 8 విరామ స్థానాలున్నాయి.

జీవితంలో ప్రతియొక్క మంచిపనిని ప్రారంభించేటప్పుడు ఈ మహామంత్రంయొక్క జపం(స్మరణ) చేయాలి. నవకార మంత్రంయొక్క జపం చాలా శ్రద్ధగ,స్పష్టంగ,భావ పూర్వకంగ చేయాలి.

ప్రతియొక్క జైనుడు ప్రతిరోజూ కనీసం 108 సార్లు నవకారమంత్రం జపం చేయాలి. ఉదయం లేస్తూనే 12 సార్లు, రాత్రి పడుకొనేటప్పుడు 7 సార్లు నవకార మంత్రం తప్పక జపం చేయాలి.

శ్రీనవకార మంత్రంపై చూపే అద్భుతమైన శ్రద్ధ,భక్తి కారణంగ బాలకుడైన అమరకుమారునికి అగ్నికుండ స్థానంలో స్వర్ణసింహాసనం లభించింది. అంత్యకాలంలో అతడు దీక్ష స్వీకరించి 12వ స్వర్గాన్ని పొందగలిగాడు.

తప్పకుండా స్మరించండి -
ఎవరి హృదయంలో నవకార మంత్రం ఉంటుందో
వారిని సంసారం ఏం చేయగలుగుతుంది?

# 86 జైన ధర్మంలో పర్వదినాలు

1 జ్ఞాన పంచమి – ఈ పంచమి కార్తీక శుక్ల పంచమి. ఈ రోజున జ్ఞాన ఆరాధన చేయబడుతుంది. ఎవరికైతే చదవడం,వ్రాయడం రాదో, సూత్రాదులు కంఠస్థములు కావో వారు విధియుక్తంగ జ్ఞాన పంచమి ఆరాధన తప్పకుండా చేయాలి.

2 మౌన ఏకాదశి – ఇది మార్గశిర శుక్ల ఏకాదశి. వేరు వేరు జినేశ్వర భగవానులకు 150 శుభాలు ఈ ఒక్కరోజునే సంభవించాయి. ఈ రోజు మౌనవ్రతంతో పాటు ఉపవాసం,పౌషధ్ మొదలైన ఆరాధన చేయవలసిన పర్వదినం.

3 నవపద ఓలీ – సంవత్సరంలో ఈ ఓలీలు రెండుసార్లు వస్తాయి. తొలి ఓలీ ఆశ్వయుజ శుక్ల సప్తమినుండి పౌర్ణమి వరకు అవుతుంది. ఇది ఆయంబిల్ తపంతో ఆరాధన చేయాల్సిన పర్వదినం. శ్రీపాలుడు,మయణ ఈ తపమాహాత్మ్యం వల్లనే అంతులేని సుఖాలను అనుభవించారు.

4 మూడు చాతుర్మాస్య చతుర్దశిలు – కార్తీక శుక్ల చతుర్దశి, ఫాల్గుణ శుక్ల చతుర్దశి, ఆషాఢ శుక్ల చతుర్దశి ఈ మూడూ చాతుర్మాస్య చతుర్దశిలు. ఈ మూడు చతుర్దశిలలో ఉపవాసం,పౌషధ్‌తో ఆరాధన చేయాలి.

5 పౌష దశమి – ఇది మార్గశిర కృష్ణ దశమి. ఇది శ్రీపార్శ్వనాథ భగవానుడు జన్మించిన శుభదినంగ ఆరాధనచేసే పర్వదినం.

6 అక్షయ తృతీయ – ఇది వైశాఖ శుక్ల తృతీయ. ఇది ప్రథమ తీర్థంకరులు భగవాన్ శ్రీ ఋషభదేవులు ఒక సంవత్సరం, ఒక నెల ఉపవాస దీక్ష విరమించిన రోజు, అంతేకాక ఈ రోజు అనేకమంది తపస్వులు ఒక సంవత్సర తపస్సును విరమించిన రోజు.

7 పర్యుషణ మహాపర్వం – ఇది శ్రావణ కృష్ణ ద్వాదశినుండి భాద్రపద శుక్ల చవితి వరకు నడిచే జైనుల మహాపర్వం. ఇందులో 'సంవత్సరీ' యొక్క చివరిరోజు భాద్రపద శుక్ల చవితి వస్తుంది. ఈ రోజు పరస్పరం క్షమాపణ చెప్పుకునే ఆరాధన నిర్వర్తించాలి. ఎవరైతే శత్రుత్వం,విరోధం విడిచిపెట్టి క్షమాపణ కోరుకోరో వారు నిజమైన జైనులనబడరు.

8 భగవాన్ శ్రీమహావీరుని 5 శుభాలు(కల్యాణక్)

1 చ్యవన శుభం – ఆషాఢ శుక్ల షష్ఠి. భగవానుడు ఈ రోజున దేవలోకంనుంచి దిగివచ్చి తను తల్లిగర్భంలో ప్రవేశించిన రోజు.

2 జన్మ శుభం – చైత్ర శుక్ల త్రయోదశి. ఈ రోజున భగవానునికి త్రిశలాదేవి జన్మ నిచ్చింది.

3 దీక్షా శుభం – కార్తీక కృష్ణ దశమి. ఈ రోజున భగవానుడు రాజపదవి త్యాగం చేసి దీక్ష స్వీకరించిన రోజు.

4 కేవలజ్ఞాన శుభం – వైశాఖ శుక్ల దశమి. ఈ రోజు భగవానుడు ఋజువాలికా నది ఒడ్డున కేవల జ్ఞానం పొందిన రోజు.

5 నిర్వాణ శుభం – ఆశ్వయుజ కృష్ణ అమావాస్య. ఈ రోజున భగవానుడు నిర్వాణం(మోక్షం) చెందారు. వారికి మోక్షప్రాప్తి కలిగింది. వారు శుద్ధ,బుద్ధ ముక్తులయ్యారు.

9 శాసనా స్థాపనా దినం – ఈ పర్వదినం వైశాఖ శుక్ల ఏకాదశి. ఈ రోజున భగవానుడు శ్రీమహావీరప్రభువు శ్రీజినశాసనంయొక్క స్థాపన చేశారు. ఆ జినశాసన సమయ సదస్యులముగా భావించుకుని మనంకూడా మోక్షమార్గ ఆరాధన చేద్దాం.

## 87 మోక్షం తాత్పర్యమేమిటి?

14 రాజలోకాలకు అన్నిటికంటె పైన 'సిద్ధశీల' ఉంది. ఇది స్ఫటికమయం. ఇది 45 లక్షల యోజనాల పొడవున అర్ధచంద్రుని ఆకారంలో ఉంటుంది.

మనం ఎక్కడ ఉంటామో ఆ ఇహలోకానికి(మనుష్యలోకం) సరిగ్గ పైన, చాలాపైన ఈ సిద్ధశీల ఉపస్థితమై ఉంది. ఇక్కడ సిద్ధభగవానుడు సమస్త కర్మలతో నిరంతరం విముక్తుడై శాశ్వతంగ ఉంటాడు. దీని పేరే మోక్షం. ఇది మోక్ష ప్రదేశం.

మోక్షంలో –

రాగ,ద్వేషాలుండవు. క్రోధముండదు. ఇహలోకంలోని ఏ ఒక్క దోషము ఇక్కడ ఉండదు. ఇక్కడ ఎవరికీ శరీరముండదు. అందువలన దేహంవలన జరిగే మమత, మాయకూడా ఇక్కడ ఉండవు. ఇక్కడ పాపచ్ఛాయకూడా ఉండదు. ఇక్కడ ఎవరూ కర్మకు గులాములు కారు. అందుకని ఎవరికీ సలాములు చేయవలసిన అవసరము లేదు.

ఇక్కడ పుట్టుక లేదు. అందువలన మరణమూ లేదు. ఇక్కడ దేహం లేదు. అందువలన తినడం,తాగడం అనే మాటా లేదు. మల,మూత్ర విసర్జన జంఝాటమూ లేదు.

ఇక్కడ సంసారభోగాలు లేవు. అందువలన ఏవిధమైన రోగాలూ లేవు. ఇక్కడ శోకం లేదు. అలసట లేదు. సంతోషం లేదు. చింత లేదు. ఇక్కడ పాపం లేదు. సంతాపం లేదు. ఇక్కడ ఏవిధమైన బంధుత్వభావనలు లేవు. జాతి భేదాలు లేవు. వివాహబంధాలు లేవు.

ఇక్కడ కోరికలు లేవు. రాగం లేదు. కాబట్టి ఇక్కడ ఆశలమంటలు లేవు. ఇక్కడ ఉన్నదల్లా కేవలం గుణాల ఉద్యానవనం.

ఇక్కడ ఆధి,వ్యాధులుండవు. ఉపాధి అవసరం లేదు. ఇక్కడ ఎవరూ వివేకహీనులు లేరు. ఆలోచనలేని పనులు చేసేవారూ లేరు.

ఇంకా ఈ మోక్షంలో ఏముంటుందంటే –

ఇక్కడ కేవలం ఆత్మ సుఖంలో నిత్యసమాధి,అనంతజ్ఞానం,అనంతదర్శనం, అనంతచారిత్రంలో తాదాత్మ్యం చెందడం ఉంటుంది.

సంసారంలో అన్నిటికి అన్నీ చెడ్డవే. అందువలన సంసారం విషంలాగ దుష్టమైనది. మోక్షంలో చెడు కొంచెంకూడా లేదు. అందువలన మోక్షం అమృతంలాంటిది. శాశ్వతమైనది.

# 88 సరస ప్రశ్నోత్తరాలు

ప్రశ్న : జినమందిరంలో అక్షతలతో స్వస్తికచిహ్నం, మూడు చిన్న కుప్పలు, అర్ధ చంద్రుడులాంటి ఆకృతి ఏర్పాటు చేస్తారు ఏమిటి?

జవాబు : స్వస్తిక్, ఇది నాలుగు గతులకు(దేవ,మనుష్య,తిర్యక్,నారక) ప్రతీక. మూడు కుప్పలు జ్ఞాన,దర్శన,చారిత్రమనే మూడు రత్నములకు ప్రతీక. అర్ధచంద్రుడు సిద్ధశీలకు ప్రతీక. జ్ఞానాది మూడు రత్నములను సాధించుకుని, వాటి సాధనద్వారా నాలుగు గతులను నాశనము చేసుకుని మనం సిద్ధశీలను అధిష్ఠించగలగాలి. అంటే మోక్షం పొందాలి. అందుకనే ఇటువంటి ఆకృతిని అక్షతలతో ఏర్పరచడమవుతుంది.

ప్రశ్న : జినమందిరంలో గంట వాయిస్తారెందుకు?

జవాబు : ప్రభువుయొక్క పూజ సక్రమంగ పూర్తి అయింది. అనే ఆనందం ప్రకటించడానికి మందిరంనుంచి బయటకు వచ్చేటప్పుడు గంట మోగిస్తారు.

ప్రశ్న : ప్రభువుయొక్క ప్రతిమను ప్రక్షాళన చేస్తారెందుకు?

జవాబు : మన ఆత్మపై అంటుకుని ఉన్న కర్మరూపమైన మకిలి కడిగేసుకోడానికి మనం ప్రభువుయొక్క ప్రతిమను ప్రక్షాళన చేస్తాము.

ప్రశ్న : మందిరానికి వెళ్ళేటప్పుడు నుదుట తిలకం ధరించడమెందుకు?

జవాబు : శ్రీజినేశ్వరదేవుని ఆదేశాలనన్నిటిని స్వీకరిస్తున్నామని అనడానికి ప్రతీకగ మందిరానికి వెళ్ళేసమయంలో నుదుట తిలకం ధరిస్తాము. పురుషులు ఈ తిలకాన్ని శిఖాబంధంవరకు ధరించాలి.

ప్రశ్న : మందిరంలో ప్రవేశించే సమయంలో 'నిసిహీ' అని పలుకుతారెందుకు?

జవాబు : మందిరంలో ప్రవేశించే సమయంలో మూడుసార్లు 'నిసిహీ' అని పలుకుతారు. దాని అర్థం ఏమిటంటే సంసార తాపత్రయాలకి సంబంధించిన సమస్త పాపవ్యవహారాలతోటి నేను నా సంబంధాన్ని తెంచుకుంటున్నాను అని. అందువల్ల మందిరంలో ప్రవేశించిన తరువాత ఏవిధమైన సంసారసంబంధమైన విషయాలు మాట్లాడరాదు. పరిహాసం,వేళాకోళం,అనుచిత ప్రవర్తన చేయకూడదు.

ప్రశ్న : 'నమో జిణాణాం''మత్థఏణ వందామి' అని ఎప్పుడు ఎక్కడ చెప్పాలి?

జవాబు : జినమందిరంలో ప్రవేశించి పరమాత్మ ముఖం చూస్తూ రెండు చేతులూ జోడించి 'నమో జిణాణాం' చెప్పాలి. దారిలో వెళుతున్నప్పుడు జినమందిరంకాని, దాని శిఖరంకాని కనబడగానే 'నమో జిణాణాం' చెప్పాలి. పూజ్య గురుమహరాజ్ కలియగానే(దారిలోనైనా సరే) రెండుచేతులు జోడించి 'మత్థఏణ వందామి' చెప్పాలి.

ప్రశ్న : మాలలో 108 లెక్కేమిటి?

జవాబు : పంచ పరమేష్ఠిలయొక్క మొత్తం గుణాలు 108. అందుకని మాలలో 108 లెక్క చెప్పబడింది. ఆ 108 గుణాలు ఎలాగంటే -

అరిహంతకు - 12, సిద్ధులకు - 8, ఆచార్యులకు - 36,

ఉపాధ్యాయులకు - 25, సాధులకు - 27 = మొత్తం 108 గుణాలు.

## 89 వర్తమాన తీర్థంకరుడు శ్రీసీమంధరస్వామి

మన భారతదేశంలో వర్తమాన అవసర్పిణీలో చివరిది అనగా 24వ తీర్థంకరుడు భగవాన్ శ్రీమహావీరదేవుడు నేటికి 1512 సంవత్సరములకు ముందు ఉండిఉన్నారు. ఆ విధంగ వర్తమాన కాలంలో మహావిదేహ క్షేత్రంలో మిక్కిలి మహాత్ములు,పుణ్యాత్ములు నైన తీర్థంకరులు భగవాన్ శ్రీసీమంధరస్వామీజీ మొదలుగ 20మంది తీర్థంకరులు సంచారం చేస్తున్నారు.

శ్రీసీమంధరస్వామి భారతదేశంలో ఈశాన్యమూల(తూర్పు-ఉత్తరం మూల) వేలకొద్దీ యోజనాల దూరంలో 'పుష్కలావతి' అని పిలువబడే విజయంలో దేహయుక్తులై విహరిస్తున్నారు. మనం ప్రతిరోజూ ఉదయం ప్రతిక్రమణలో ఈ పరమాత్మునికి చైత్యవందనం,స్తవనం మున్నగువాని ద్వారా భక్తి ప్రకటిస్తున్నాం.

పుష్కలావతి విజయక్షేత్రంలో వచ్చేటటువంటి పుండరీకిణీ నగర రాజు శ్రేయాంసప్రభువుకి సంసారంలో ఉన్నప్పుడు జనకులు. స్వామి తల్లి సత్యకి. స్వామి సంసారంలో ఉన్నప్పుడు వారి భార్య రుక్మిణి. స్వామి దేహం ఎత్తు 500 ధనుస్సులు. వారి పరిచయ చిహ్నం(లాంఛనం) ఎద్దు.

స్వామి జననం చైత్ర కృష్ణ పాడ్యమినాడు జరిగింది. ఫాల్గుణ శుక్ల త్రయోదశినాడు వారు దీక్ష స్వీకరించారు. చైత్ర శుక్ల త్రయోదశినాడు వారు కేవలజ్ఞానాన్ని పొందారు.

స్వామి పరివారంలో 84మంది గణధరులు, 10లక్షల కేవల జ్ఞానులు, 100కోట్లు సాధులు, 100కోట్లు సాధ్విలు ఉన్నారు. శ్రావక,శ్రావికలు లెక్క అనంతం. స్వామి పూర్ణాయుర్దాయం 84లక్షల సంవత్సరాలు(ప్రథమ తీర్థంకరులు ఋషభదేవ భగవానుని అంత)

ఇటువంటి శ్రీసీమంధరస్వామీజీ మహిమ అపారం, అనంతం.

## 90 భవిష్యత్ తీర్థంకరులు శ్రీపద్మనాభస్వామి

రాజా శ్రేణిక మగధ దేశానికి గొప్ప రాజు. ఆయన 24వ తీర్థంకరులు భగవాన్ శ్రీమహావీరదేవునికి చాలా గొప్ప భక్తుడు. భగవాన్ మహావీరుని దర్శనం చేసుకునేంత వరకు ఆయనకు సరైన ధర్మమార్గ ప్రవర్తన(సమ్యక్త్వం) లేదు. ఇది ముందటి మాట.

రాజా శ్రేణికకు వేట అంటే మహా ప్రీతి. ఒకసారి ఆయన అడవికి వేటకు వెళ్ళాడు. అక్కడ ఒక లేడి పారిపోతుంటే చూశాడు. ఆయన బాణం సంధించి సూటిగ కొట్టేసరికి ఆ బాణం దాని కడుపులోంచి దూసుకుపోయి అవతలివరకు వెళ్ళింది. ఆయన ఆ పడిపోయిన లేడిదగ్గరకు వెళ్ళి చూసేసరికి అది గర్భిణీ అని తెలిసింది. రాజు బాణం గర్భం చీల్చుకుని వెళ్ళడంతో లేడి,లేడి గర్భంలోని రెండు పిల్లలుకూడా చినిపోయాయి.

ఇది చూచి రాజా శ్రేణిక మనస్సులో 'ఆహా! నేనెంత గొప్ప విలుకాణ్ణి. ఒకే బాణంతో నేను ఒక జంతువునే కాదు. 2,3 జంతువులనుకూడా చంపగలిగేను. నేను ధనుర్విద్యలో ఎంత గొప్పవాణ్ణి' అని తనను తాను ప్రశంసించుకున్నాడు. ఒక పక్క పశుహత్య అనే ఘోరపాపాన్ని చేశాడు. చాలదని పైగా తనని తాను పొగడుకుంటున్నాడు. పాపం చేయడమే కాక దాన్ని ప్రశంసించుకోడం మరింత పాపం. ఇలాంటి మహాపాపం చేసి రాజా శ్రేణిక యాతనలకు నిలయమైన ప్రథమ నరకంలో జన్మకు ఆయుష్షును సంపాదించుకున్నాడు.

ఈ సంఘటన జరిగిన తరువాత రాజా శ్రేణికకు ప్రభువు మహావీరుని దర్శనం లభించింది. ప్రభువుయొక్క ఉపదేశంతో రాజు మాంసాహారం,వేట మొదలైన సమస్త పాపాలను విడిచిపెట్టాడు. నాటినుండి గొప్ప శ్రావకుడయ్యాడు. అంతేకాదు, ఎంతటి భక్తి చూపాడంటే, ఆయన్ని తీర్థంకరుడనేటంతటి పేరు సంపాదించాడు.

ఆయన తన మొదటి నరక జీవనాన్ని ముగించుకుని, భవిష్యత్తులో వచ్చే 24 తీర్థంకరులలో పద్మనాభ పేరున మొదటి తీర్థంకరులవుతారు. రాజా శ్రేణిక భగవాన్ మహావీరుల భక్తిసేవ చేస్తూనే ఎంతగా వారి ధ్యాసలో ఐక్యమయ్యారంటే తీర్థంకర పద్మనాభస్వామిగ జన్మించినప్పుడు ఆయన మహావీరదేవునంతటి ఆయుష్షు(72) అంతే ఎత్తు పొందే సౌభాగ్యం సంపాదించుకున్నారు.

భగవాన్ మహావీరదేవుని పరమ భక్తుడైన రాజా శ్రేణిక ఆత్మకు మన అనంత వందనాలు.

# 91 అరవైముగ్గురు శలాక పురుషులు

ప్రతి ఒక్క ఉత్సర్పిణి(ఉన్నతి) కాలంలోనూ అలాగే అవసర్పిణి(అవనతి) కాలంలోనూ అరవైముగ్గురు శలాక(శ్రేష్ఠులు) పురుషులు ఉంటారు. అనగా విశిష్టరీతిలో గొప్ప పుణ్యాత్ములైన అరవైముగ్గురు పురుషులు ఉంటారు.

ఇరవైనలుగురు తీర్థంకరదేవులు, పన్నెండుగురు చక్రవర్తులు, తొమ్మిదిమంది బలదేవులు, తొమ్మిదిమంది వాసుదేవులు, తొమ్మిదిమంది ప్రతివాసుదేవులు. ఈ విధంగ మొత్తం అరవైముగ్గురు శలాక పురుషులు ఉంటారు. తీర్థంకరదేవులు ఆజన్మలోనూ, మిగిలిన శలాక పురుషులు ఆజన్మలోనే కాని లేదా వచ్చే జన్మలో కాని నిశ్చయంగ మోక్షాన్ని పొందుతారు.

(1) ఇదవైనలుగురు తీర్థంకరదేవులు - (67లో వీరి పూర్తి విషయం చెప్పబడింది.)

(2) పన్నెండుగురు చక్రవర్తులు - 1 భరత, 2 సగర, 3 మధవ, 4 సనత్కుమార, 5 శాంతినాథ, 6 కుందునాధ, 7 అరనాధ, 8 సుభూమ, 9 పద్మ, 10 హరిషేణ, 11 జయ, 12 బ్రహ్మదత్త.

వీరిలో 1,2,5,6,9,10,11 చక్రవర్తులు మోక్షాన్ని పొందారు. 3,4 చక్రవర్తులు దేవలోకంలో ఉన్నారు. 8,12 చక్రవర్తులు ఏడవ నరకానికి వెళ్ళారు.

(3) తొమ్మిదిమంది వాసుదేవులు - 1 త్రిపృష్ఠ(భగవాన్ మహావీరుల జీవుడు) 2 ద్విపృష్ఠ, 3 స్వయంభూ, 4 పురుషోత్తమ, 5 పురుషసింహ, 6 పుండరీక, 7 దత్త, 8 లక్ష్మణ, 9 కృష్ణ.

వీరిలో మొదటి వాసుదేవుడు ఏడవ నరకానికి వెళ్ళాడు. 2,3,4,5,6 వాసుదేవులు ఆరవ నరకానికి, 7వ వాసుదేవుడు అయిదవ నరకానికి, 8వ వాసుదేవుడు నాలుగవ నరకానికి, 9వ వాసుదేవుడు మూడవ నరకానికి వెళ్ళారు.

(4) తొమ్మిదిమంది బలదేవులు - 1 అచల, 2 విజయ, 3 భద్ర, 4 సుభద్ర, 5 సుదర్శన, 6 ఆనంద, 7 నందన, 8 రామచంద్ర, 9 బలభద్ర.

వీరిలో 1 నుండి 8 వరకు మోక్షం పొందారు. 9వ బలదేవుడు అయిదవ దేవలోకానికి వెళ్ళాడు.

(5) తొమ్మిదిమంది ప్రతివాసుదేవులు - 1 హయగ్రీవ, 2 నారక, 3 మేరక, 4మధు, 5 నిష్కుంభ, 6 బలి, 7 ప్రహ్లాద, 8 రావణ, 9 జరాసంధ.

ప్రతివాసుదేవులు వాసుదేవునికి ఘోర శత్రువులు. వాసుదేవుని చేతిలోనే మరణించి నరకం చేరుకున్నారు.

## 92 స్వర్గం నుంచి దిగిన బంగారంలాంటి వాక్యాలు

* వినయం ధర్మరూపమైన వృక్షానికి మూలం. వినయం ధర్మనగరానికి ప్రవేశద్వారం. కేవల జ్ఞానంయొక్క బీజం వినయంలో నిక్షిప్తమై ఉంటుంది. అందుకోసం చక్కటి వినయవంతుడు కావాలి.

* దుఃఖములతో నిండియున్న, పాపములతో భయానకమైన ఈ సంసారరూప అరణ్యంలో నుండి సులభంగ బయటపడాలంటే –

వినయరూపమైన దీపము, నమ్రతారూపమైన డాలు, వివేకరూపమైన లాఠీ వీనితో సంసిద్ధుడవై బయలుదేరాలి. ఎవరి జీవనగమనంలో ఈ మూడుగుణాలు ఉంటాయో వారు సంసారానికి భయపడవలసిన అవసరంలేదు.

తుచ్ఛవిచారములనే చెత్తాచెదారముతో జీవనరూపమైన ఉద్యానవనాన్ని దుర్గంధ భూయిష్టం చేసుకోకూడదు. జీవన ఉద్యానవనాన్ని ఆరాధన అనే గులాబీలతో పరిమళ భరితంగ ఉంచుకోడానికి నిరంతరం ప్రయత్నిస్తూ ఉండాలి.

పవిత్ర జీవితాన్ని అనవరతం ప్రశంసాత్మకంగ తలుస్తూ ఉండాలి. పవిత్రతను నిరంతరం సమర్థించేవారై ఉండాలి. జీవితంయొక్క సమస్త క్షేత్రాలలో సహిష్ణుతతోనే మీ జీవనయంత్రం సిద్ధం కావాలి. ఏ మనుష్యుడైతే జీవితాంతం వినమ్ర విద్యార్థిగ ఉంటాడో అతడే అసలైన విద్వాంసుడు. వినయం జీవితానికి అన్నిటికంటె గొప్ప పెట్టుబడి. విద్య వినయంచేతనే శోభిస్తుంది.

* ఎంత పెద్ద గొప్ప సిద్ధిని పొందినవాడైనా, ఎప్పుడైతే సాధకుడు తన సిద్ధినిగూర్చి అహంకారపూరితుడవుతాడో, అదే అతని పతనానికి కారణమవుతుంది. అందువలన ఎప్పుడూ అభిమానం,అహంకారం దరికి రానివ్వకూడదు.

* విద్యాభ్యాసం చేసే సమయంలో వినయవంతుడైనట్లయితే చక్కగ వానికి విద్య జీర్ణమవుతుంది. అలాకాక, విద్యాభ్యాస సమయంలో అహంకారి అయితే, చెప్పేదేమునంది, వానికి ఆ విద్య అజీర్ణమే అవుతుంది.

* లోకంలో అందరికంటె ధనవంతుడెవరు?

ఎవరైతే తృష్ణ (ఆసక్తి) నుండి విముక్తులవుతారో వారే కాక ఇంకెవరు?

* స్నానం చేస్తే దేహం పరిశుద్ధమవుతుంది. దానం చేస్తే సంపాదన పరిశుద్ధ మవుతుంది. ధ్యానం చేస్తే మనస్సు పరిశుద్ధమవుతుంది. జ్ఞానార్జనచేత జీవితం

పరిశుద్ధమవుతుంది. తపస్సుచేత ఆత్మ పరిశుద్ధమవుతుంది.

* ఆస్తిపాస్తులిస్తే అవమానాలొస్తాయి. ఎప్పుడు సంపద వస్తుందో దాని వెనకే గర్వం,అహంకారం వస్తాయి. ఎప్పుడు సంపద నశిస్తుందో అప్పుడు ఆ అహంకారం రెట్టింపవుతుంది. అందువలన సంపదను గుడ్డిగ ప్రేమించేవారు కాకూడదు.

* మౌనంగ ఉండాలి.(నోరు జాగ్రత్త చేసుకోవాలి) ఎప్పుడైతే ములిగిపోతున్నాడో, ఎప్పుడు కోపం పెచ్చుమీరుతోందో, అప్పుడు మౌనం పాటించండి. ఇలాచేస్తే ఎంతవరకు జీవితం ఛిద్రమై, నష్టపోతుందో దానినుండి రక్షింపబడతారు.

* నాలుక - దీన్ని సద్వినియోగం చేసుకుంటే అంత మంచిది లేదు. దురుపయోగం చేసుకుంటే అంత చెడ్డదీ లేదు.

* ప్రేమ – ఇది ఒక గరుడ మంత్రం. ప్రాణాంతకమైన పామువిషాన్ని పిండేవాడు ఎలాగయితే గరుడమంత్రాన్ని జపిస్తాడో అలాగే క్రోధము,వైరము అనే జన్మజన్మల భయంకర విషాన్ని పిండే మంత్రం 'ప్రేమ'.

ప్రభు మహావీరదేవునియొక్క 'ఓ చండకౌశికా! బాధను స్వీకరించు, స్వీకరించు' అనే శబ్దరూపమైన అమర ప్రేమమంత్రం దుష్ట విషసర్పరూపుడైన చండకౌశికుణ్ణి ఉద్ధరించింది. దుఃఖమయమైన నరకగతిని పొందవలసిన సర్పజీవనంలోనే వానికి దేవగతి సాధ్యమయింది. ప్రేమరూపమైన గరుడమంత్రంయొక్క ప్రభావం అలా అసమానమైనది. అందువలన లోకంలోని సమస్త జీవులపట్ల నిర్మల ప్రేమభావం కలిగి ఉండాలి.

* మీరు వినయము,వినమ్రతయొక్క శిఖరాన్ని చేరగలిగినట్లయితే అప్పుడు సుఖము,శాంతి మీనుండి దూరము కావు.

* నేను ఎవరిని? సహజానంది,శుద్ధస్వరూపి, అవినాశీ నీవే ఆత్మస్వరూప !

(పూజ్య ఆచార్య శ్రీ కలాపూర్ణ సూరి విరచిత "తత్త్వజ్ఞాన ప్రవేశిక" కొంత పరిష్కరణపూర్వకంగ గ్రహింపబడినది.)

## 93 సరియైన శ్రావకునికి 21 గుణాలు

సరియైన శ్రావకుడు 21 గుణాలతో శోభిస్తూ ఉంటాడు. అటువంటి ఉత్తమ గుణాలు మనకీ మన జీవితంలో లభించాలి. అందుకోసం మనం నిరంతరం ప్రయత్న శీలురం కావాలి.

1 అక్షుద్రులు – ఏది క్షుద్రము,తుచ్ఛము అని మనస్సుకు అనిపించదో అలాంటి ఉదారము,ధీరము,గంభీరము కలవారు.

2 రూపవంతులు – అయిదు ఇంద్రియములతో వ్యవస్థీకరింపబడిన పరిపూర్ణ శరీరంతో ఎవరైతే ధర్మారాధనతో అందంగ ప్రవర్తించగలరో వారు.

3 సౌమ్యులు – సహజంగ శాంతం (మంచిగంధంలా చల్లగ, ఎదుటివారినికూడా శాంతులుగ ఉపశాంతి పొందించ) గలవారు.

4 జనప్రియులు – తమ మంచిగుణాలతో లోకులకు ప్రీతిపాత్రులవుతారు. లోకవ్యవహారానికి విరుద్ధమైన ప్రవర్తన లేనివారు.

5 అక్రూరులు – నిర్మలమైన మనస్సు కలవారు. విషపూరితత్వం,క్లిష్టత్వం, క్రూరత్వం లేనివారు. ఇతరుల దుఃఖాలను దూరం చేసేవారు. సానుభూతి చూపేవారు.

6 పాపభీరులు – ఇహలోక,పరలోక సంబంధమైన దుఃఖాలనుండి, అపకీర్తి, పాపములనుండి భయపడేవారు.

7 అశఠులు – విశ్వసనీయ,ప్రశంసనీయమైన పలుకులు,ఆలోచనలు, ప్రవర్తనలో అహంకార శూన్యత్వం అనగా సరళమైన ప్రవర్తనకలవారు.

8 దాక్షిణ్యోపేతులు – ఇతరుల యోగ్యమైన ప్రార్థనలను ఆదరించేవారు దాక్షిణ్య గుణయుక్తులు. తమ పనులను విడచిపెట్టి ఇతరులకు ఉపకారం చేసేవారు.

9 లజ్జాళువులు – కూడనిపని చేసేటప్పుడు సిగ్గుపడడం,సదాచారి,తాను ఎన్నడూ అనుచిత కార్యములు చేయకుండడం. ఒకవేళ తెలియక జరిగితే పశ్చాత్తాపపడేవాడు.

10 దయాళువులు – దుఃఖితులు,దరిద్రులు,పేదల విషయంలో అంతఃకరణలో దయాస్వభావం కలవారు.

11 సౌమ్యదృష్టులు - తీవ్రమైన అనురాగం,ద్వేషం భావాలులేనివారు. పక్షపాతం లేనివారు. సత్యంకోసం అనుక్షణం ఆరాటపడేవారు.

12 గుణానురాగులు - గుణవంతులైన మనుష్యుల గుణాలను గూర్చి ఆదరం, గౌరవం కలవారు. ఇతరుల దోషాలను ఎంచనివారు.

13 సత్కథనులు - ధర్మసంబంధమైన కథలు,మాటలయందాసక్తి,అనురాగం కలవారు. పాపసంబంధమైన కథలకు,మాటలకు దూరంగ ఉండేవారు.

14 సుపక్షయుక్తులు - అందరితో స్నేహము,స్వజనమందు,ధర్మమందు అనురాగం కలవారు. చెడుప్రవర్తనకల మనుష్యులను దూరంగ ఉంచడం, వారి స్నేహం విడిచి పెట్టడం చేసేవారు.

15 దీర్ఘదర్శులు - ప్రతిపనిలోను మంచి-చెడు,లాభము-నష్టము మొదలైనవి తెలుసుకుని వివేకపూర్వకంగ ప్రవర్తించేవారు.

16 విశేషజ్ఞులు - ధర్మంయొక్క విశిష్ట స్వరూపాన్ని గ్రహించిన వారవడంచేత ప్రతివస్తువుయొక్క గుణదోషముల మర్మం తెలిసినవారు.

17 వృద్ధానుగులు - శిష్టాచారయుక్తులైన మనుష్యులను,మర్యాదలను అనుసరించేవారు.

18 వినీతులు - తమకంటె అధిక గుణవంతులయందు వినయం ఆచరణలో చూపేవారు. మంచి వినయవంతులైనవారు.

19 కృతజ్ఞులు - ఇతరులు చేసిన ఉపకారాన్ని ఎన్నడూ మరువనివారు. తల్లి,తండ్రి,గురువు మొదలైనవారి ఉపదేశములను నిత్యం జ్ఞాపకం చేసుకునేవారు.

20 పరహితైషులు - ఎవరైన చెప్పనీ,చెప్పకపోనీ తమ స్వార్థం చూసుకోకుండా ఇతరులకు మంచి చేయడంలో తత్పరులు, నిమగ్నులు.

21 లబ్ధలక్ష్యులు - మానవజీవితంయొక్క లక్ష్యం మంచి-చెడులు, సారయుక్త - సారహీన వీటి వివేకము కలిగియుండడం. మోక్షాన్ని ఆరాధించడం. ఇవే జీవితసాఫల్య లక్షణాలు,జీవిత ధ్యేయాలు. ఈ విషయాలను లోతుగ గ్రహించినవారు.

## 94 శ్రావకుల 36 కర్తవ్యాలు

జినశాసనాన్ని అనుసరించే శ్రావకులు తమ జీవితంలో 36 చేయవలసిన పనులను (కర్తవ్యాలను) అవశ్యం ఆచరించవలసి ఉంది.

1 శ్రీ తీర్థంకరపరమాత్మయొక్క ఆదేశాలను నిరంతరం పాటిస్తూ ఉండాలి.

2 మిధ్యాత్వాన్ని త్యాగం చేయాలి.

3 సమ్యక్త్వ ధారణ చేయాలి.

4 – 9 చౌ విసత్థో, వందనం, సామాయిక్, ప్రతిక్రమణ, కార్యోత్సర్గం, పచ్చక్ఖాణ ఈ ఆరు ఆవశ్యకముల ఆరాధనలో ప్రయత్నశీలురై ఉండాలి.

10 అష్టమి,చతుర్దశి మొదలైన పర్వతిధులలో పౌషధ వ్రతాన్ని పాటించాలి.

11 యోగ్యులైనవారికి (సుపాత్ర) దానం చేయాలి.

12 సదాచారయుక్తజీవనం (బ్రహ్మచర్యం) పాటించాలి.

13 బాహ్య,ఆభ్యంతర తపానికి చెందిన ఆరాధన చేస్తూ ఉండాలి.

14 మైత్రి,ప్రమోదం,కరుణ,మాధ్యస్థ్యం ఈ నాలుగు భావనలు, శుద్ధభావం మనసులో స్థిరంగ ఉంచుకోవాలి.

15 అయిదు విధాలైన స్వాధ్యాయం చేస్తూ ఉండాలి.

16 నవకార (నమస్కార) మంత్రంయొక్క జపం చేస్తూ ఉండాలి.

17 ఇతరులకు ఉపకారం చేస్తూ ఉండాలి.

18 యతనా–జయణా అలాగే దయాస్వభావం కలిగి ఉండాలి.

19 జినేశ్వర భగవానుని స్తుతిస్తూ ఉండాలి.

20 గురు భగవానుని స్తుతిస్తూ ఉండాలి.

21 జినేశ్వర భగవానుని పూజ చేస్తూ ఉండాలి.

22 సాధర్మిక సోదరులయందు భక్తి కలిగి ఉండాలి.

23 అన్ని వ్యవహారాలు పరిశుద్ధంగ చేయాలి.

24 రథయాత్ర నిర్వహించాలి.

25 తీర్థయాత్రలు చేయాలి.

26 క్షమాగుణం కలిగి ఉండాలి.

27 సత్యము,అసత్యము వివేచనా జ్ఞానము కలిగి ఉండాలి.

28 జీవితంలో సంవర ఆచరించాలి.

29 మాటలాడటంలో వివేకం చూపాలి.

మాటల పొందిక, తక్కువ మాటలాడటం ఉచితరీతిని పాటించాలి.

30 ఆరువిధాలైన సమస్తజీవులయందు కరుణ కలిగి ఉండాలి.

31 ధార్మికులు, ఆరాధన సలిపేవారితో పరిచయం పెంచుకోవాలి.

32 పంచేంద్రియాలను తన నియంత్రణలో ఉంచుకోవాలి.

33 దీక్ష స్వీకరించాలనే భావం నిరంతరం మనసులో ఉండాలి.

34 సంఘం విషయమై గౌరవం, ఆదరణ కలిగి ఉండాలి.

35 ధర్మశాస్త్ర సంబంధమైన ధార్మికవిషయాలను వ్రాస్తూ,వ్రాయిస్తూ ఉండాలి.

36 తీర్థములు,శ్రీజినశాసన ప్రచార,ప్రసారాలు చేస్తూ ఉండాలి.

ఈ 36 కర్తవ్యములు పాటించేరీతిలో మనమందరం మన శ్రావకజీవనాన్ని సఫలం,సార్థకం చేసుకుందాం.

## 95 శ్రావకుని జన్మకృత్యం

కోట్లాది రూపాయలు, లక్షలాది రత్నాలు కంటె చాలా విలువైనది ఈ మానవ జన్మ. ఇందులోనూ ఉత్తమమైనది జైనసంఘంలో శ్రావకరూపంలో జన్మించడం. అటువంటి శ్రావక జీవితాన్ని ధన్యము,సార్ధకము చేసుకోడానికి ఈ క్రింద చెప్పబడిన జన్మకృత్యాలను ఆచరించాలి.

జన్మకృత్యములు అంటే తన జీవితకాలంలో కనీసం ఒక్కసారైనా దేనిని ఆచరించ వలసి ఉందో అలాంటి కృత్యములు (పనులు).

1 చైత్య నిర్మాణం – శ్రావకుడు శ్రీజినేశ్వర పరమాత్మయొక్క అనంత ఉపకారముల ఋణమునుండి విముక్తుడు కావడానికి తన స్వంత ద్రవ్యంతో తీర్థంకర ప్రభువు విరాజమానుడైన చక్కని జినమందిరం కట్టించాలి. ఈ పని చేసే సమయంలో శాస్త్రములలో చెప్పినవిధంగ సమస్తవిధులను చక్కని రీతిలో పాటించాలి. నూతన జినమందిరం స్థాపించడంతోపాటు ప్రాచీన జినమందిరాలకు జీర్ణోద్ధరణకూడా అవశ్యం చేపట్టాలి.

2 జినప్రతిమ – తన స్వంత ద్రవ్యంతో శ్రీజినేశ్వర పరమాత్మయొక్క సుందర ప్రతిమను విధియుక్తంగ తప్పక చేయించాలి.

3 జినప్రతిష్ఠ – తన స్వంత ద్రవ్యంతో చేయించిన జినప్రతిమను జినమందిరంలో ఆత్యంత ఆనందోత్సాహాలతో ఉల్లాసంగ,ఆడంబరంగ ప్రతిష్ఠించాలి. అది గొప్ప మంగళకరమైన ఉత్సవంగ భావించాలి.

4 పుత్రదీక్ష – తమ సంతానానికి దీక్ష ఇప్పించి సాధు,సాధ్వీజీ వనంలో మంగళకరమైన మార్గంలో జీవించడానికి ప్రోత్సహించాలి,పంపాలి.

5 గురు ఉపాధి – తమ గురుదేవులకు గణి, పంన్యాస, ఆచార ఉపాధి(పదవి) అభించినపుడు దానిని మహోత్సవంగ భావించాలి.

6 శాస్త్రలేఖనం – ధర్మశాస్త్ర గ్రంథాలు స్వయంగ వ్రాయగలగాలి. ఇతరులచే వ్రాయించాలి. శాస్త్ర విషయముల పఠన,పాఠనములు చేయిస్తూ ఉండాలి.

7 పౌషధశాలానిర్మాణం – పౌషధ్ మొదలైన ధర్మారాధన చేసి ఎక్కడ ఆత్మకల్యాణంయొక్క ఆరాధన జరుగుతుందో అలాంటి సౌషధశాల నిర్మాణం జరపాలి.

ఇంతేకాక 11 ప్రతిమలను వహించే ఆరాధనకూడా శ్రావకుడు చేసట్టాలి.

# 96 మననయోగ్యమైన ప్రశ్నోత్తరాలు

ప్రశ్న : ప్రతిక్రమణ అంటే ఏమిటి?

జవాబు : ప్రతిక్రమణ అంటే పాపములను దరికి రాకుండా తరిమివేయడం. ప్రతిరోజు ఉదయం,సాయంత్రం చేయవలసిన శ్రీజినేశ్వర భగవానునిద్వారా ప్రకటింపబడిన ప్రతిక్రమణ క్రియద్వారా ఆత్మలో ప్రవేశించిన పాపాలన్నీ దుళ్ళకొట్టబడతాయి. పాపాలన్నీ నాశనమవుతాయి. ప్రతిక్రమణ స్వచ్ఛస్వభావంతోను, శ్రద్ధతోను చేయాలి. ప్రతీ జైనుడు కనీసం సంవత్సరంలో మహాపర్వదినంనాడు ప్రతిక్రమణ తప్పక ఆచరించాలి.

ప్రశ్న : రాత్రి భోజనం ఎందుకు చేయకూడదు?

జవాబు : శ్రీజినేశ్వర భగవానుడు రాత్రి భోజనాన్ని ఘోర పాపంగ ప్రకటించాడు. ఎందుకంటే రాత్రి భోజనం చేసేవారికి వచ్చే జన్మలో కాకి,గుడ్లగూబ,నక్కపిల్లి,పాము, తేలు,బల్లి మొదలైన తిర్యక్కుల దుష్టజన్మ లభిస్తుంది.

అంతేకాకుండా ఈ జన్మలోకూడా ప్రత్యక్షంగ చాలాహాని కలుగుతుంది. భోజనంలో ఏదైనా పేను వస్తే జలోదరం వస్తుంది. ఈగ వస్తే వాంతులు, చిన్న సాలీడు వస్తే కుష్ఠురోగం వస్తుంది.

ఇంకా చెప్పాలంటే రాత్రివేళ చేసిన భోజనం సరైన పద్ధతిలో జీర్ణంకాదు. దీనివలన అజీర్ణం కంటిరోగాలు రావడమే కాక కామోద్రేకంవంటి భావోద్రేక రోగాలుకూడా వస్తాయి. ఇలాంటి అనేక కారణాలచేత రాత్రి భోజనం విడిచిపెట్టాలి. లేకపోతే జినాజ్ఞ భంగపరచిన మహాపాపం వస్తుంది.

ప్రశ్న : విగయీ అంటే ఏమిటి?

జవాబు : విగయీ అంటే వికృతి. పాలు,పెరుగు,నెయ్యి,నూని,బెల్లం,నేలమీద పడిన వస్తువులు ఈ ఆరు వికృతులుగ చెప్పబడ్డాయి. ఈ వికృత వస్తువులను అధికంగ తీసుకుంటే (అవసరానికి మించి) ఆత్మ వికృతి చెందుతుంది. నరకము మొదలైన దుర్గతులను పొందుతారు.

ప్రశ్న : ద్విదళం అంటే ఏమిటి?

జవాబు : ద్విదళం లేదా ఇటువంటి ధాన్యాలు వేనినుండైతే నూని లభించదో, వేనికైతే రెండు బద్దలు ఉంటాయెా అవి ద్విదళం అనబడుతుంది. ఎలాగంటే చిక్కుడు,బఠాణి,పెసలు,మినుములు,కందులు,శనగలు మొదలైనవి. ఇలాంటి ద్విదళములతోపాటు పచ్చిపాలు,పెరుగు,మజ్జిగ మొదలైనవి కలిపి చక్కగ వేడిచేయబడక తినరాదు. ఎందువల్లనంటే ఈ రెండింటి సమ్మిశ్రణంవలన అసంఖ్యాకములైన ద్వి ఇంద్రియ జీవులు ఉత్పన్నములవుతాయి.

## 97 శ్రీ జైన శాసనంలోని అమృతవచనాలు

* మోక్షంతో సమానమైన మరో గొప్ప ధ్యేయము ఏదీ లేదు.
మోక్షం పొందడా నికి 'రత్నత్రయి'తో సమానమైన గొప్పసాధనం మరొకటిలేదు.
* సమ్యక్‌దర్శనం అనేది ఒకరత్నం. దానిరక్షణకోసం 'విరతి'అనే డబ్బా ఉంది.
* దుఃఖంవలన దీనుడవడం, నిష్క్రియాపరుడవడం పాపం.
సుఖాలమత్తులో మునగడం మహాపాపం.
* చక్కని ధార్మికుడు, ధర్మపరుడైన మనుజునికి –
చావంటే భయముండదు. బ్రతుకుమీద ఆసక్తి ఉండదు.
దుఃఖం అంటే పారిపోడు. సుఖాలకోసం పరుగులు పెట్టడు.
* ఈ విషయాలను ఎప్పుడూ మరిచిపోకండి –
దుఃఖానికి మూలం పాపం. సుఖానికి మూలం ధర్మం.
పాపానికి మూలం సుఖాలమీది రాగం(ఆసక్తి).
* జీవితంలో సుఖపడాలంటే –
ఎవరిమీద ఆధారపడకండి. ఎవరి అపేక్ష కోరకండి.
అధైర్యపడి మిమ్మల్ని మీరు కంగారు పెట్టుకోకండి.
ఆవేశపడి ఎన్నడూ ఉద్రేకపడిపోకండి.
* ఈ మాత్రం జ్ఞాపకముంచుకోండి –
పుట్టుకవంటి రోగం మరొకటి లేదు. కోరికవంటి దుఃఖం మరొకటి లేదు.
సుఖాసక్తివంటి పాపం మరొకటి లేదు.
* పశ్చాత్తాపంవలన పాపం నశిస్తుంది.
పాపం నశించడంవలన చిత్తశుద్ధి కలుగుతుంది.
చిత్తశుద్ధివలన పరమపదం లభిస్తుంది.
* పుట్టుకవలన భయం, పాపంవలన పశ్చాత్తాపం, చెడునుగూర్చి బెదురు
ఇవి ఆధ్యాత్మిక మార్గానికి తొలి మూడు మెట్లు.
* క్రోధము,కామము మొదలైన కషాయములు దొంగలవంటివి.
ధర్మం పోలీసులాంటిది. ధర్మరూపమైన పోలీసు కషాయరూపమైన దొంగలపై
అంకుశంలా ఉంటుంది.

## 98 నిజమైన జైనుడెవరు?

1 'నన్ను నా కర్మలనుండి విముక్తుణ్ణి చెయ్యి' ఈ లక్ష్యంతో జీవితమంతా సమస్త కార్యాలను ఎవరు ఆచరిస్తారో వారు జైనులు.

2 అర్థము,కామము వీటి సేవలో ఉండినప్పటికీ ఎవరైతే అర్ధ,కామములను తమ మనస్సులోనికి చొరనీయక వాటికి బద్ధ శత్రువులా ఉంటారో వారు జైనులు.

3 శ్రీ జినేశ్వర పరమాత్మయొక్క ఆదేశాలను ఎవరైతే తమ జీవత సర్వస్వంగ భావిస్తారో వారు జైనులు.

## 99 ఉగాది రోజున ఏం కోరుకోవాలి?

| | |
|---|---|
| 1 భగవాన్ మహావీరునిలాగ | సహనం(ఓర్పు) |
| 2 శ్రీగణధర గౌతమునిలాగ | వినయం |
| 3 ధన్నాజీ, శాలిభద్రజీలాగ | త్యాగం |
| 4 పుణియా శ్రావకునిలాగ | సామాయిక్ |
| 5 శ్రేణిక మహారాజులాగ | క్షాయిక సమ్యక్త్వం |
| 6 జగడూశాహ్ సేఠ్‌లాగ | దానం |
| 7 స్థూలభద్ర స్వామీజీలాగ | బ్రహ్మచర్యం |
| 8 ధన్నాకాంతదీలాగ | తపస్సు |
| 9 జీరణ సేఠ్ శ్రావకునిలాగ | భావం |
| 10 శ్రీపాల మహారాజులాగ | సిద్ధచక్రధ్యానం |
| 11 అభయకుమార మంత్రిలాగ | నిర్మల బుద్ధి |
| 12 మేఘకుమార్‌లాగ | జీవదయ |
| 13 కుమారపాలరాజాలాగ | గురుభక్తి |
| 14 పుణ్యమువల్ల లభించే సుఖాలయందు | విరక్తి |
| 15 పాపమువలన లభించే దుఃఖాలయందు | శాంతి |
| 16 జన్మ జన్మలకూ జినశాసనముయొక్క | ప్రాప్తి |
| 17 నిరంతరం ఆత్మస్వభావంలో | తల్లీనత |

స్వస్తి